ఆంధ్ర సచిత్ర వారపత్రిక
విడిప్రతి వెల నాలుగు రూపాయలు!
సంపుటం 82 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక-32
వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)
ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248

# అక్షర ప్రపంచంమీద ఎందుకింతకక్ష?

నేషనల్ ఫ్రంట్ గవర్నమెంటు బజట్లన్నీ ఒక్కవారంరోజుల కాలంలో ప్రకటింపబడ్డాకా- మిగతా సంగతులన్నీ అటుంచి- తపాలా, టెలిఫోన్, రవాణారేట్లు వాటికి తోడుగా పెట్రోలు, డీసిల్ రేట్ల పెరుగుదలల వైపరీత్యమే- అభివృద్ధి చెందుతున్న భారతదేశంలోని మేధావి వర్గాలను వెక్కిరిస్తున్నట్లుగా ఉంది-

తొడపాశంపెట్టి బెల్లంముక్క పెట్టినట్టు- బెల్లంముక్క యిచ్చి మొట్టికాయ మొట్టినట్లు- ఆదాయంపన్ను రాయితీలను ప్రకటించి, అదే వర్గాలనుంచి- పెట్రోలుద్వారా, పోస్టల్ టెలిఫోన్, ట్రావెలింగ్ ఛార్జీలద్వారా వడ్డీతోసహా లాక్కొనే వి.పి.సింగ్ గవర్నమెంట్ బజట్లు ప్రజల కొనుగోలుశక్తిని పరిగణనలోకి తీసుకోలేదు. దేశంలో మనిషికి మనిషికి మధ్య రాష్ట్రానికి రాష్ట్రానికి మధ్య ప్రజలకి ప్రజలకీ మధ్య అంతరాన్ని, దూరాన్ని పెంచేసి, చిల్లరకి రూపాయికి కూడా విలువలేకుండా చేసిన యీ బజట్లు "మనల్ని" పోస్టాఫీసుకి రైలుస్టేషన్కి పోకుండా భయపెడుతున్నాయి.

*7206* కోట్ల రూపాయల లోటుగల సాధారణ బజట్లో యిచ్చిన రుణాలమాఫీ- పెంచిన రక్షణవ్యయం కూడా తిరిగి అన్యమార్గాల ద్వారా ప్రజల నెత్తిమీద రుద్దబడ్డాయి!

గడచిన వారంలోగా కేంద్రం- భారతదేశపౌరుల మీద మొత్తంమీద *4325* కోట్ల రూపాయల 'భారం' వడ్డించింది. ఇందులో నేరుగా గవర్నమెంట్ పెంచిన రేట్లద్వారా వసూళ్లే యెక్కువ. ఇప్పటికే ద్రవ్యోల్బణం, అధికధరల ఒత్తిడిక్రింద నలిగిపోతున్న ఆర్థిక వ్యవస్థని- మరోసారి అందుకు కారణమైన "ధరల"నే - సామాన్య ప్రజానీకం మీద ప్రయోగించి- "ధరలను" మరిన్ని "ధరల"ద్వారా హరింప చేయగలం అనే కొత్త ఆర్థిక సూత్రాన్ని రూపొందించ దలిచారేమో ఫ్రంట్ గవర్నమెంట్?వారికే తెలియాలి!-

పెట్రోలియం ధరల పెంపుద్వారా *836* కోట్లరూపాయిలు, తపాలారేట్ల పెంపుద్వారా *207* కోట్ల రూపాయిలు, టెలిఫోన్ ఛార్జీల పెంపుద్వారా మరో *600* కోట్లరూపాయిలు, రైల్వే మార్గంలో మరో *892* కోట్లరూపాయిలు వసూలు చేయ సంకల్పించిన కేంద్రం కల్పించిన యిన్కమ్టాక్స్ రాయితీల ద్వారా తన పాపాన్ని ఎంతవరకు కడిగివేసుకోగలదో తెలియదు కాని మధుదండావతేగారు అక్షరప్రపంచానికి "మధువు"బదులు తేనెటీగల పోట్లనే ప్రసాదించారు! ధరలు చచ్చినట్లు పెరుగుతాయ్! ఏల పెరుగవు?

# ఇదేమేమి బజట్ జార్జిబాబూ!

"కోళ్లుతినేవాళ్లు పోయి గొర్రెలు తినేవాళ్లు వచ్చారన్న"ట్లుగా వుంది మన రైల్వే బజట్!- ట్రేడ్ యూనియన్ నాయకునిగా వాసికెక్కి మహా సోషలిస్టునని డంబాలు పలికే జార్జిఫెర్నాండేజ్ గారు రైల్వే బజట్లో *186* కోట్ల రూపాయల మిగులు చూపించటం కోసం *892* కోట్ల రూపాయల దాకా మోయలేని భారాన్ని- దరిద్ర నారాయణుల మీద సంపన్న కుబేరుల మీదా- రవాణా మీద కూడా అదనపు ఛార్జీల రూపంలో వడ్డించి- అన్ని వర్గాలను సమదృష్టితో హింసించి కొత్తరకం సోషలిస్టు దృష్టిని రూపొందించారనిపిస్తోంది!- స్లీపర్ కోచ్లలో ప్రయాణించే సామాన్యుడికి "కంటి కునుకు" రాకుండా అతని గుండెలు పిండే అదనంగా అయిదు రూపాయిలు ప్లస్టిక్కెట్ మీద రూపాయి నుంచి యిరవై రూపాయల దాకా అతని జేబులు పిండి వసూలు చేయదలచిన జార్జిగారు ఎయిర్కండిషన్డ్ కోచ్లో ప్రయాణించే భాగ్యవంతులకు "ఉక్క"పోసి ఉక్కిరిబిక్కిరి అయ్యేలాగా- *17* శాతం అదనంగా ముక్కుపిండి వసూలు చేయబోతున్నారు.

దేశంలో ప్రభుత్వరంగంలోని అతి పెద్ద వ్యవస్థ "రైల్వేలు"- ప్రపంచ రైల్వేలలో మనదేశ రైల్వేకి నాల్గవస్థానం వున్నది- అంచేత

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ ముద్రాపకుడు: ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

విజయవాడ 30-3-1990 శక సం. 1912 చైత్రమాసం 10వ తేదీ

మన రైల్వే ప్లాట్‌ఫారం టిక్కెట్‌కి కనీసం రెండు రూపాయలైన రేటు లేకపోతే నామోషిగా వుంటుందన్నట్లుగా రైల్వేలమంత్రి- దాన్ని దారుణంగా పెంచి పరువు కాపాడారు!

బ్రతికిన కాలేజీకాదు రైల్వే ప్లాట్‌ఫామ్- పోనీ అపురూప వస్తు ప్రదర్శనలుగల చచ్చిన కాలేజీ కూడా కాదు అది- చుట్టాలను సాగనంపటానికో స్నేహితులకు స్వాగతం చెప్పటానికో అక్కడికి వెళ్లే వారిని కూడా వదిలి పెట్టరాదన్న "గుత్తాధిపత్యపు" దురహంకారంతో వేసిన శిక్ష లాగా వుంది ప్లాట్‌ఫామ్ టిక్కెట్ ఖరీదు! ఫక్తు వ్యాపార సరళిలో "షైలాకు మార్కు" వడ్డింపులు చేసింది ఫ్రంట్ గవర్నమెంట్!- దీనితో పోలిస్తే వెనుకటి సింధియాగారి కాంగ్రెస్‌రైలు బజట్ చాలా మెరుగు అనిపించింది! రవాణాకు మరో మార్గంలేని మనదేశంలో- *7* నుంచి *10* శాతం దాకా రవాణా ఛార్జీలు పెంచి, అన్నిరకాల ధరలమీద పరోక్షంగా పెంపు విధించిన శ్రీ ఫెర్నాండేజ్ ఆర్థికశాస్త్ర ధురీణతని- సొంత ఖర్చులమీద రైలెక్కే పౌరుడెవ్వరూ హర్షించలేదు. జనతాదళ్ ప్రభుత్వ రథానికి రెండు చక్రాలుగా అమరిన, భారతీయ జనతాపార్టీ, మార్క్సిస్టు పార్టీల గొంతులో వచ్చి వెలక్కాయిలా వడ్డ యీ బజట్ ప్రతిపాదనలను- సాధ్యమైనంత వరకు ఉపసంహరించుకుని శ్రీ వి. పి. సింగ్ తన ప్రమాణ స్వీకార సమయంలో ప్రజలకు ధరలు తగ్గించే ప్రయత్నం చేస్తామని యిచ్చిన వాగ్దానాన్ని అవగింజ అంతయినా అమలు చేస్తారని- ఫ్రంట్ ప్రభుత్వ పాలకుల నుంచి వేరాశేవినా, ఆశించుతున్నాము. రైల్వేలు తంతితపాలా సర్వీసులు వీటి నిర్వహణ ప్రజాహితం కోరి- అవసరమైన సబ్సిడీలతో నిర్వహించటం అవసరమని- ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం అనేక త్యాగాలు చేసి ప్రపంచ వ్యాప్తంగా ప్రశంసలందిన భారతీయ సామాన్యజనుల ఓరిమికి అగ్నిపరీక్ష పెట్టవద్దని విజ్ఞప్తి చేయడం కన్నా- ఏమి చేయగలం?

(19-3-90)

# పదండి లోపలికి!

## ఈవారం ప్రత్యేకం:



## కథలు:



## సీరియల్ నవలలు:



## ఫ్యాషన్లు, శీర్షికలు:





**ముఖచిత్రం:**
టి.వి.మీద కూడా పాప్యులర్ అయిన
**అనితారాజ్**
(ఫొటో: జగ్‌మోహన్)

**పై వారం:**
**అందని మేఘాలు**
(కథల కాణాచి కథ)

# ఇప్పుడు అక్కడకూడా దున్నేవానిదే భూమి..!

సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు పార్టీ గుత్తాధిపత్యం ముగిసింది. రెండు ఖండాల మీద హాయిగా పడుకున్న మదగజం లాంటి సోవియట్ సామ్రాజ్యంలో మనం ఈ కొస నుంచి ఆ కొసకు వెళ్లాలంటే పదకొండుసార్లు గడియారం త్రిప్పుకోవలసి వుంటుంది. ఇంతటి సువిశాల భూభాగం మీద నిన్న మొన్నటి వరకు భూమి ఎవరిదో తెలియదు. దాని మీద కూడా పార్టీ ఆధిపత్యమే వున్నది. దేశంలో పన్నెండు శాతం కూడా లేని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో కూడా తాము దున్నుతున్న భూమి తమదికాదనే ఒక రకమైన వెర్రితో రైతులు పంటలు పండిస్తున్నారు. లక్షల ఎకరాల భూమి సాగుకురాకుండా పాడుబడిపోయి వున్నది అన్నా రైతు సోదరుడు పట్టించుకోలేదు. కాని సోవియట్ యూనియన్‌లో చరిత్రాత్మకమైన మార్పు ఒకటి మార్చి 15 నుంచి చట్టబద్ధమైంది.






ఇప్పుడు అక్కడ కూడా దున్నేవాడిదే భూమి. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలోగాని, సహకార వ్యవసాయ క్షేత్రంలో గాని, మరెక్కడాగాని సాగుక్రింద వున్న కమతాలు యివ్వుడు రైతుల స్వంతమవుతాయి. రాజ్యాంగంలో ఒక సవరణ ద్వారా ప్రైవేటు ఆస్తులకు వీలు కల్పించిన సోవియట్ యూనియన్‌లో అధిక సంఖ్యాకులైన కార్మికులకున్న భద్రత, సదుపాయాలు రైతుకులేవనే అసంతృప్తి ఎంత కాలంగానో రగులుతూనే వుంది. రైతు తన పెరటిలో పండించుకొనే ఆకుకూరలు, కాయకూరలు వారాంతపు సంతలలో అమ్ముకొని కానీ, దమ్మిడీకి సొంత ఆదాయాన్ని పొందటమే

## ఓహ్! వాటే క్రికెటర్!

దగ్గర దగ్గర నలభై సంవత్సరాలు వచ్చిన రిచర్డ్ హ్యాడ్లీ బ్యాటు పట్టుకుంటే పరుగుల వర్షం, బంతి పట్టుకుంటే వికెట్ల పతనం-యివి రెండూ ఖాయం. 400 వికెట్ల కన్నా ఎక్కువ వికెట్లుసంచిలో వేసుకున్న తర్వాత కూడా తాను రిటైరవ్వబోయే ముందు ఆడిన ఆఖరి టెస్టులో కూడా ఆస్ట్రేలియా మీద ఒకే యిన్నింగ్సులో 5 వికెట్లు తీసుకొని రికార్డు పుస్తకాలలో ఒకే యిన్నింగ్సులో ఐదేసి వికెట్ల చొప్పున తీసుకున్న ఏకైక బౌలర్‌గా మరొక కీర్తిపతాకాన్ని ఎగరేసిన న్యూజిలాండ్ క్రికెటర్ రిచర్డ్ హ్యాడ్లీ అంతర్జాతీయ క్రికెట్‌కు గుడ్‌బై కొట్టేస్తానన్నాడు. పరుగులలో సునీల్ మనోహర్ గవాస్కర్ రికార్డును అందుకోవడం ఎంత దుస్సాధ్యమో, వంద టెస్టులు కూడా పూర్తి చేసుకోకుండా నాలుగు వందల వికెట్లు తీసుకున్న ఘనతను తెప్పించుకోవటం మరొక బౌలర్‌కి యించుమించు అసాధ్యం. ఒక చేత్తో బ్యాటింగ్, మరో చేత్తో బౌలింగ్ చేసే రిచర్డ్ హ్యాడ్లీ క్రికెట్‌లో రెండు చేతుల్తోను గంపల కొద్దీ రికార్డులు అందుకున్నాడు. న్యూజిలాండ్‌కి ఈ క్రికెటర్ చేసిన సేవ, అంతర్జాతీయ క్రికెట్‌కి ఈ బౌలర్ తెచ్చిన ఘనత-"లెట్ దెమ్ స్టే ఫరెవర్" అని మన చేత అనిపిస్తాయి. కాని రికార్డులనేవి ఎప్పుడూ బ్రేక్ చేయటానికే వుంటాయి గనుక రిచర్డ్ హ్యాడ్లీ అడుగుజాడల్లో అద్భుతమైన మరో క్రికెట్ యోధుడు "హ్యాట్స్ దాట్" అని అరుస్తూ రావాలి! రిచర్డ్ హ్యాడ్లీకి ప్రపంచ క్రికెట్ అభిమానులు హేట్సాఫ్అంటున్న ఈ తరుణంలో మనం కూడా గొంతు కలిపి జేజేలు చెప్దాం.





'తావుజీ' తీస్తాడు తీస్తాడు అనుకున్న దెబ్బ-రాజీవ్ గాంధీ మనసు ఆనందంతో ఉప్పొంగ-మార్చి 16 సాయంకాలం తియ్యనేతీశాడు. శ్రీ దేవీలాల్ శ్రీ వి.పి. సింగ్‌కి బయట వున్న పదవిలో వున్న ప్రక్కలో బల్లెమే కదా!

అయితే వి. పి. సింగ్ తెల్లజెండా ఎగుర వేసి-ఎన్ని రకాలుగా వీలైతే అన్నివిధాలా బుజ్జగించి ప్రస్తుతానికి యీ వృద్ధసింహాన్ని శాంతింప చేసి- అలక పాన్పు దింపి- తన పరువు కాపాడుకున్నారు. రాజీవ్, చంద్రశేఖర్‌లు కూడా యిది అనుకునే వుంటారు. ఏది యేమైనా యీ మాదిరి ప్రహసనాలు మన రాజకీయాల నైతిక విలువలను దిగజార్చి వేస్తాయి. టైమ్ బాంబులు చేత బట్టుకున్న దేవీలాల్ మున్ముందు ఏమి పథకం వేస్తారో వేచి చూడాల్సిందే.

## మనలో మాట

### 'టానా' కథానికలు

ఉత్తర అమెరికా తెలుగు సంఘం "టానా" ఆంధ్రసచిత్రవార పత్రికల సంయుక్త సాహితీ సంబరం పేరిట మేము నిర్వహించిన పోటీలో కథకులు ఎందరో ఉత్సాహంతో పాల్గొన్నారు. ఈ పోటీలో ఎంపికయి రు. 500ల చొప్పున బహుమతి గెలుచుకున్న ఏడు కథల పేర్లు - రచయితల పేర్లు ఈక్రింద యిస్తున్నాము.

* శిలలో శిల్పం - శ్రీమతి కాకాని కమల.
* శిష్య దక్షిణ - డా. కేతు బుచ్చిరెడ్డి
* సమాధానం - శ్రీ మోదు రాజేశ్వరరావు
* తుఫాన్ వెలసింది - శ్రీ బొమ్మిడి జగదీశ్వరరావు
* ప్రేమా-త్యాగం - శ్రీ మాచన్న సంజీవరెడ్డి
* మంగా! మంగా! - శ్రీమతి ఆర్. ఎస్. హైమ వతి
* అందని బహుమతి - కె. ఆర్. కె. మోహన్

వీరందరికి మా శుభాకాంక్షలు!

"నవలిక"ల పోటీ ఫలితాలు పై వారం వెల్లడిస్తాము.

ఈపోటీలో పాల్గొన్న వారందరికి 'టానా' తరపున, ఆంధ్ర సచిత్ర వార పత్రిక తరపున శుభాకాంక్షలు!

బహుమతి పొందిన రచయితలకి ఉత్తరాలు వ్రాస్తున్నాం. వారి జీవిత విశేషాలు, ఫోటోకూడా వెంటనే పంపమని కోరుతున్నాము.

తప్ప పెద్ద సుఖాలేమీ లేవు. కానీ యిప్పుడు రైతులందరికీ పట్టాలు లభిస్తాయి. తమ తమ పొలాల్ని రైతులు వంశపారంపర్యంగా అనుభవించవచ్చు. అమ్మడానికి మాత్రం వీలులేదు.

'గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికా'ల ఆవిష్కర్త, నవసోవియట్ యూనియన్ విధాత అయిన మిహాయిల్ గోర్బచెవ్ యిప్పుడు సోవియట్ యూనియన్ ఎగ్జిక్యూటివ్ ప్రెసిడెంటు అవటంతో కమ్యూనిస్టు పార్టీ నిరంకుశ పాలన అంతరించి సోవియట్ యూనియన్‌లో కూడా బహుళ పార్టీ విధాన నూతన శకం ఆవిర్భవించింది. సోవియట్ పార్లమెంట్‌లో మూడింతల కన్నా ఎక్కువ మంది ప్రతినిధులు మిహాయిల్ గోర్బచెవ్‌కు దేశవిదేశ రక్షణకు సంబంధించిన అన్ని హక్కులను దత్తం చేస్తూ మొట్టమొదటి దేశాధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఈ అత్యున్నత పదవిలో పార్టీ శ్రేయస్సువరంగా కాక ప్రజాభిమత అనుగుణంగా నాలుగు సంవత్సరాల పాటు మిహాయిల్ గోర్బచెవ్ వ్యవహరించినట్లయితే ఈసారి నేరుగా ప్రజల ద్వారా ఎన్నుకోబడే హక్కు, అవకాశం ఆయనకు లభిస్తాయి.

ఈ కొసన ఆసియా విభాగంలో అజర్‌బైజాన్ గొడవలు సద్దుమణగలేదు. ఆ కొసన బాల్టిక్ సముద్రతీరంలో నృత్యగాన విలాసలోలురైన ప్రజలు సోవియట్ రష్యా కబంధ హస్తం నుంచి బయటపడి స్వంతవ రిపాలన నేర్పాటు చేసుకుంటామని ఆందోళన చేస్తున్నారు. ఆ మూడింటిలో ఒకటైన లిథూనియా స్వయం ప్రతిపత్తిని ప్రకటించుకున్నది. రష్యన్ భాషంత ఎక్కువగా జర్మన్ భాషను కూడా మాట్లాడగలిగిన లాట్వియా దేశ పౌరులు రష్యన్ల దమననీతి క్రింద తాము నలిగిపోతున్నామని ఎప్పటి నుంచో గొణు గుడు ప్రారంభించారు.

సోవియట్ యూనియన్ రాజ్యాంగంలో "రిపబ్లిక్‌లు విడిపోదలచుకుంటే విడిపోవచ్చును, ఐక్యరాజ్య సమితి సభ్యత్వం కోరదలచుకుంటే కోరవచ్చును" అనే నిబంధన ఆది నుంచి వుంది. వివిధ జాతుల అనేక భాషల సమాఖ్య అయిన సోవియట్ యూనియన్‌ని రష్యాగా మనమంతా వ్యవహరిస్తుంటాం. ఇప్పుడు కేవలం ఆ రష్యా ఒక్కటే ఒక్క రిపబ్లిక్‌గా మిగిలిపోయే ప్రమాదం ఎదురు చూస్తున్నట్లనిపిస్తోంది. ఇలా జరుగకుండా ప్రాదేశిక సమగ్రతను కాపాడే ప్రధానమైన బాధ్యత యిప్పుడు మిహాయిల్ గోర్బచెవ్ పైన వుంది. సోవియట్ యూనియన్‌లో 1989-90 సంవత్సరాలలో వచ్చిన అద్భుతమైన మార్పులు వర్తమాన చరిత్ర కాల ప్రవాహ వేగంలో అంతగా గమనించకపోవచ్చునుగాని భవిష్యత్ ప్రపంచం ఈ మార్పులను చదువుకుంటూ ముక్కున వేలేసుకుంటుంది. అబ్బురంతో పాటు ఆనందం కూడా రేపటి ప్రపంచానికి నేటి చరిత్ర అందిస్తుంది.



7 సం.ల తరువాత మళ్లీ కాంగ్రెస్ బజట్: ప్రస్తుతానికి 'పన్ను'పోటులేని 196 కోట్ల లోటు బజట్‌ను సమర్పించిన ఆర్థిక మంత్రి శ్రీ కె. రోశయ్య- విద్యుత్ రంగానికి 436 కోట్ల రూపాయలు కేటాయించారు. ఆర్డినెన్సుల ద్వారా పన్నులు తగ్గించకపోతే యీ 'బజట్'ను సామాన్యుడు హర్షించగలడు. లోటు 'భర్తీ' మార్గాలు వెతికితే వేరే వుండకపోవు.




తూర్పున ఆకాశం కడుపు చించుకుంటోంది. తల్లి కడుపు లోంచి పుడమి తల్లి మీదికి వస్తున్న పసిగుడ్డులా... ఎర్రటి నెత్తుర్లో ముంచి తీసినట్టున్న బాలభానుడు ఆ పల్లెమీదికి, తన తుహిణ కిరణాలను అపుడపుడే విసురుతున్నాడు.

పచ్చు మేడ పైభాగాన ఓ చిన్న గది. ఆ గదిలో తదేకంగా ఆలోచిస్తున్న భార్గవ! కిరణుడి కాంతి కిరణాలు కిటికీగుండా మొహంమీదికి సోకగానే భార్గవ, చేతిలోని పెన్నును టేబుల్‌మీదుంచి, బద్ధకంగా ఆవులిస్తూ, కళ్ళు నులుముకున్నాడు ఇంకా వెలుగు నివ్వాలని విఫలయత్నం చేస్తున్న టేబుల్ లాంప్‌ను 'ఆఫ్' చేసి, రూము బయటకు వచ్చి పిట్టగోడ పైనుండి తన దృష్టిని ఊరిమీదికి సారించాడు.

ప్రభాకరునితో బాటే నిద్ర లేచిన పల్లెను ఆ మేడపై నుండి చూస్తుంటే ఎంతటి అందం!దూరంగా- పచ్చిం బయళ్ళకూ, పంట చేలకూ ఆవలగా నీలి కొండలు!ఓ కొండకు ఆ చివర్న ఎవరో అడవికి నిప్పు పెట్టినట్టుంది కనీ కనిపించని పొగ మంటలు ప్రశాంతతకు భంగం కలిగించని రీతిలో పక్షుల కిలకిలా రావాలు! ఇటు ప్రక్కన చుట్టూరా నాటిన కొబ్బరి మొక్కల మధ్యన 'కోనేరు' వచ్చేపోయే ఆడంగులతో దృశ్యం 'సెక్సీ'గా ఉండడంతో భార్గవ చూపు అక్కడే నిలిచిపోయింది.

ఇంతలో– పెరట్లో బావి దగ్గర గిలక చప్పుడు భార్గవ దృష్టి అటు మళ్ళింది పార్వతి" పల్చటి చీరను మోకాళ్ళపైకి దోపుకొని తెల్లటి పిక్కలు బిగుతు జాకెట్టు నీళ్ళు చేదుతున్న ఆమె కదలికకు కదులుతున్న గుండెలు! భార్గవ గుండెల్లో గుబులు రాత్రి పార్వతి పంచిపెట్టిన అందమైన ఆనందపు స్మృతులు!

"ఏంటీ అంత సీరియస్‌గా రాసేసుకుంటున్నావు?"

"ఓ నువ్వా?"

"ష్ మెల్లగా"

"ఏయ్, పార్వతి రాలేదూ?"

"దొంగ మొహం. ఏం ఎరగనట్టే! ఆ పార్వతి వస్తే, యీ పార్వతి నీ దగ్గర కెందుకొస్తుంది? అతగాడికి నేనవసరం లేదు అదుంటే చాలు!"

"సర్సరే ఎవరి బాధలు వాళ్ళవి! మన బాధలు మనం "

"అబ్బా. . ఆశ!"

"ఆశే మరి ఆశపెడితే పద్మంలో తప్పేం వుందీ?"

"నే నాశ పెట్టానా? నువ్వే పోయిన మారలా రెచ్చగొట్టుండకపోతే, నేనూ వుండేదాన్ని . పతివ్రతలాగ!"

"ఆ! ఆ! . 'టైం వేస్టు చెయ్యకు వాడొచ్చేస్తాడు"

"టైమెంతా?"

"పదకొండు దాటింది"

"ఇంతేనా?! అతగాడొచ్చేసరికి రెండో మూడో అవుద్ది వొచ్చినా, అలసిపోయి పడుకుంటాడు. ఓ ముద్దా, ముచ్చటా?!"

"నే తీరుస్తున్నాగా! ఏయ్ ఇదిగో ఇలారా మరి!"

". . . ."

"రమ్మంటుంటే"

"అబ్బ మీసాలు గుచ్చుకుంటున్నాయి ఆ లైటు తీసెయ్ బాబూ నా కసలే సిగ్గు!"

"పాతబడిపోయినా సిగ్గుపోలెదన్నమాట!"

పిట్టగోడకు ఆ చివర్న కాకి అరుస్తోంది. ఆ అరుపుతో భార్గవ వాస్తవంలోకి వచ్చాడు. చిన్నగా దగ్గిన శబ్దం తలెత్తి చూసిన పార్వతి– కళ్ళలోకి గుచ్చుకున్న భార్గవ చూపులు! ముసి ముసిగా నవ్వుకుంటూ, నీళ్ళబింది చంకన పెట్టుకొని, యింట్లోకి వెళ్ళిపోయింది పార్వతి!

"సుఖాలపుట్ట!" రెండ్రోజులుగా పొందుతున్న దొంగ అనుభవానికి, భార్గవ నవ్వుకుంటూ పారేసిన ఓ ఛీప్ కాంప్లిమెంటు.

పార్వతి, పార్వతి భార్య! భార్గవ, తన ప్రియమిత్రుడైన పార్వతీశాన్నే 'పార్వతీ' అంటూ ప్రియంగా పిలుచుకుంటాడు ఇంతకూ భార్గవ ఎవరయ్యా అంటే– తెలుగునాట పేరున్న ఓ రచయిత! ఈ వర్షపు దసరాపండుగ సందర్భంగా ఓ ప్రముఖ పత్రిక నిర్వహించబోతున్న కథల పోటీకి మాంచి కధొకటి రాసి, పేరూ– ప్రైజూ కొట్టెయ్యాలనేదే అతని ఆశయం తనుండేది పట్నం విశాఖపట్నం ఆ పట్నపు పొల్యూషన్లోకన్నా, పల్లెటూర్లో, ప్రశాంత వాతావరణంలో అయితే, చక్కటి కథ పుడుతుందనే ఉద్దేశంతో, యీ పార్వతీశంగారి పచ్చమేడలో చేరాడు

"నమస్కారవండీ రచయితగారూ!"

"ఎవరూ? ఓ నువ్వా రేణూ? రారా యిలా కూచో" భార్గవ మొహంలో వెలుగు.

"ఎవరనుకున్నారూ?" నవ్వుతూ కాఫీ గ్లాసందించింది

"ఎవరో ఎందుకనుకుంటానూ .. ఆc!"కొంటె చూపు

"రేణూ" కంఠం మత్తుగా వుంది మీ అన్నయ్యేడీ?"

"స్నానం అవుతోంది వస్తాడు ఇంతకూ ఏం కథ రాస్తున్నారూ? మా జాతి సమస్యలమీదేనా?" నిర్మలమైన నవ్వు

"రేణూ– నీకు కథలంటే యిష్టమా?"

"ఇష్టమా?! పడిఛస్తానండీ!"

"ఈజిట్??" భార్గవ ఖాళీ గ్లాసును టేబుల్‌మీద పెడుతూ, లుంగీని కాస్త పైకెత్తి, మూతి తుడుచుకుని, తాపీగా సిగరెట్ వెలిగించాడు ఎండ తీక్షణత పెరిగి, వాతావరణం వేడెక్కుతోంది దిగువున పెద్దగా శబ్దం చేసుకుంటూ వెళ్తున్న పట్నం బస్సు

"మీరెక్కువగా స్త్రీల సమస్యలమీదే రాస్తుంటారేవండీ?"

"ఇపుడవెందుగ్గాని మరేదైనా మాట్లాడరాదూ?" ఆశగా చూశాడు.

ప్రక్కనే ఉన్న చింత చెట్టుమీద గుడ్లగూబ అరుస్తోంది కాని, బస్సు చేస్తున్న చప్పుడ్లో ఆ అరుపు వినిపించడంలేదు.

"నాకెన్నాళ్లనుండో యీ విషయం మిమ్మల్ని అడగాలనుంది చెప్పండి ప్లీజ్"

"చూడు రేణూ! ఎందుకు రాస్తున్నారూ?అంటే– కారణాలెన్నని చెప్పను? ప్రస్తుత సమాజంలో స్త్రీలకున్న సమస్య లేంటో నీకు తెలియదా?అవన్నీ చూస్తుంటే ఏ జాలి గుండెలో స్పందన రాదు?? వరకట్నాలకూ, రేప్‌లకూ బలయ్యేదెవరో తెలీదా? మీ కాలేజీల్లోనే చూడు టీనేజ్ గాల్స్ ఎంత మంది లౌ పేరిట యిల్లీగల్ కాంటాక్ట్స్‌కు వొప్పించబడి, ఘోరంగా నాశనం కాబడుతున్నారో!టీజింగ్... నేటి మగాడికి కట్టుకున్న పెళ్లాంమీద అనుమానం! ఉద్యోగం చేసే ఆడదంటే చిన్న చూపు!ఇంకాస్త డైరెక్ట్‌గా చెప్పాలంటే"

"ఫర్లేదు చెప్పండి"

"ఎబ్బెట్టుగా వుంటుందనుకో .. బార్య పురిటికనో, ఆషాఢమనో, మరేదో జరిగి భర్తకు కాస్త దూరంగా వుండాల్సొచ్చిందనుకో వీడో రెండ్రోజులు శ్రీరామచంద్రుడల్లా ఖాళీగానే వుంటాడు ఆ తర్వాత ఏ లాడ్జింగ్‌కో లేకపోతే అర్థ మవుతోందనుకుంటాను "

"వెరీ యింట్రస్టింగ్" రేణూకు వినాలన్న ఆసక్తి. భార్గవ సిగిరెట్ ఆఖరి 'పఫ్' లాగేసి మూలకు విసిరేసాడు దిగువున. రోడ్డుమీద రెండు మూడు ఎడ్ల బండ్లు వెళూ్త చేస్తున్న చప్పుడు.

చెప్పండి సార్"

'రేణూ యిలా మాట్లాడుకుంటూ పోతే, స్నానవదీ వుండదీ రోజూకు!"

"ఏవంత టైం కాలేదు. చెప్పండి ప్లీజ్ మళ్లీ మనవిలా తీరిగ్గా డిస్కస్ చేసుకునే ఆపర్ట్యూనిటీ రాకపోవచ్చు" రేణూ బ్రతిమలాట.

నవ్వుతున్న బార్గవ చాతీ మరికాస్త పొంగింది.

## మీ జి. కె. ఎంత?

1. 'మేఘాలయ' అసెంబ్లీకి ఒక వ్యక్తి 'టాస్ ఆఫ్ కాయిన్' (బొమ్మా-బొరుసా) పద్ధతిన ఎన్నికయ్యాడు. అతని పేరేమిటి?
2. 'పద్మభూషణ్' తిరస్కరించిన జర్నలిస్టు ఎవరు?
3. భారత రాష్ట్రపతి పదవి నలంకరించిన ఆంధ్రులెవరు?
4. 'దీ ప్రైస్ ఆఫ్ పవర్' అనే పుస్తకం రచించిన దెవరు?
5. కామన్వెల్త్‌కు ప్రస్తుత ప్రధాన కార్యదర్శి పేరేమిటి?
6. మొట్టమొదటి "భారతీయ మహిళా సుప్రీంకోర్టు జడ్జి" ఎవరు?
7. "కామిలో జోస్ సెలా" ఎవరు?
8. కార్బెట్ 'నేషనల్ పార్క్' ఏ రాష్ట్రంలో వుంది?
9. భారతదేశంలో 'హిందీ' తరువాత అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష ఏది?
10. డి. ఆర్. డి. ఒ. అంటే ఏమిటి?

- జైకిరణ్

(జవాబులు ఈ సంచికలోనే)

"ఏవుంది రేణూ! భర్త... మగాడు. తన అవసరాల్ని ఎలాగయినా తీర్చుకోగలడు. అదేబాధ అక్కడ తన భార్యక్కూడా వుండదా ఏం? మరి... ఆమె కూడా, అలా 'అవసరం' తీర్చుకోడానికి... అమ్మో! నరికి పోగులు పెట్టెయ్యడూ? వీడు మాత్రం- మగాళ్ళం. ఎన్నాళ్ళని మడికట్టుక్కూచోగలం- అంటూ ఫ్రెండ్స్‌తో దర్జాగా గొప్పలు పోతూ వుంటాడు. అదే విధంగా ఆవిడ కూడా బిహేవ్ చేసి.. చెప్పుకుంటే?! ఈ రకమైన తేడా నీతులు ఎవరు సృష్టించారంటావ్? మొదట్నుంచీ, ఆడదానికి 'సబ్ మిసివ్' మెంటాలిటీని బలవంతంగా రుద్దేసి, అణకువగా వుండటం నేర్పి, ఆటబొమ్మను చేసి ఆడుకుంటున్నాడీ మగాడు! రేణూ! ఇదో ఓషను చెప్పుకుంటూ పోతే కోట్ల సమస్యలు ఏ కారణంతో చూసినా ఆడదానికి సమస్యలె! అలాగని యీ సంఘాన్ని యీ తరంలోనే మార్చలేం. కాని, కొంతవరకైనా సంస్కరిద్దామనే కోరిక! పదేపదే చెప్తూ వుంటే ఫలితం వుంటుందనే ఆశ! సారీ రేణూ! ఆవేశంలో కాస్త ఎబ్బెట్టుగా మాట్లాడేసినట్టున్నాను" భార్గవ కళ్ళు, రేణు కళ్ళలోకి అవి ఆశిస్తున్న 'ఎఫెక్ట్స్' కోసం వెదుకుతున్నాయి.

"నోనో... నా ఆప్షనల్ సబ్జక్టు తెలుగు... స్పెషల్ తెలుగు సార్! నా కిలాంటివి వినడం అలవాటయి పోయింది! అయినా... మీరు మాట్లాడేవన్నీ చాలా తక్కువ!" గలగలా నవ్వుతోంది.

ఆ నవ్వుకు భార్గవ మనసు ఉబ్బి తబ్బిబ్బయి పోతోంది.

"రేణూ!"

"నువు కాలేజీ హాస్టల్లోనే వుంటున్నావా?"

"రేణూ!"

"ఆఁ! వచ్చే... వదిన పిలుస్తోంది, ఇపుడే వచ్చేస్తాను" అనేసి రేణూ తుర్రుమంది.

"దొంగముండ... ఏదో మచ్చికవుతున్న చిలకను... దానిలాంటి ఆడది కాదా? పెళ్ళికాకపోతే మాత్రం కోరిక లుండవా ఏం?" భార్గవ మనసులో పార్వతి మీద చిరు కోపం.

"ఏం రా రచయితా! అయిందా?" పార్వతీశం పలకరింపు. "ఇక స్నానం- పానం వొద్దనుకున్నావా ఏం?"

"రాత్రంతా ఎక్కడ చచ్చావురా?"

"సారీనోయ్... పనుండి లేటయింది" భార్గవకు, తన 'ఆ' విషయం తెలియదనుకొని... కాకపోయినా... 'ఆమె' గురించి భార్గవకు తెలిస్తే, తనకే ఎసరు పెడతాడని, పార్వతీశం విషయాన్ని దాచాడు.

"అదన్నావ్... యిదన్నావ్... విమల విషయం తేల్చేస్తానన్నావ్... అంతా సొల్లు కబుర్లేనన్న మాట."

"ఆగరా బాబూ పైరవకు... విమల యిపుడే కబురంపింది. ఇక్కడైతే అందరికీ తెలిసి పోతుందనే భయమట. పది గంటల బస్సులో పట్నం వెళ్తుందట. రమ్మనింది."

"అయితే తప్పక వెళ్ళా లోయ్... మళ్ళీ ఛాన్స్ రాదేమో"

"సరే . నాదేంవుందీ? అలానే వెళ్దాం. ఇంతకూ నీ కథెంతవర కొచ్చింది?"

"అయిందని పించాను. మరోసారి చూడాల్రా.... కొత్త మలుపు కోసం ఆలోచించాలోచించి... పిచ్చెక్కుతోంది.'

"కథల పోటీ కంటున్నావ్ ఏదీ. ఎలా రాశావో చూస్తాను."

"అయితే, నువు చూస్తూ వుండు. నేనింతలో స్నానం అయిందని పించేస్తాను." రాసిన కాగితాలన్నీ వరుసక్రమంలో పెట్టి, భార్గవ దిగువ కెళ్ళి పోయాడు.

అర్థ గంట దాటింది.

భార్గవ ఫ్రెష్‌గా తయారయి వొచ్చాడు.

"చదివావ్రా?"

"ఆఁ!"

"సరదాగా నీ అభిప్రాయం చెప్పరా మరి" భార్గవ సిగిరెట్ అంటించాడు.

"బాగానే రాశావు గాని... వొరే! ఇలాంటి మోరల్ స్టోరీస్ నువ్వెలా రాయగల్గుతున్నావో నా.కర్థమయి





చావట్లేదురా!"

"అంటే?"

"నువ్వు తిరిగే తిరుగుడికీ, యీ కథ వెనుక రచయిత ఔన్నత్యానికీ... ఎక్కడా పొంతన కుదిరి చావట్లేదురా??"

"ఓ... అదా నీ డౌటూ? వొరే పిచ్చోడా... ఇవి కథల్రా... కథల్లో రాసిన వన్నీ మనం ఆచరించుకుంటూ పోతే... దట్సాల్... ఇంకేం లేదు.... నేనే కాదు. నా లాంటి వాళ్ళు చాలామంది. వాళ్ళు రాసేవన్నీ ఆచరిస్తున్నా రనుకుంటున్నావా? నో... పాపులారిటీ... ప్రైజులూ... సన్మానాలూ... యిదే ముఖ్యం. అందుకే యిలా ఏదో ఓ కొత్త మలుపు తగిలించి, పాఠకుల్లో సింపతీ వొచ్చేలా రాసి..."

"అవునా?! అన్నీ కల్పితాలేనన్నమాట!"

"అలాగని కాదు. ఏదో ఓ ఆలంబనంటూ వుండకపోదు– దానికే అటూ యిటూ– కూడికలూ, తీసివేతలూ చేసి, కాసిన్ని సెంటిమెంట్సు తగిలించి ప్రజల మీదికి విసిరెయ్యాలి" నవ్వుతున్నాడు.

"ఏమోరా... ఇలాంటి కథల్ని మన ఆడాళ్ళూ చదివితే... ఖర్మకాలి, మన వ్యవహారాలూ బయటపడితే... మనకు రాం రాం చెప్పేసి..." పార్వతీశం అనుమానం.

"పార్వతీ! నెవ్వర్... ఎక్కడికీ పోరు... పోలేరు! నే రాసినట్టుగా, ఎంత మంది మొగుళ్ళు తమ పెళ్ళాల్ని చిన్న చూపు చూడ్డం లేదు? బాధలు పెట్టడం లేదు?" నువ్వూ ఆ లిస్టులోని వాడివే కదరా అన్నట్టుగా పార్వతీశం వైపు చూసి, "మరి ఎంతమంది ఆడాళ్ళు తమ మొగుళ్ళ నొదిలేసి, లేచి పోతున్నారు? ఎక్కడో ఒకటీ... అరా తప్పితే! కథలు ఛదివినంత మాత్రాన మొగుళ్ళలో పరివర్తన వచ్చేస్తే?! పెళ్లాలు– యిహ బాధలు పడలేక, తెగించి, ధైర్యంగా లేచిపోవడమో... వొదిలెయ్యడమో జరిగితే?... లాంటి సంశయాల్ని మనసులో కెప్పుడూ రానివ్వకురా పిచ్చోడా!"

"నిజమే అనుకో" పార్వతీశానికి కాసింత మనస్థిమితం.

"అనుకోవడం కాదు– నిజమేరా! మన సమాజపు ఆడది, యిపుడిపుడే మారదు. అలాంటి ధైర్యం చేయలేదు. తనక్కూడా మగాడి చెప్పుకిందే పడుండి, భారత స్త్రీగా, యీ జీవితాన్ని తెల్లార్చు కోవాలను కుంటుంది. ఆ కాంప్లెక్స్ వాళ్ళలో జీర్ణించుకు పోయింది. ఈవెన్ స్వశక్తిమీద బ్రతగ్గలిగే ఆడది కూడా, యింత లోతుగా ఆలోచించదు. ఆలోచిస్తే పాపం అనుకొని, పరిస్థితులతో రాజీపడి పోతుంది. ఆఫ్టరాల్... కథలు చదివినంత మాత్రాన... వాళ్ళు మారిపోతారనో, పారిపోతారనో అనుకోవడం... రెడిక్యులస్".

"అన్నయ్యా... టిఫెన్ రెడీ" దిగువ నుండి రేణూ పిలుస్తోంది.

"భార్గవా... కరక్టే అనుకో... అయినా నాకెందుకో...." ఏదో అనబోయి–

"సరేలే... తర్వాత మాట్లాడదాం... ఆకలేస్తోందిరా... ముందు టిఫెన్ కానిస్తే, ఓ



## బచ్చన్ ఎత్తుగడలు!

శత్రుఘన్‌సిన్హా తనపై విమర్శలు చేస్తున్నా బచ్చన్ వాటిని చాలా తేలికగా తీసుకుంటున్నాడు. మా యిద్దరి మధ్య మంచి స్నేహ సంబంధాలున్నాయని యిటీవల ఒక యింటర్వ్యూలో తెలియజేశాడట. నా గురించి మాట్లాడితే అతనికి పబ్లిసిటీ వస్తుందని శత్రుఘన్‌సిన్హాకీ తెలుసునంటున్నాడు బచ్చన్. అతను రాజకీయవేత్త అవుతాడేమో నాకు తెలియదు అని అంటున్న బచ్చన్ తనపై వచ్చిన విమర్శలకు ప్రతిస్పందించక పోవటం ఏమిటో జనాలకి అంతుచిక్కటం లేదు. ఇదొక రాజకీయ ఎత్తుగడేమో!

పనయి పోతుంది... బస్సుకు టైం కూడా దగ్గరి పడుతోంది" అన్నాడు పార్వతీశం.

అదే రోజు అర్ధరాత్రి....

చర్చిలో పన్నెండు గంటలు మోగాయి. పట్నపు అలజడి తగ్గింది. ఆటోలో ఇల్లు చేరుకున్న భార్గవ్‌కు ఇంటికి తాళం వేసుండడం ఆశ్చర్యం వేసింది. ఓ పక్క అనుమానం! అరువు తెచ్చుకున్న విమల, విరివిగా యిచ్చిన ఆనందమంతా చప్పున చల్లారి పోయింది. భార్గవ తలుపు దగ్గరిగా చేరి విన్నాడు. లోపల నిశ్శబ్దం! దూరంగా పిచ్‌యార్డ్ నుండి సైరను మోత. దానిని డామినేట్ చెయ్యాలనేమో... ఆ వీధి మొగలో కుక్క వ్యర్థ ప్రయత్నం చేస్తూనే వుంది. తలుపు సందుగుండా చూశాడు. బెడ్‌లాంప్ వెలుతురు కూడా లేదు."

"ఈ వేళపుడు.....?" భార్గవకు కోపం వొచ్చేసింది. ఆదరా బాదరాగా, మినీ సూట్ కేస్ వోపెన్ చేసి, కీ బంచ్ కోసం వెతికాడు. చేతికేం తగల్లేదు. బయట– చిన్నగా వర్షపు తుంపరలు... మెత్తగా చలిగాలి వీస్తూనే వుంది.

"ఒకవేళ..." ఆలోచన వచ్చిందే తడవుగా ప్రక్కింటి తలుపు తట్టాడు.

"ఎవరూ?" లోపల్నుండి కేక, లైటు వెలిగింది. భార్గవ నోరు విప్పేలోపలే తలుపులు తెరుచుకున్నాయి.

"హలో" పొడిగా అన్నాడు భార్గవ.

"ఈ వెధవ చూపులెపుడూ నా యింటిమీదే!" భార్గవకు కోపం.

'హలో సార్... మీరా?' నిద్ర మత్తులో రమేష్ మాటలు ముద్దగా వున్నాయి.

'మా మిసెస్...' భార్గవ మనసు.... కళ్ళను ఆసరా చేసుకొని లోపల వెదకటానికి ఆరాటపడుతోంది.

"ఆఁ... ఆఁ... పిఠాపురం వెళ్తున్నట్టు చెప్పారు. కీసిచ్చారు. తెస్తానుండండి"

"కీ సిచ్చిందా... కిస్సిచ్చిందా? హడలుగొట్టేసింది ముండ. నయమే... ఎవడితోనైనా... అనవసరంగా విమలను పార్వతికి వొక్కడికే వొదిలేసి... అయినా యీ ముండకే వొచ్చిందని..."

"ఇదిగోనండి" రమేష్ మాటలతో, భార్గవ మనసు మాట్లాడ్డం మానేసింది.

తన పర్సనల్ కీ బంచ్ చూడగానే భార్గవ గుండె గుభేల్ మంది. ఆతృత కప్పిపుచ్చుకుంటూ, రమేష్‌కి థాంక్స్ చెప్పి, ఇంటికి వచ్చి తలుపు తెరిచాడు.

లోపలకు అడుగు పెడుతున్న భార్గవ కాలికి ఏదో తగిలింది. చేత్తో తడుముకుంటూ వెళ్ళి గోడకున్న స్విచ్ ఆన్ చేశాడు. లైటు వెల్తుర్లో ఓ కవరు. తీసి చూశాడు. 'భార్గవకు' వ్రాసుంది.

"దాన్రాతే... ఏంటో నాకు చెప్పకుండా వెళ్ళాల్సినంత అవసరం?" స్వగతంగా అనుకుంటూ, కవరు చించి ఉత్తరం మడత విప్పాడు.

గాభరా పడకు. నేనే! నీ పరువు కోసం నీకూ ఓ పెళ్ళాం ఉందని నలుగురూ అనుకోడానికి, నువ్వు నిర్దాక్షిణ్యంగా... ఘరో బలి పశువుగా... నన్ను వాడుకోడానికి ఎంచుకున్న ఆడదాన్ని! నీ రెండో పెళ్ళాన్ని! వెళ్ళిపోతున్నాను నీ నుండి దూరంగా... నా మొహం చూడ్డానికి ప్రయత్నించకు. ప్రయత్నిస్తే నీ పరువు తీసేస్తాను...

"డామిట్. ఈ ముండకేపయిందటా? ఇంత ధైరింగా? బ్లడీ బిచ్!"

భార్గవ కోపం నెత్తికెక్కింది.

చూడూ! నీ రచనల్లో ఆడదానికిచ్చే విలువ, నిజ జీవితంలో నీ స్త్రీకి ఎందుకివ్వలేవు? నీ రచనలనిండా

## నయవంచన

స్త్రీ సమస్యలే! కాని, ఇపుడు తెలుసుకున్నాను. స్త్రీలకు సమస్యలను సృష్టించేది. నువ్వూ, నీలాంటి నీచులేనని! ఈ తెలుసుకోవడమనేది. నీ యింటికి రాకముందు తెలుసుకొనుంటే... బ్రతుకు నిచ్చిన తల్లీ తండ్రినీ, తోబుట్టువులనూ... పాతికేళ్ళ జీవితంలోనే వొదిలేసి, నీలాంటి నీచుడితో నేను రెండో పెళ్ళికి సిద్ధపడేదాన్ని కాదు. పేద యింట్లో పుట్టిన నన్ను, ప్రేమతోనే పెళ్ళి చేసుకుంటున్నావనుకున్నాను. కాబోయేవాడు... పేరూ, సంస్కారం కలిగిన ఓ ప్రముఖ రచయిత అనుకున్నాను. కాని, నువు పశువుకన్నా నికృష్టుడవూ కాలనాగుకన్నా కర్కోటకుడవూ అనుకోలేదు...

"బాస్టర్డ్... తిన్న యింటికే వాసాలు లెక్క పెడుతోంది."

–కట్నం తీసుకోడం లేదంటే పొంగిపోయిన అమ్మా నాన్నలకంటే నేనే ఎక్కువ పొంగిపోయాను. నిష్కల్మషంగా ప్రేమించాను. పచ్చగా పది కాలాలపాటు బ్రతకాలని నీమీదే ఆశల పందిళ్ళను అల్లుకొని వచ్చిన... నాకు నువ్వేం చేశావ్?ఎప్పుడైనా ప్రేమగా 'అనూ' అన్నావా? శారీరక సుఖం యిచ్చావా? ఆ సుఖమే ప్రధానం అనుకోను. కాని, వయసులో వున్న ఆడదానికి తీర్చాల్సిన ఏ ముచ్చట నువు నాకు తీర్చావు? నీ యిన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో మరే మగాడి వైపు చూసినా, మాట్లాడినా అనుమానించావు. ప్రతి క్షణం అవమానించావు. నీ రచనల్లో... స్త్రీలను అంత ఉన్నతంగా, ఉదాత్తంగా చిత్రిస్తావే... వాటన్నిటికీ విరుద్ధంగా... మానవత్వం లేని మనిషిలా...

భార్గవ కళ్ళు ఎఱ్ఱబడిపోతున్నాయి. బయట వర్షం చిక్కబడుతోంది.

–నువు వెళ్తూ హడావుడిలో మర్చిపోయిన నీ పర్సనల్ కీ బంచ్ నాకెంతో మేలు చేసింది.

"చూసేసిందన్నమాట" ఆతృతగా స్టోరూంకు వెళ్ళి లైటు వేశాడు. ట్రంక్ తెరిచే వుంది. చిందర వందరగా పడివున్న పర్సనల్ డైరీలు, ఏనాటినుంచో రాసుకున్నవి. భార్గవ తప్ప మరో వ్యక్తి చూడనివి. అక్కడే, బొత్తెలోని సీక్రెట్ లెటర్స్! రమేష్ నుండి కీ బంచ్ తీసుకుంటున్న భార్గవ గాభరా పడింది కూడా యీ ట్రంక్ గురించే! కాని, భార్య రాసిన లెటర్ చదవాలనే ఆతృతలో యివన్నీ మర్చిపోయాడు.

భార్గవ గుండె స్పీడు పెంచుతోంది. ఇంకా ఏం రాసిందోనని, లెటర్లోకి చూశాడు.

నువు ప్రతి రోజూ రాత్రుళ్ళు నన్ను కూడా దగ్గఱకు రానివ్వకుండా ఆ ట్రంక్ దగ్గఱ చేసేదేమిటో తెలుసుకోవాలనిపించింది. అందుకే సంస్కార విరుద్ధమే అయినా అర్థం కాని నీ మృగ మనస్తత్వాన్ని తెలుసుకున్నాను. నీ గతాన్ని తెలిపే డైరీలనూ, ఉత్తరాల్లో నువు సాగించే కామ కాండనూ క్షుణ్ణంగా చదివాను. నువు నా ఎదురుగా లేకపోవడం నీ అదృష్టం... నువ్వే వుండుంటే... నేనీసరికి జైల్లో వుండేదాన్ని!

నీ రచనలతో ఎదుటివార్ని సంస్కరించబోయేముందు నిన్ను నీవు సంస్కరించుకున్నావా? నీలోనే యిన్ని నీచభావాలూ అల్పబుద్ధులూ ఉంచుకొని ఎదుటివార్ని 'ఎదగండోయ్' అంటూ చాటుతున్న నిన్ను చూస్తే ఏమనుకోవాలి? నీ నిజ రూపం తెలిస్తే యీ సంఘం నిన్నేం చేస్తుందో ఊహించావా? నీలాంటి కసాయి వెధవ, ఒక ప్రముఖ రచయితగా చెలామణి అయిపోతున్నా, నీ అసలు రూపం బయట పడ్డపుడు, నీ తోటి రచయితలంతా నీ మొహాన్న ఉమ్మేస్తారని ఎప్పుడైనా ఆలోచించావా?

నీ గతాన్నోమారు గుర్తు చేసుకో. జ్ఞాపకం రావట్లేదా? రాదు! ఎందు కొస్తుందీ? ఎంతమందినని గుర్తుంచుకోగలవు? రమ, వాణి, పద్మ, జయ, తులసి... ఆ పల్లెటూర్లోని పార్వతి... యిలా ఎంతమంది సంసారులతో సరసాలు సాగించావు?ఎంతమంది కన్నెలకు కన్నెరికం చేశావు?

ఎన్నో ఆశలతో కొత్త అనుభవాన్ని చవిచూద్దామని, తొలి రాత్రికి నిన్ను చేరిన కమలను ఏం చేశావ్? మనసు విరిచేశావు? కమల ఎవరా అని ఆశ్చర్యపోకు. ఈ సంఘపు దృష్టిలో నీ మొదటి పెళ్ళాం! కలకాలం కాపురం చెయ్యాలని నిన్ను చేరిన కమలను, కర్కశంగా కట్టుకున్న పెళ్ళాని కూడా కన్నెరికం చేయడానికి కట్నం అడుగుతావా?

...మగ వ్యభిచారిలా!! ఊహించని సంఘటనకు ఆమె ఎంత చిత్ర వధ అనుభవించుంటుందో... రాతి గుండె వాడివి నీకేం తెలుస్తుంది. ఉరి పోసుకున్న కమల శవాన్ని, గాస్‌స్టవ్ ఏక్సిడెంటంటూ కాల్చేసి, చేతులు దులిపేసుకున్నావు! కమల తండ్రి లక్షాధికారంటూ గొప్పలు పోతూ, నీ డైరీలో రాసుకున్నావే... ఒక్కగానొక్క కూతురి బ్రతుకునూ నువ్విలా తెల్లార్చేసావని... ఆ తండ్రి తెలుసుకునుంటే... నిన్నా కన్నపేగు కాల్చేసుండదా?మళ్ళీ నన్నూ, నాలాంటి కన్నెల్నీ కసాయిగా వాడుకునేందుకు నువు మిగిలుండేవాడివా?

నా బ్రతుకు నాశనం అయిందని నేననుకోను. నాకేం? అర్థం చేసుకునే అమ్మా నాన్నా వున్నారు. ఉద్యోగం సంపాయించుకునే పాటి చదువుంది. అందుకే... తెగిస్తున్నాను. ఒకవేళ నేను నాశనం కాబడినా... మరలా... మరో కమలో... కాసులమ్మో.... నీ విషపు కళ్ళలో పడి నాశనం కాకూడదనే... నీలాంటి నయవంచకుడ్ని, నరరూప రాక్షసుడ్ని... నాశనం చేయాలనే వెళ్తున్నాను–

చదువుతున్న భార్గవ వొళ్ళు సన్నగా వొణకడం మొదలైంది.

–నీ రాతల్ని బట్టి చూస్తే, కమల ఎంతటి అమాయకురాలో అర్థమయింది. కమల అబలగా ఆత్మహత్య చేసుకుంది. అలా కాకున్నా... సబలగా... ధైర్యంగా... కుక్క కాటుకు చెప్పు దెబ్బలా... నువు రాసే కథల్లోలాగ నీలాంటి వెధవ నొదిలేసి... కురూపి అయినా... అందమైన మనసూ... అర్థం చేసుకునే సంస్కారం వున్న... ఏ పేదవాడితోనైనా... నీ పరిభాషలో... లేచి పోయుంటే బాగుండేది! లేదా... హత్య... అవును... హత్య చేసుండాల్సింది, నిన్నూ... నీలా బురఖాల లోపలున్న వెధవలందర్నీనూ! అపుడే సంఘంలో... నీ కథల్లోలా... ఆడదంటే విలువా, గౌరవం.. పెరుగుతుంది! నీలాంటి వారికి భయం కూడా పుడుతుంది!

నీ డైరీలను చూసిన క్షణాన... నువు నా యెదురుగా వుండుంటే... అంతపనీ నేనే చేసుండేదాన్ని! ఆ తర్వాత కూడా నీ కోసం ఎంతో ఎదురు చూశాను. కాని, నువ్వింత వరకూ రాలేదు. ఏం? పార్వతిని వొదిలి రాబుద్ధి కాలేదా? ఛీ! నువు నీ మృగ మనస్తత్వంతో, నరకంగా మార్చేసిన యీ యింట్లో... ఎందుకో... ఇహ ఉండాలనిపించలేదు. బ్రతికున్న వాళ్ళనే పీక్కుతినే రాబందులాంటి నీ మొహాన్ని చూడాలంటేనే భయంగా వుంది. అసహ్యం వేస్తోంది. అందుకే వెళ్ళిపోతున్నాను. నువు గర్వంగా, జ్ఞాపకానికి రాసుకున్న నీ డైరీలలో ముఖ్యమైన వాటినీ. మరికొన్ని ఉత్తరాలనూ, నాతో తీసుకు వెళ్తున్నాను. నా దగ్గర ఉంచుకోడానిక్కాదు. కమల తండ్రి చేతుల్లో ఉంచడానికి!!"

అంతే! ఆ ఉత్తరంలో అనూరాధ మరేం రాయలేదు.

●

## 'భూమి దినోత్సవం':

అమెరికాలో- 20ఏళ్ళక్రితం20 మిలియన్ల ప్రజలు తొలిసారిగా'భూమిదినోత్సవాన్ని, (ఎర్త్‌డే)ని జరిపారు. పరిసర వాతావరణ పరిరక్షణోద్యమానికి ఈ 'అవని దినోత్సవం' అద్భుతమైన ఊపు నిచ్చింది. కాగా, ఈ 'ఎర్త్‌డే' 20వ వార్షికోత్సవాన్ని రానున్న ఏప్రిల్ 22న ప్రపంచ వ్యాప్తంగా ఎంతో ఉత్తేజంతో జరుపుకోవడానికి 120 దేశాలలో 100 మిలియన్ల ప్రజలు ఇప్పుడు సన్నాహాలు చేస్తున్నారు. ఈ 1990వ సంవత్సరపు భూమి దినోత్సవ కార్యక్రమాలను 'ఎర్త్‌డే' ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ అయిన క్రిస్టినా డెస్సెర్ అనే మహిళ అమెరికానుంచి సమన్వయీకరిస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా ప్రజలు పరిసర వాతావరణ విషయాలలో చక్కని మార్పులను ఆశిస్తున్నారని చాటి చెప్పడం ఈ ఉత్సవాల ముఖ్య లక్ష్యమని ఆమె ఇటీవల తెలియ జేశారు.

## హమేషా... తమాషా!

### శరణంగచ్ఛామి

**విద్యార్థి**

కాఫీ శరణం గచ్ఛామి
కాపీ శరణం గచ్ఛామి
టీ.సి శరణం గచ్ఛామి'

**ఉద్యోగి**

లంచం శరణం గచ్ఛామి
జీతం శరణం గచ్ఛామి
పెన్షన్ శరణం గచ్ఛామి

**వర్తకుడు**

కల్తీ శరణం గచ్ఛామి
లాభం శరణం గచ్ఛామి
మోసం శరణం గచ్ఛామి

**నాయకుడు**

వేదిక శరణం గచ్ఛామి
కోతల శరణం గచ్ఛామి
ఓటుల శరణం గచ్ఛామి

- చిమ్మపూడి శ్రీరామమూర్తి, సిరికొండ

(ఏప్రిల్ '62 ఆం. స. వారపత్రిక నుంచి)

**మెట్రిక్ కాలమానము :**

అఖిల అధ్వాన్న మూర్ఖ పండిత గోష్ఠి దశమ వార్షికోత్సవ పదవనాటి సమావేశంలో పదవ తీర్మానము ననుసరించి, ప్రస్తుత కాలమానాన్ని యీ క్రింది విధంగా మార్చాలని ఏకగ్రీవంగా తీర్మానించారు ఈ క్రొత్త తీర్మానాన్ని ప్రభుత్వానికి సమర్పిస్తూ, దీన్ని ఆమోదించి తక్షణం అమలు పరచవలయునని కోరుచున్నారు

10 సెకండ్లు - 1 నిముషము
10 నిముషాలు - 1 గంట
10 గంటలు - 1 దినము
10 దినాలు - 1 నెల
10 నెలలు - 1 సంవత్సరము

-ఎగ్గోని శ్యామసుందర్ (గుత్తి)

(జనవరి '62 ఆం. స. వా. ప. నుంచి)

ఈ శీర్షికలో పాల్గొనమని పాఠకులందరికీ యిదే ఆహ్వానం.

- ఎ

# పెరిగిన తపాలా ఛార్జీలు

| | అంశం | ప్రస్తుతధర | ప్రతిపాదితధర |
|---|---|---|---|
| 1. | ముద్రించిన పోస్టుకార్డు | 40 పైసలు | 60 పైసలు |
| 2. | ఇన్‌ల్యాండ్ లెటరు | 50 పైసలు | 75 పైసలు |
| 3. | ఎన్వలప్ (కవరు)10 గ్రాములు మించకుండా | 60 పైసలు | ఒక రూపాయి |
| | ప్రతి అదనపు 10గ్రాములకు | 40 పైసలు | ఒక రూపాయి |
| 4. | బుక్‌పోస్టు: తొలి 50 గ్రాములకు | 50 పైసలు | ఒక రూపాయి |
| | ప్రతి అదనపు 50 గ్రాములకు | 50 పైసలు | ఒక రూపాయి |
| 5. | బుక్ ప్యాకెట్స్: తొలి 100 గ్రాములకు | 30 పైసలు | 50 పైసలు |
| | ప్రతి అదనపు 100 గ్రాములకు (వార, పక్ష, మాస పత్రికలతో సహా) | 30 పైసలు | 50 పైసలు |
| 6. | పార్సెళ్లు: తొలి 500 గ్రాములకు | రు. 4 | రు. 6 |
| | ప్రతి అదనపు 500 గ్రాములకు | రు. 4 | రు. 6 |
| 7. | రిజిస్ట్రేషన్ | రు. 5 | రు. 6 |
| | ఎకనాలెడ్జిమెంటుడ్యూ | 50 పైసలు | రు. 1 |
| 8. | ఇన్స్యూరెన్సు రు॥ 100లు దాటని వాటికి | రు. 2 | ఇన్సూరెన్సు విలువ రు.200 దాటని వాటికి రు.4 |
| | ii) ప్రతి అదనపు రు. 100కు, రు.5వేల వరకు | రు. 1 | ప్రతి అదనపు రు.100కు రు.2 |
| | iii) ప్రతి అదనపు వెయ్యికి | రు. 5 | |
| 9. | ఎం.ఒ: రు 50 మించకుండా | 40 పైసలు | ప్రతి రు. 20 లేదా అంతకు తక్కువకు రు. 1 |
| | | ప్రతి రు.10 అదనానికి 50 పైసలు | |
| 10 | i)టి.ఎం.ఒ.కు అనుబంధపీజు వరకు ప్రతి టి.ఎం.ఒ.కు | రు. 1 | రు. 50 వరకు ప్రతి టి.ఎం.ఒ.కు రు2 |
| | ii) రు.200 మించకుండా రు.50పైన టి.ఎం.ఒ.కు | రు.2 | రు.200మించకుండా రు. 50పైన టి.ఎం.ఒ.కు రు.3 |
| | iii) రు.200పైన టి.ఎం.ఒ.కు | రు. 3 | రు.200పైన టి.ఎం.ఒ.కు రు.5 |
| 11. | సర్టిఫికెట్ ఆఫ్ పోస్టింగ్ | 3వ లేక అంతకు తక్కువ ఆర్టికల్స్‌కు 20పై | 3 లేక అంతకు తక్కువ ఆర్టికల్స్‌కు రు.2 |
| 12. | ఎయిర్ మెయిల్ ప్యాకెట్లకు గ్రాములకు | 10 పైసలు | తొలి 50 గ్రాములకు రు1 ప్రతిఅదనపు 50గ్రాములకు 50పై |
| | ప్రతి 100గ్రాముల పార్శెళ్లకు | 50పై | తొలి 50గ్రాములకు రు 1 ప్రతిఅదనపు గ్రాములకు 50పై |
| 13. | లేట్‌ఫీజ్ | | |
| | (i) రిజిస్టరు కాని ఆర్టికల్ ఒక్కింటికి | 20 పై. | రిజిస్టరుకాని ఆర్టికల్స్ ఒక్కింటికి రు. 1 |
| | ii) రిజిస్టరు చేసిన ఆర్టికల్ ఒక్కింటికి | 30 పైసలు | రిజిస్టరుచేసిన ఆర్టికల్ ఒక్కింటికి రు. 2 |
| | iii) ఆర్టికల్ ఒక్కింటికి ప్రత్యేక అదనపు లేట్‌ఫీజ్ ఆర్టికల్ ఒక్కింటికి | 50 పైసలు | ప్రత్యేక అదనపు లేట్‌ఫీజు రు.2 |



# సీరియల్
# సూపర్ హీరో



## మన్నెం శారద

(గత సంచిక తరువాయి)

బాగా చీకటి పడింది.

అయినా కొద్దిపాటి వెన్నెల సముద్ర కెరటాల మీదపడి కరిగించిన వెండిలా మెరుస్తోంది. సముద్రఘోష రాను రాను పెరుగుతోంది. బీచ్‌లో జనం చాలా వరకు పలచబడ్డారు.

ఒడ్డున బోర్లించిన పడవలకి మూలగా ఆ ఇద్దరూ కూర్చున్నారు.

ఆ.ాత చల్లదనంలోనూ ఒకరి శరీరాలు మరొకరికి తగులుతున్నాయి వెచ్చగా చాలా కాలం తర్వాత ఏర్పడిన సమాగం వలన ఇరువురి ఒంట్లోని రక్తం వేగంగా పారుతూ వేడెక్కుతోంది.

ఒళ్ళు ఝల్లు మంటోన్నా, సభ్యత కాదనుకొన్నా ఎన్నో రోజుల తర్వాత దొరికిన ఆ హాయిని ఆ ఇద్దరూ వదలుకోలేకపోతున్నారు.

"నువ్వొస్తావని అనుకోలేదు పీయూ!" అన్నాడు విజయేంద్ర ఆమె చేతిని గట్టిగా పట్టుకొని.

"నేనూ అనుకోలేదు విజయ్! ఫారిన్నుండి రాగానే ఎంత త్వరగా నిన్ను కలుసుకొందామా అని ఆశపడ్డాను. డాడీ ఇలా మారిపోతారని మనపట్ల విలన్‌గా తయారవుతారని ఊహించలేదు. నిన్ను కలుసుకోలేక నాకెంత పిచ్చెత్తినట్లుందో తెలుసా! అందుకే రజనికి చెప్పి, ప్లాన్ చేసి తనతో మద్రాసు వచ్చేను" అంది పీయూష.

"థాంక్‌యూ డార్లింగ్" అంటూ ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు విజయేంద్ర.

"ఛీ! ఏంటిది?" అంది పీయూష బుగ్గ తుడుచుకొంటూ.

"ముద్దు. ఇంగ్లీషులో కిస్ అంటారు!"

"చాల్లే గొప్ప! నా కిష్టం లేదు" అంది పీయూష కోపం ప్రదర్శిస్తూ.

"ముద్దు ఇష్టం లేదా, లేక నేనిష్టం లేదా?" అన్నాడు విజయేంద్ర నవ్వుతూ.

"ఆ మొదటిదే!"

"నయం ఇప్పుడే చెప్పేవు. నేనెళ్ళొస్తా!" అంటూ లేవబోయేడు విజయేంద్ర.

పీయూష గాభరాగా అతని చెయ్యి పట్టిలాగి "వద్దు" అంది.

"ఇకనీతో ఏం పని నాకు. ప్రేమకి తొలి మెట్టు ముద్దు. అది నీ కిష్టం లేకపోతే ఇంకెందుకు మనం కలుసుకోవడం!" అన్నాడు విజయేంద్ర.

పీయూష తలదించుకొంది సిగ్గుగా.

"జవాబు చెప్పవేం నా కోసం ఇంతదూరమొచ్చి?" అంటూ రెట్టించేడు విజయేంద్ర.

"అంటే....అంటే...అసలిష్టం లేదని కాదు. పెళ్ళికి ముందు...తప్పట కదూ!" అంది పీయూష సిగ్గుగా.

"మీ బామ్మ చెప్పిందా?"

"ఛీ! ఛీ! మా బామ్మ ఎప్పుడో చచ్చిపోయింది"

"బతికించింది. మరెవరు చెప్పేరమ్మా ఈ నీతి సూత్రాలు!"

"రజని!"

"చంపింది. మధ్యలో ఈవిడెవరు అడ భీష్ముడా!"

"ఏం కాదు. నా ఫ్రెండ్. రాజన్న కూతురు"

"ఏ రాజన్న?"

"ప్రముఖ సారా కాంట్రాక్టర్, కింగ్ మేకర్ రాజన్నగారి చిన్నమ్మాయి" అంది పీయూష.

"ఓ మై గుడ్‌నెస్! నీకు చాల బడాబడా ఫ్రెండ్స్ వున్నారన్న మాట! బహుశ ఆవిడ బంగారు పిచ్చుక కదా! ప్రేమ జోలికి వెళ్ళొద్దని వాళ్ళ నాన్న హెచ్చరించి వుంటాడు. అద్సరే! నా కేదో బహుమతి తెచ్చేనన్నావు! ఇవ్వవా?" అనడిగేడు విజయేంద్ర.

పీయూష బాగ్ తెరచి చిన్న బాక్స్ తీసి తెరచింది.

అందులో బంగారంలో అందంగా పొదిగిన డైమండ్ ఉంగరం తీసి అతని చేతి వ్రేలికి పెట్టింది పీయూష.

విజయేంద్ర వ్రేలివంక పరీక్షగా చూసుకొని "చాలా బాగుంది. తిరిగి మరి నేనేం బహుమతి ఇవ్వాలి నీకు?" అంటూ కొంటెగా చూశాడు.

పీయూష అతని మాటలకి దీర్ఘంగా నిట్టూర్చి "మన పెళ్ళి జరిగిపోతే ఆ తర్వాత ఒకరికొకరం ఎన్నయినా బహుమతులు ఇచ్చుకోవొచ్చు. మా డాడీ వాలకం చూస్తుంటే ఆయన్ని కన్విన్స్ చేయలేనేమోననిపిస్తోంది. నిన్ను కలుసుకోవడానికే ఎంతో అవస్థపడాల్సి వస్తోంది!" అంది బాధగా.

"అవును ఒకవేళ మీ డాడీ ప్రతిఘటిస్తే నువ్వేం చేయదలచుకొన్నావ్?" అంటూ సూటిగా అడిగేడు విజయేంద్ర.

"అదే ఆలోచిస్తున్నాను"

"ఇంకా ఆలోచనలోనే వున్నావా పీయూ! ఏ రెవరితోనైనా నీ మేరేజ్ సెటిల్ చేస్తే తలవూపుతావా?"

అతని ప్రశ్నకి కలవరపాటుగా చూసింది పీయూష.

**ఇంతవరకూ సాగినకథ -: 10** కాంట్రాక్టరు గోపాలరావుతో వివాహమై మనస్పర్థలు కారణంగా విడిపోయిన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి అనతికాలంలోనే బిజీ హీరో అయిన తన కొడుకు విజయేంద్ర విజయాలను చూసి మురిసిపోతుంటుంది. కుటుంబ పోషణాభారం మీదపడి నటిగా మారిన దమయంతి సుధీర్‌కు సినిమా ఛాన్సు యిప్పిస్తుంది. తనతో నటిస్తున్న సుధీర్ దమయంతి మనసులో మెదుల్తుంటాడు. సినీనటికావాలని ఆరాటపడుతున్న దమయంతి యింటి పనిమనిషి కోకిలను కరుణాకర్ తను తీసే వీడియో బ్లూఫిలింస్‌లోకి తీసుకుంటాడు.

"మాట మాత్రం కూడ ఆ ఊహని భరించలేను విజయ్! నాకు పెళ్ళంటూ జరిగితే అది నీతో మాత్రమే!" అందిగద్గదమైన కంఠస్వరంతో పీయూష.

విజయేంద్ర ఊరడింపుగా ఆమె భుజమ్మీద చెయ్యేసి "ఊరికే అన్నాను. దానికే ఇంత బాధపడతావు దేనికి? నీ మనసు నాకు తెలీదా?" అన్నాడు లాలింపుగా.

పీయూష అతని భుజమ్మీద తల ఆన్చి "బాధే మిగిలింది నాకు. నువ్వు పరిచయం కాని రోజుల్లో నా జీవితం ఎలా గడిచిందో నాకే తెలియదు. బాగా అల్లరి చేయడ మొక్కటే జీవిత ధ్యేయం అనుకొనే దాన్ని. నువ్వు పరిచయమయ్యాక నాకు నువ్వే లోకమైపోయేవు. నిన్ను చూడకుండా క్షణమైనా ఉండలేకపోతున్నాను. నీకు కాకుండా నా జీవితాన్ని ఊహించను కూడ ఊహించలేకుండా వున్నాను" అంది.

విజయేంద్ర ఆమె తలనిమిరి "అనవసరమైన ఆలోచనలతో మనసుపాడు చేసుకోకు. మనిద్దరం స్థిరమైన నిర్ణయంతో వున్నంత కాలం వెయ్యిమంది గాంధీలు కలిసినా మనల్ని విడదియ్యలేరు" అన్నాడు.

పీయూష అతని గుండెలకి హత్తుకుపోయింది.

అలా ఎంతసేపు గడిచిందో!

బీచ్ క్రమంగా నిర్మానుష్యమైపోయింది.

సముద్ర ఘోష క్రమక్రమంగా పెరుగుతోంది.

వారిగుట్టు తెలుసుకోవాలన్నట్లుగా చంద్రుడు పైకి ఎగబ్రాకి కాంతిని పెంచుకుంటున్నాడు.

చలిగాలి జివ్వున మొహాన్ని తాకగానే మొదట స్పృహలోకి విజయేంద్రే వచ్చి పీయూషని కుదిపి "పీయూ, చాల టైమయింది పద వెళ్దాం" అన్నాడు.

పీయూష చిన్నగా కదిలి "అప్పుడేనా?" అంది అతని మెడ చుట్టూ చేతులేసి.

"అప్పుడేనేమిటి, పదకొండు దాటుతోంది. పోలీసులు చూస్తే లేనిపోని గొడవ. రేపు పత్రికల నిండా రాసేస్తారు" అన్నాడు.

పీయూష ఉలిక్కిపడి "మైగాడ్! పదకొండు దాటిందా? రజని దెబ్బలాడుతుందేమో!" అంటూ లేచి నిలబడింది.



"సర్దిచెప్పు. ప్రేమలో పడితే కాలానికి విలువ లేదని తెలుస్తుందని చెప్పు" అన్నాడు విజయేంద్ర తనూ లేచి నిలబడి.

ఇద్దరూ ఇసుకలో అడుగులేస్తూ కారు వైపు నడిచేరు.

"మళ్ళీ ఎప్పుడు?" అంది పీయూష అతని వైపు తిరిగి.

"ఇలాగే రేపు రాత్రి ఎనిమిది గంటలు దాటేక!"

"మర్చిపోవుగా!" అతని చెయ్యిగట్టిగా పట్టుకొంది పీయూష.

"నిన్నా?"

"ఏమోమరి! నీకేం షూటింగులో బిజీగా వుంటావు. నేను రేపు రాత్రి ఎనిమిదెప్పుడవుతుందా అని ఇప్పటి నుండీ ఎదురు చూడాలి!" అంది పీయూష బుంగమూతి పెట్టి.

విజయేంద్ర జవాబు చెప్పకుండా కారెక్కి స్టీరింగ్ దగ్గర కూర్చున్నాడు.

పీయూష కూడ కారెక్కి కూర్చుంది.

కారు వెళ్తోన్నంత సేపు ఇద్దరు మౌనంగానే కూర్చున్నారు. కారు రజని అక్కగారిల్లు చేరగానే పీయూష కారు దిగింది.

"పీయూ!"

ఆమె తలెత్తి అతని వైపు చూసింది.

"నేనెంత షూటింగులో బిజీగా వున్నా నా మనసంతా నీ కోసమే ఆలోచిస్తుంటుంది. మొన్న హీరోయిన్‌ని పీయూ అని పిలిచి మూడు టేకులు తిన్నాను. నేను కూడ నీ కోసమే ఆలోచిస్తుంటానని నువ్వు గుర్తిస్తే నాకు కూడ సంతోషంగా వుంటుంది" అన్నాడు ఆమె చెయ్యి పట్టి నొక్కుతూ.

పీయూష కళ్ళు ఆనందంతో మెరిసేయి.

కారు కదిలిపోతుంటే కనిపించే వరకూ చూస్తూ నిలబడిపోయిందామె.

## 16

"హలో!" అంది రజని రిసీవర్ అందుకొని.

"హలో! నేను కరుణాకర్‌ని. మీరు బావున్నారా?" అనడిగేడు కరుణాకర్.

అతని గొంతు వినగానే ఆమె గుండె దడదడలాడింది.

అయినా లేని ధైర్యం తెచ్చుకొని "బాగానే వున్నాను. ఇంతకీ ఫోనెందుకు చేసేరు?" అంది రజని.

"భలే అడిగేరు. వయసులో వున్న ఒక అబ్బాయి వయసులో వున్న ఒక అందమైన అమ్మాయికి పనికట్టుకొని ఫోనెందుకు చేస్తాడు! ఆలోచించండి" అన్నాడు పకపకా నవ్వుతూ.

రజనికి టెన్షన్ పెరిగిపోతోంది.

"మా నాన్నగారు వుంటే...?" అంది బెదిరిస్తున్నట్లు.

కరుణాకర్ మరీ గట్టిగా నవ్వి "చిన్నపిల్లాడికి బూచి పేరు చెప్పి భయపెట్టినట్లుగా వుంది మీ నాన్నగారి పేరు చెప్పడం. కోట్లకి అధికారి ప్రముఖ సారా కాంట్రాక్టర్‌గారు ఈ టైములో ఇంట్లో కూర్చుని గోళ్ళు గిల్లుకుంటారంటే నమ్మమంటారా?" అన్నాడు.

"ఇంతకీ ఎందుకు ఫోన్ చేసేరో చెప్పండి" అంది రజని గొంతు తడారిపోతుంటే. "ఆ విషయం ముందే విన్నవించుకున్నాను. మరీ మరీ ప్రతిపదార్థం, తాత్పర్యం అడిగితే ఏం చెప్పాలి! మీరు మీ స్నేహితురాలితో మద్రాసులో బాగానే ఖుషీగా తిరిగొచ్చారు. ఇక్కడ ప్రతి క్షణం విరహంతో మీ కోసం వేచివేచి వేగి వేగి....."

"మీరు శ్రుతిమించి మాట్లాడుతున్నారు" అంది రజని కోపంగా.

"కోపగించకండి మేడమ్! ప్రేమలో ఎవరో ఒకరు శ్రుతిమించనిదే రాగానపడదు. మీకెలానూ చొరవ తీసుకొనే ధైర్యం లేదు. నేనే ఒకడుగు ముందుకేస్తే మీరు వెనక నడుస్తారని....."

రజని మాట్లాడలేదు.

"మీకు కోపం వచ్చినట్లుంది. క్షమించండి. ఆనంద్‌లో మంచి లౌస్టోరీ ఆడుతోంది. మనిద్దరి కోసం టిక్కెట్లు తీసుకున్నాను. మీరు బయల్దేరి వస్తే నేనక్కడ వెయిట్ చేస్తుంటాను. నన్ను నిరాశపరచరని ఆశిస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసేడు కరుణాకర్.

రజని ఎంత ట్రయ్ చేసినా రెస్పాన్స్ లేదతని వైపు నుండి.

రజని రిసీవర్ క్రెడిల్ చేసి సోఫాలో కూలబడింది. ఇంకా దడ తగ్గడంలేదు.

ఏంటితను? ఎక్కడలేని చొరవా తీసుకొంటున్నాడు! తనెందుకో మందలించలేకపోతోంది. అంతరాంతరాల్లో అతనంటే ఇష్టపడుతోందా? ఈ విషయం తండ్రికి తెలిస్తే ఏమైనా ప్రమాదం ముంచుకొస్తుందేమో తెలియదు.

ఎంత భయం కల్గుతున్నా మనసు సినిమాకి వెళ్ళమనే వత్తిడి చేస్తోంది.

చివరికి మనసే గెలిచింది.

రజని లేచి తయారయి తల్లికి చెప్పి కారుతీసుకొని థియేటర్ దగ్గరికి వెళ్ళింది.

దూరం నుండి ఆమె కారుని చూడగానే కరుణాకర్ కళ్ళు మెరిసేయి.

గబగబా కారు దగ్గర కొచ్చి "గుడీవినింగ్



వీకెండ్ పత్రిక కవర్‌పేజీపై క్లింట్ ఈస్ట్ ఉడ్ చిత్రం

**ఆనాడే కాదు! ఈనాడు కూడా చాలామంది క్లింట్ ఈస్ట్ ఉడ్ నటించిన చిత్రం అంటే మరో ఆలోచన లేకుండా చూసేస్తారు.**

హాలీఉడ్‌లో "ఏదో ఒక వేషం ఇవ్వండి బాబూ" అంటూ చాలాకాలం తిరిగాడు క్లింట్ ఈస్ట్ ఉడ్. "నువ్వు బాగా పాడుగున్నావు నీ పళ్ళు బాగా లేవు. నీ గొంతు బాగా లేదు" అని కూడా అనిపించుకున్నాడు.

## బాక్సాఫీసుల్ని ఆశ్చర్య పరచిన క్లింట్ ఈస్ట్ ఉడ్!

క్లింట్ ఈస్ట్ ఉడ్ నటించిన కౌబాయ్ చిత్రాలు మునుపు ఏ చిత్రం చెయ్యనంత డబ్బు వసూలు చేసి ఇటు హాలీవుడ్‌ను, అటు బాక్సాఫీసుల్నీ ఆశ్చర్యంలో ముంచెత్తాయి.

క్లింట్ ఈస్ట్ ఉడ్ కౌబాయ్‌గా నటించడం ప్రారంభించిన తరువాతే కౌబోయ్ నవలలకు గిరాకీ పెరిగింది. "లోన్ సమ్ డోవ్" అనే కౌబాయ్ నవల తొలిసారిగా బెస్ట్ సెల్లర్స్ లిస్ట్‌లోకి చేరి చాలాకాలం ఆ స్థానంలోనే వుంది. అమెరికా మాజీ అధ్యక్షుడు కూడా తన అభిమాన రచయిత కౌబాయ్ నవలలు రాసే లూయిస్ లాయర్ అని స్టేట్‌మెంట్ ఇచ్చారు.

కౌబోయ్ చిత్రాల జోరు తగ్గిపోయిన పదేళ్ళకు క్లింట్ ఈస్ట్ ఉడ్ కౌబోయ్ చిత్రం 'పేల్ రైడర్' విడుదలయి మళ్ళీ సంచలనం సృష్టించింది. ఈ చిత్రం విడుదలయిన తరువాత చిత్రంలో క్లింట్ ఈస్ట్ ఉడ్ పెట్టుకున్న 'స్టెన్సన్ హ్యాట్'కి గిరాకీ పెరిగి జనానికి కావలసినన్ని టోపీలు ఏ కంపెనీ తయారు చెయ్యలేకపోయింది

కౌబోయ్ కల్చర్‌ను క్షుణ్ణంగా పరిశోధించిన డాక్టర్ డాన్‌గ్రహామ్ (టెక్సాస్ యూనివర్శిటీ) "పొడవుగా,

## తారాపదానికి నిచ్చెనలు

అందంగా నేర్పుతో తుపాకి పేల్చే క్లింట్ ఈస్ట్ ఉడ్ నిజమైన కౌబోయ్‌లాగా వుంటాడు" అని అంగీకరించారు

డర్టీ హారి మాగ్నయ్ ఫోర్స్ వంటి సంచలన చిత్రాలను అందించాడు క్లింట్ ఈస్ట్ ఉడ్.

అద్భుతంగా గుర్రపుస్వారీ చేసే క్లింట్ ఈస్ట్ ఉడ్‌కి హార్స్ ఎలర్జీ వుంది. ఇందుకు ఆయన ప్రత్యేకంగా మందులు వాడేవాడు. అంతేగానీ గుర్రపుస్వారీ మానేవాడు కాదు.

"చాలామంది నటులు చెయ్యగలిగినట్టు నేను చేయలేక పోవచ్చు. నేను చెయ్యగలిగినట్టు చాలామంది చేయలేకపోవచ్చు" అంటాడు ఈస్ట్ ఉడ్. ఈస్ట్ ఉడ్ దర్శకత్వం వహించిన 10వ చిత్రం 'పేల్ రైడర్'. 'హంగ్ దెమ్ హై' చిత్రం వసూళ్ళ విషయంలో ప్రపంచంలోనే చరిత్ర సృష్టించింది. నలభై చిత్రాల్లో నటించిన ఈస్ట్ ఉడ్ 1 5 బిలియన్ల డాలర్లు సంపాదించాడు భార్యతో 25 ఏళ్ళు గడిపిన తరువాత ఆమెకు (మాగ్గీ) విడాకు లిచ్చి నటి సాంద్రాలాక్‌ను వివాహం చేసుకున్నాడు ఈ సందర్భంగా విడాకుల నిమిత్తం భార్య మాగ్గీ కి 25 మిలియన్ల డాలర్లు ఇచ్చాడు

ఇటీవల ఓ అమెరికన్ పత్రిక మీ కెవరంటే ఎక్కువ ఇష్టం అంటూ ఓటింగ్ ఏర్పాటు చేసింది




పేల్ రైడర్‌లో క్లింట్ ఈస్ట్ ఉడ్

రొనాల్డ్ రీగన్ మదర్ దెరిస్సాల కన్నా క్లింట్ ఈస్ట్ ఉడ్‌కు ఎక్కువ ఓట్లు వచ్చాయి యువతరంలో ప్రతి ముగ్గురిలోనూ ఒకరు ఈస్ట్ ఉడ్‌కు ఓటు వేశారు రైటర్స్ ఆవ్ ది లాస్ట్ ఆర్క్ ది ఎంపైర్ స్ట్రైక్స్ బాక్ వంటి సూపర్ హిట్ చిత్రాల రచయిత దర్శకుడు మార్క్ కాస్టాన్ క్లింట్ ఈస్ట్ ఉడ్ స్ఫూర్తితోనే సూపర్‌హిట్ చిత్రాల నందించానని అన్నారు

నేనెవరో తెలియకపోతే హాలీవుడ్‌లో ఈరోజు కూడా వేషాలకు పనికి రానంటారు నన్ను' అన్నాడు క్లింట్ ఈస్ట్ ఉడ్ నవ్వుతూ

○

---

## సూపర్ హీరో

మేడమ్!" అన్నాడు కారుడోర్ తెరచి

రజనికారు దిగి "ఎందుకలా ఫోన్ చేసి నా మీద ఒత్తిడి తెస్తున్నారు! ఎవరైనా చూస్తే ?" అంది నెర్వస్‌గా

"చూడనివ్వండి మేడమ్! మన సమస్య త్వరగా తేలిపోతుంది" అన్నాడు కరుణాకర్ నవ్వుతూ

"అంటే మీ ఉద్దేశ్యం!"

"ష్! అవన్నీ హాల్లోకి వెళ్ళేక మాట్లాడుకొందాం అందరూ మనల్నే అబ్జర్వ్ చేసేట్లు చేసుకోవడం మంచిదికాదు" అన్నాడ తను ముందుకి నడుస్తూ రజని భయంగానే అతని వెంట నడిచింది

సినిమా మొదలయింది

"ఇప్పుడు చెప్పండి. నేను మీ మీద ఒత్తిడి చేస్తున్నానా?" అంటూ రెట్టించేడు కరుణాకర్

"అవును ఒక పెళ్ళికాని అమ్మాయి నిలా ఒంటరిగా సినిమాకి రమ్మనడంలో మీ ఉద్దేశ్యం?"

"అంటే పెళ్ళయిన పిల్లల తల్లిని రమ్మనమంటే ఊరుకొంటుందా?"

"సిల్లీ!" అంటూ బలవంతంగా నవ్వాపుకొంది రజని

"ఎందుకు నవ్వుదాచుకొంటారు. నవ్వితే మీరు చాల బాగుంటారు"

అతని పొగడ్తకి రజని మొహం సిగ్గుతో ఎర్రబడింది

"మిమ్మల్ని నా వెంట తిప్పుకొని మిమ్మల్ని అల్లరి పెట్టాలన్నది నా ఉద్దేశ్యం కాదు మనసులో ఓ అభిప్రాయం అంటూ మొలకెత్తేక దాన్ని నిర్దాక్షిణ్యంగా త్రుంచడం నా అభిమతం కూడ కాదు ఎందుకు అంటే నేను చెప్పలేను కాని నా మనసంతా మీ రూపమే నిండిపోయింది నేను మిమ్మల్ని గాఢంగా ప్రేమిస్తున్నానని చెప్పడానికి ఇంతకన్నా ఆధారం కావాలనుకోవడం అవివేకమని గ్రహించేను చెప్పండి నన్ను ప్రేమించడానికి, పెళ్ళి చేసుకోవడానికి మీకేమైనా అభ్యంతరాలున్నాయా?" అతనంత సూటిగా అడిగే సరికి రజని సిగ్గుతో తలదించేసింది

"ప్లీజ్! మీ మౌనంతో అతి అపురూపంగా దొరికిన ఈ అవకాశాన్ని వృధా చేయకండి మిమ్మల్ని పదే పదే ఇలా బజార్ల వెంట తిప్పడం నాకిష్టం లేదు "

"మా నాన్నగారు "

"ఆయన సంగతి కాదు నేనడిగేది మీ అభిప్రాయం"

"నాకు నాకిష్టమే!" ఆమె సణిగినట్లు చిన్నగా చెప్పింది

"థాంక్యూ! ఒక దేవత కరుణించిన ఈ సందర్భంలో నాకు పిచ్చిగా గంతులు వేయాలనిపిస్తోంది కాని మన వెధవ సమాజంలో బాధని, సంతోషాన్ని కూడ బలవంతంగా దాచుకోవాలి! అద్సరే మీ వయసు ?"

అతని ప్రశ్నకి విచిత్రంగా చూసింది రజని

"అయ్ మీన్ మీరు మేజరే కదూ!"

అవునన్నట్లుగా తలవూపింది రజని

"ఇక కథ నేను నడిపిస్తాను మన పెళ్ళి తొందరలోనే "

రజని అతని వైపు భయంగా చూసింది

"మీరు మీరు తొందరపడొద్దు నాకెందుకో భయంగా వుంది" అంది అతని వైపు తత్తరపాటుగా చూస్తూ.

"ప్రేమలో భయానికి చోటులేదు డార్లింగ్ కృష్ణుడి కోసం రుక్మిణి, అర్జునుడి కోసం సుభద్ర, రోమియో కోసం జూలియట్, ఇలా చెప్పుకుంటూపోతే చరిత్ర నిండా ..ఎంతోమంది స్త్రీలు తెగించి భయాన్ని త్రెంచుకొని బయటపడ్డారు! అందులోనే థ్రిల్ వుంది

మరి!" అంటూ చొరవగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు.

రజనికి గుండె వేగంగా కొట్టుకుంటోంది.

అయినా అతని చేతిలోని తన చేతిని వెనక్కు తీసుకోలేకపోతోంది.

అతని వేళ్ళ కొసల నుండి పుద్భవిస్తున్న విద్యుత్తు ఆమె శరీరంలోకి ప్రవేశించి ఏదో తెలియని హాయిని పుట్టించి భయాన్ని వెనక్కు నెడుతోంది.

కరుణాకర్ ఆమె పరిస్థితి గమనించి ఆమె చేతిని వదలలేదు.

సినిమా జరుగుతున్నంత సేపు ఆమెను పొగుడుతూ తన ప్రేమ గురించి చెబుతూనే వున్నాడు.

రజని పూర్తిగా అతని మత్తులో పడిపోయింది.

తన కోసం ఒక వ్యక్తి పూర్తిగా ప్రాకులాడటం, తన ప్రేమ కోసం ఆరాటపడటం ఆమెకు తన మీద ఒక నమ్మకాన్ని, గర్వాన్ని కల్గించేయి.

ఇద్దరూ హాలు బయటికి వస్తుంటే "మళ్ళీ మీ పునర్దర్శనం ఎప్పుడు?" అన డిగేడు కరుణాకర్.

"కేసెట్స్ కోసం వస్తూనే వుంటాను కదా!" అంది రజని.

"అంటే నా కోసం రారన్న మాట!"

ఆమె నవ్వుతూ తలదించుకొంది.

"సరే! మిమ్మల్ని ఊరికే ఇబ్బంది పెట్టను. దేనికో దాని కోసం రండి! రావడం మాత్రం మానొద్దు. మిమ్మల్ని చూడకుండా వుండలేడీ దీనుడు!" అన్నాడు బాధగా మొహం పెట్టి.

రజని తలవూపి కారెక్కి స్టార్టు చేసి బయల్దేరుతుంటే అతను ఆనందంగా చెయ్యి వూపేడు.

* * *

# సూపర్ హీరో

"హలో!"

దమయంతి రిసీవర్ అందుకొని "హలో దమయంతి స్పీకింగ్!" అంది.

"నేను సుధీర్ ని"

ఆ మాట వినగానే ఆమె హృదయం లయితప్పింది. ఆనందంతో కళ్ళు మెరిసేయి.

"చెప్పండి" అంది ఉత్సాహంగా.

"చెప్పాలనే! ఎలా మొదలు పెట్టాలో తెలియడం లేదు" అన్నాడతను మెల్లిగా.

అతని మాటల్లోని శ్లేష ఆమెని మరింత సిగ్గుపడేలా చేసింది.

"డైలాగులు చెప్పడానికి బాగా అలవాటుపడ్డారుగా. ఇక కంగారు దేనికి?" అంది కవ్విస్తున్నట్లుగా.

"అదే! ఆ మాటే అంటారని భయం. ఒక మామూలు మనిషి జీవితమంతా నటించినా వాళ్ళనెవరూ వ్యాఖ్యానించరు. అదే ఒక నటుడు నిజం చెప్పినా అంతా నటన అనుకొంటారు" అన్నాడతను గొంతులో బాధని ఒలికిస్తూ.

ఆమె పకపకా నవ్వి "ఆ భయం మీకేమీ లేదు. నేను కూడ నటినే కదా, అర్థం చేసుకోగలను" అంది.

"హమ్మయ్య! మీ నవ్వు నాకు కొండంత బలాన్నిచ్చింది. కాకపోతే వరమివ్వమని మొక్కల్లి చేతులు జోడించిన దేవతనే వలచేనని చెబితే ఆ దేవత మండిపడి శపిస్తుందేమోనని భయపడుతున్నాను"

"నాకు...నాకర్థం కావడం లేదు మీరు చెప్పేది!" అన్నదామె గంభీరంగా లోపల ఎనలేని సంతోషాన్ని దాచుకొంటూ.

"అర్థమయ్యేట్లు చెప్పాలన్నదే నా తపన. మీరు నన్నొక నటునిగా తీర్చిదిద్దేరు. మీ మేలు మరచిపోలేను. బదులుగా...." అంటూ అతను అర్థోక్తిగా ఆగేడు.

"బదులుగా....ఏమివ్వదలచుకొన్నారు?" అన్నదామె కొంటెగా.

"మీరొప్పుకొంటే నా హృదయాన్ని!" అన్నాడతను ధైర్యం తెచ్చుకొని.

అంత సేపూ అతన్ని ఉడికిస్తున్న దమయంతి తొలిసారిగా మాటలు రానట్లు మూగవోయింది.

మౌనంగా క్షణాలు దొర్లుతుంటే సుధీర్ అసహనంగా "మేడమ్, నేను కాని మాటంటే క్షమించండి" అన్నాడు.

"అహ! అది కాదు," అందామె గాఢ రాగా.

"మరయితే చెప్పండి. నా హృదయాన్ని స్వీకరిస్తారా?" అన్నాడతను చిలిపిగా. మగవాడి చొరవ అతని గొంతులో ప్రతిధ్వనిస్తోంది.

ధనాధన్ అనిపించుకొన్న దమయంతిలో అచ్చమైన ఆడపిల్ల లక్షణాలు ముసురుకొని సిగ్గు తెరలు కప్పేస్తున్నాయి.

అయినా దాన్ని విదిలించుకొని "నన్ను పెళ్లి చేసుకొనే ధైర్యం మీకుందా? ఒక నటుడు కూడ నటిని పెళ్లి చేసుకోవడానికి ఇష్టపడడు కదా!" అంది.

"ఎందుకని?"

"ఆ ప్రశ్నకి జవాబు మీ మగ మనసులకే తెలుసు"

"మీరన్న దాంట్లో నిజం లేకపోలేదు. మిమ్మల్ని చాల దగ్గరగా చూసి తెలుసుకొన్నాను. ఒక నిండైన వ్యక్తిత్వం, అమాయకత్వం, భోళాతనం వున్న మనిషి మీరు. ఇంతకు మించిన మంచి అమ్మాయి నాకు భార్యగా దొరకగలదని నేను భావించడం లేదు."

"మీకు నా పట్ల వున్న అభిప్రాయాలకి కృతజ్ఞతలు" అంది దమయంతి చిరునవ్వుతో.

"నే కోరుతున్నది మీ కృతజ్ఞతలు కాదు. మీ హృదయాన్ని. దీనికి జవాబు చెప్పండి"

ఆమె చిన్నగా నవ్వి "అది ఏనాడో మీకిచ్చేసేను" అంది.

"వ్వాట్! మీ ఆడవాళ్ళు నిజంగా చాల గడుసువాళ్ళు. మగవాడే వెర్రి వెధవలా బయటపడేలా చేస్తారు" అన్నాడతను నవ్వుతూ.

"ఉంటాను మరి! నాకు షూటింగ్ కి టైమవుతోంది" అందామె రిసీవర్ క్రెడిల్ చేస్తూ.

మనసు ఆనంద డోలికల్లో తేలిపోతుంటే కొత్తగా పెట్టుకొన్న శమంత అనే టచప్ గర్ల్ ని తీసుకొని కంపెనీ పంపిన కార్లో షూటింగ్ కి బయల్దేరింది దమయంతి.

(ఇంకా ఉంది)





# మొర

– బుధ

**రాఘవరావు 'యుడీసీ'గా రిటైర్ అయ్యాడు. ఆ రోజు ఆఫీసులో జరిగినవి గుర్తుచేసుకున్నాడు.**

**చివరి రోజు పెన్షన్ పేపర్లు తన సీటు నుండి కదిలించడానికి ఒక్కొక్క పేపరుకు నూరు రూపాయలు పుచ్చుకున్నాడు.**

---

"పాతిక తీసుకునేవారు ఏకంగా నూరంటే ఎలాగండీ!" జుట్టు నెరసిన ఒక పెన్షనర్ ప్రాధేయపడ్డాడు.

"చూడండీ! నేను ఈ రోజు రిటైర్ అవుతున్నా... ఇక నేను ఎంత తిన్నా ఈ సాయంత్రం ఆరు గంటల వరకే. ఆరు గంటలకు సెండాఫ్ పార్టీ యిచ్చి నన్ను ఆఫీసు నుండి వన్స్ ఫర్ ఆల్ మెడబట్టి గెంటేస్తున్నారు మా స్టాఫ్. ఈ సీట్లోకి కొత్త వ్యక్తి వచ్చేందుకు ఎంతకాలం పడుతుందో ఏమో!" వ్రాసుకుంటూ తల ఎత్తకుండానే జవాబిచ్చాడు రాఘవరావు.

"దయచేసి ఒక పాతిక తగ్గించుకోండి... ఇంటి అద్దె పాతిక పెంచాడు ఇంటి వోనరు."

"మీ వెల్ విషర్ కాబట్టి చెబుతున్నా కొత్తగా వచ్చే వ్యక్తి ఏకంగా మారే అడగొచ్చు . రెండువందలే అడగొచ్చు! లేదంటే అసలు పైసా కూడా పుచ్చుకోకుండా పని చేయకుండా నిదానం చేయవచ్చు. ఈ విషయాలన్నీనే నెందుకు మీకు చెబుతున్నానంటే నేను మీ వెల్ విషర్ కాబట్టి! అర్థమైందా!!" కాస్త విసుక్కుంటూ అన్నాడు రాఘవరావు.

"సరే! మీరంత దిగిరాకపోయినప్పుడు తప్పదు కదా! తీసుకోండి" వందరూపాయలు అందించాడు ఆ వ్యక్తి.

"మీ పేరు"

"సింహాచలం."

"కాస్త అరగంట అలా తిరిగి రండి" ఫైళ్లలో మునిగిపోయాడు రాఘవరావు.

సాయంత్రం ఆరు గంటలకు ఘనంగా జరిగింది వీడుకోలు.

రాఘవరావు కళ్లు చెమర్చాయి.

రేపటి నుండి తను ఆఫీసుకు రానక్కరలేదు.

తను ఎవ్వరి ముక్కు పిండి మామూళ్లు వసూలు చేసుకోలేదు.

అన్ని రోజులు వేచి వుండిన వయసు ఒక్కసారి మీదపడ్డట్టు అనిపించింది రాఘవరావుకు.

వంటిలోని శక్తి అంతా ఆవిరి అయిపోయినట్టనిపించింది.

ఇల్లు దగ్గర కొచ్చింది.

రాజేశ్వరి వాకిట్లోనే కనిపించింది.

తను ఈ రోజు రిటైరై వస్తానని ముందే చెప్పాడు.

నుదుటికి పట్టిన చెమట తుడుచుకున్నాడు.

ఏదో మరచి పోయినట్టు అనిపించింది.

వెంటనే గుర్తొచ్చింది. రోజా పూలు కొని తీసుకపోయేవాడు.

కానీ మరిచిపోయాడు.

జేబు తడుముకున్నాడు.

ఎత్తుగా తగిలింది. ఆ రోజు పై సంపాదన రెండు వేలు.... మామూలుగా అయితే రెండు మూడు వందలు మించేది కాదు.

"ఏమండి! ఇల్లు ఖాళీ చేయాల్ట!! మంచి నీళ్ల దగ్గర మధ్యాహ్నం నేను ఇంటావిడా ఘర్షణ పడ్డాం. బిందెనిండక పోయినా ఆవిడ వస్తూనే అడ్డు తీయాల్ట" ఆరోపిస్తూ అంది రాజేశ్వరి భర్త వెంట లోనికివస్తూ.

"రేపు నెలలో రిజిస్ట్రేషన్ వుందిగా! కొనుక్కున్న ఇంటికి వెడతామని చెప్పలేకపోయావా!" కుర్చీలో కూర్చుంటూ అన్నాడు.

"రెండు నెలలుగా మీరు ఇంటి రిజిస్ట్రేషన్ వాయిదా వేస్తున్నారు... మీరు

కొన్న యిల్లు ఎవరికైనా అద్దెకిచ్చుకుంటారని అనుమానపడుతున్నారు."

"యాభై వేలు కట్టేసి, స్టాంపు ఫీజు చెల్లించేస్తే అయిపోతుంది రిజిస్ట్రేషన్! కాస్త కాఫీ ఇవ్వు."

"పాలు తోడేశానే."

"హోటలు కెళ్లి తాగొస్తాలే!" లేచాడు రాఘవరావు. బయటకొచ్చాడు.

చీకట్లు పడుతున్నాయి.

నక్షత్రాలు మినుకుమినుకుమంటున్నాయ్.

చంద్రుడు మబ్బుల చాటుకు వెళ్లాడు.

** ** ** **

రాఘవరావు రిటైరై సరిగ్గా నెల అయింది.

తన సీట్లో కూర్చున్న వ్యక్తివంక చూశాడు.

"కుర్రాడే! పర్లేదు" అనుకున్నాడు. ఆఫీసు మామూళ్ల పద్ధతులు తెలియజెప్పాలి పాపం! లేకపోతే జీవితంలో నష్టపోగలడు అనుకున్నాడు.

"కూర్చోండి!" ఎదుట వచ్చిన రాఘవ

## మొర

రావుకు కుర్చీ చూపించాడు.

"చూడబ్బాయ్! ఇంతకు ముందు నీ సీట్లో నేను వుండేవాడ్ని!..... నీకు పెళ్ల య్యిందా!!"

"నమస్తే సార్!... ఇంకా కాలేదు", వినయంగా అన్నాడు.

పర్లేదు ఒక సిగరెట్టు ప్యాకెట్టు ఇచ్చి లొంగదీసుకోవచ్చు అనుకున్నాడు రాఘవరావు.

"కూర్చోండి."

తను కూర్చొనే వున్నాడే మరెవ్వర్ని అనుకుంటూ వెనక్కు చూశాడు రాఘవరావు.

నెల క్రిందట కనబడ్డ సింహాచలం కనబడ్డాడు.

పాతిక రూపాయలు తగ్గించుకోమన్నట్టు తన్ను అడుగుతున్నట్టే అనిపించింది రాఘవరావుకు.

"కూర్చోండి సింహాచలంగారూ...అయాం యువర్ వెల్ విషర్... మీకు చేతనయినంత సహాయం చేస్తా!" ఆఫీసులో తన పూర్వపు హోదాను గుర్తుచేసుకుంటూ అన్నాడు రాఘవరావు.

"ఈయన మీకు తెల్సా సార్" కొత్తగా వచ్చిన వ్యక్తి అన్నాడు రాఘవరావుతో.

"తెల్సు!... మంచి వ్యక్తి!!... ఆయనకు ఏ విషయంలోనైనా సరే హెల్ప్ చేయండి" చనువున్నట్లు అన్నాడు రాఘవరావు.

"థాంక్స్" సింహాచలం రాఘవరావు వంక తిరిగి అన్నాడు.

"ఇదిగోండి..మీ కోసమే ఎదురుచూస్తున్నా!" అంటూ సింహాచలం చేతికి అందించాడు పెన్షన్ పేపర్లను.

"వస్తాను విజయ్" సింహాచలం వెళ్లిపోయాడు రాఘవరావు భుజంపై చేతితో తట్టి.

"నీ పేరు విజయ్ అన్నమాట!.... చూడు ఇప్పుడు పోయాడే ఆయన నాకేం కావలిసిన వ్యక్తి కాదు...మొహమాటం లేకుండా నీకు కావల్సినంత వసూలు చేసుకో... ముఖ పరిచయం బట్టి అలా అన్నానంతే!... ఈ సీట్లో వున్నన్ని రోజులూ ఈయనతో సుమారు అయిదు వందలు వసూలు చేసుకున్నాననుకో" కాస్త దగ్గరగా వొంగి అన్నాడు.

"ఈ నెల రోజులుగా నేను ఎవ్వరినుంచీ పైసా కూడా తీసుకోలేదండీ!...ఎటూ గవర్నమెంటు జీతంఇస్తూంది కదా!"

"రేపు పెళ్లయితే ఎలాగా! దీపం వుండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలోయ్!"

"మీరంతా చెబుతున్నారు...పెద్దవారు..మీ మాట కాదనడం నా కిష్టం వుండదు... కానీ మా నాన్నేమో ఎవ్వరి దగ్గిరా ఒక్క పైసా కూడా తీసుకోవద్దని చెప్పాడు. ఛ్ఛ్! సరే...మీరు అయిదు వందలివ్వండి" తాపీగా అన్నాడు విజయ్.

"అమ్మో! నీవు గురువుకే పంగనామం పెట్టే శిష్యుడిలా వున్నావే!" లోపల కాస్త భయపడ్డా బింకంగా అన్నాడు రాఘవరావు.

"లేదండీ! మీ రివ్వకపోతే అంతే!!"

"ఇల్లురిజిస్ట్రేషన్ చేయించుకోవాలి నాయనా!"

"ఛ్ఛ్! లాభం లేదండీ! నేనేమి మిమ్మల్ని లంచం అడగడం లేదు."

"మరి!"

"మా నాన్న దగ్గర పుచ్చుకున్న అయిదు వందలూ ఇచ్చేయండి చాలు."

"ఎవరూ సింహాచలంగారు మీ నాన్నా!"

"అవును...మీరు ఎంత మొర పెట్టుకున్నా వినేవారు కాదట గదా!"

"నేను మొర పెట్టుకున్నా విననంటావ్! సరే! రేపొస్తా" తలొంచుకుని రాఘవరావు బయటకొచ్చేశాడు. ●

## రష్యాలో రుణాలు

సోవియట్ యూనియన్‌లో పెట్టుబడులు రుణాల వ్యవస్థ పునర్వ్యవస్థీకరణ కార్యక్రమం అమలు ప్రారంభమయింది. ఈ ఏడాది జనవరిలో సోవియట్ ఆర్థికమంత్రిత్వ శాఖ మూడు తరహాల హుండీలను విడుదల చేసింది. మొదటిది వడ్డీలేని ప్రభుత్వ రుణ హుండీ. రెండోది అయిదు శాతం వడ్డీతో కూడిన రుణ హుండీ. మూడోది సోవియట్ ప్రభుత్వ ఖజానాకు సంబంధించిన రుణ హుండీ.

మొదటి తరహా-వడ్డీలేని ప్రభుత్వ రుణ హుండీ-పథకం క్రింద వెయ్యి కోట్ల రూబుళ్ల విలువచేసే హుండీల కొనుగోలుకు అవకాశం కల్పించారు. ఈ తరహా హుండీ కొనుక్కున్నవాళ్లు దానికి తగిన మొత్తానికి 1993 లో సరుకులు కొనుగోలు చేసుకోవచ్చు.

పోతే, సోవియట్ ఖజానాకు సంబంధించిన రుణహుండీలు జారీచెయ్యడం ఇదే ప్రథమం. యాభయి రూబుళ్ల నుంచి వెయ్యి రూబుళ్లదాకా ఈ రుణపత్రాలు సేవింగ్స్ బ్యాంకుల ద్వారా కొనుక్కోవచ్చు. ప్రతి ఒక్క రుణ పత్రంతో పాటు 16 కూపన్లు ఉంటాయి. వీటిద్వారా ఏటా హుండీ మొత్తం మీద అయిదు శాతం వడ్డీ పొందడానికి అవకాశముంటుంది. ప్రస్తుతం సోవియట్ సేవింగ్స్ బ్యాంకులు వ్యక్తిగత ఖాతాలపై మూడు శాతానికి మించి వడ్డీ చెల్లించడంలేదు. ఈ హుండీ ద్వారా మరో రెండు శాతం అధిక వడ్డీ సంపాదించుకోవచ్చన్నమాట. అంతేకాకుండా ఈ రుణపత్రాల హామీ మీద రుణాలు కూడా పొందవచ్చు.

ఇకపోతే అయిదు శాతం వడ్డీతో కూడిన రుణ హుండీలను ప్రభుత్వ సంస్థలూ, సహకార సంఘాలూ, ప్రజాసంస్థలు, క్రెడిట్ ఏజెన్సీలకు పరస్పరం ప్రయోజనకరంగా ఉండే రీతిలో-స్వచ్ఛందంగా మాత్రమే - అమ్ముతారు. ప్రస్తుతం సోవియట్ బ్యాంకులు ఆయా సంస్థల ఆస్తులపై ఏటా 0.5 శాతం వడ్డీ మాత్రమే చెల్లిస్తున్నాయి. ఇప్పుడు కొత్తగా ఏర్పాటుచేసిన రుణ హుండీలద్వారా ఈ సంస్థలకు అయిదు శాతం వడ్డీ లభిస్తుంది. అంటే పదిరెట్లు అధికంగా వడ్డీ లభిస్తుందన్నమాట. ఈ ఆదాయాన్ని ఆయా సంస్థల లాభాల మొత్తాలతో చేరుస్తారు. ఈ కొత్తతరహా హుండీలను హుండీదార్లు బ్యాంకు ద్వారాగానీ ప్రభుత్వ సంస్థల ద్వారాగానీ ఇతర్లకు అమ్ముకోవడానికి కూడా వీలుంది.

సరి "కొత్త" శీర్షిక

# హల్లో డాక్టర్! నేనేం చెయ్యాలి?

డా. కొత్త రవీంద్రబాబు



**మహమ్మద్ కరీముద్దీన్, కాకినాడ.**

స్వప్న స్కలనాలు. స్వరతి, అంగం చిన్నది, పొట్ట లావుగా వుంది. స్త్రీతో కలవాలంటే భయం. కాళ్ళు, చేతులు బలహీనంగా వుంటాయి.

అవివాహితులలో స్వప్న స్కలనాలు సర్వ సాధారణం మీ మనసులో వున్న అనవసరపు ఆలోచనలు పోగొట్టుకోటానికి ప్రయత్నించండి వ్యాయామం చెయ్యండి లేదా గేమ్స్ ఆడండి చదువుమీద దృష్టి సారించండి జీవితంలో ఆలోచించవలసిన అనేక ఉదాత్త విషయాలమీద మనసు లగ్నం చెయ్యండి

**సురేంద్ర పి, గుంటూరు.**

పెళ్ళి కాలేదు. స్వలింగ సంపర్కాని కలవడ్డాను.

రాచవీధి ఎదురుగా కనపడుతుంటే ముళ్ళతో నిండిన డొంకలమీద పయనం ఎందుకు మన దేశంలో స్వలింగ సంపర్కం శిక్షార్హం! ఇంగ్లీషు నవలలు చదివి మతి చెడగొట్టుకోకండి మామూలు దారిలోకి రావాలంటే సైకియాట్రిస్ట్ హెల్ప్ తీసుకోవచ్చు ఎవర్షన్ థెరపీ వలన ఉపయోగం వుంటుంది

**సుభాష్‌చంద్ర సి, అవనిగడ్డ**

జుట్టు వూడుతున్నది. బట్టతల అవుతుందని భయం.

ఏస్కజిన్ గొట్టం భోజనానంతరం వేసుకోండి

**రామమూర్తి కె, ఒంగోలు.**

వేసెక్టమీ చేయించుకుంటే సెక్స్ సామర్థ్యం తగ్గుతుందా? నాకు భయంగా వుంది.

వేసెక్టమీ వలన సెక్స్ సామర్థ్యం తగ్గదు కొంతమందిలో వృద్ధి అవుతుంది కూడా. నిర్భయంగా ఆపరేషన్ చేయించుకోండి

**ఎ. శాంతిశ్రీ, రాజమండ్రి.**

మీ అభిమాన రచయిత ఎవరు?రచయిత్రి ఎవరు?

నా అభిమాన రచయిత కృష్ణదేవరాయలు విషయ వైవిధ్యం అసాధారణ పాండిత్యం, స్వతంత్ర భావుకత్వం, అన్ని తరగతుల ప్రజల జీవితాలను నిశిత దృష్టితో పరిశీలించగల నేర్పు, అనవసరపు పదాలను వాడకపోవడం, యోగ రహస్యాలను వ్యక్తీకరించడం ఇలా అనేక విషయాలను– అనేక మణులను స్వర్ణకారుడు హారంలో పొదిగినట్లు మలచిన ఆయన రచన ఆముక్తమాల్యదను అనేకమార్లు చదివాను. చదువుతుంటాను

రెబెకా రచయిత్రి యీ మధ్యనే కాలధర్మం చెసిన డాఫ్నెద్యు మరియల్ నా అభిమాన రచయిత్రి సునిశిత మనస్తత్వ విశ్లేషణ, చక్కని శైలి, విషయ వైవిధ్యం శషభిషలు లేకుండా తిన్నగా సాగే రచన, పాత్రల హృదయాంతరాలలోకి చొచ్చుకు పోగల నేర్పు, పాఠకాదరణ కోసం పెడత్రోవ తొక్కని డాఫ్నెకు కొద్దిలో నోబుల్ ప్రైజ్ తప్పిపోతేనేం నావలె అనేకమంది పాఠకుల హృదయాలలో ఆమె స్థానం బహు పదిలం

**ఎస్. సాంబయ్య, వేటపాలెం.**

పదిహేనేళ్ళనుండి అన్నం తినగానే కడుపు నొప్పి వస్తున్నది.

మీకు బహుశ డుయొడినల్ అల్సర్ వుండవచ్చు. కారం, మసాలా, కాఫీ, టీ, సిగరెట్, డ్రింక్స్ మాని పాలు, పెరుగు, మజ్జిగ పరిపక్వ ఆహారం వేళకు తీసుకోండి.

పరీక్షలు చేయించుకుని అల్సర్ అని నిర్ధారణ అయితే ఆపరేషన్ చేయించుకోండి.

**పి. శివరావు, భోదన్.**

పసరు తిత్తిలో రాళ్ళున్నాయి. జ్వరం, కడుపు నొప్పి.

దగ్గర్లోవున్న సర్జన్‌కు చూపుకుని వెంటనే ఆపరేషన్ చేయించుకోండి

**ఎ. వి. రావు, విశాఖపట్నం.**

మధుమేహ వ్యాధి వుంది. గిలక ఆపరేషన్ చేయించుకోవచ్చా?

మధుమేహ వ్యాధి కంట్రోలు చేయించుకున్న తర్వాత ఆపరేషన్ చేయించుకోవచ్చు.

**పి. సునీత, వొంగోలు.**

వంటిమీద దద్దుర్లు, మీసాలు వస్తున్నాయి.

జాడిన్ బిళ్ళ రోజు కొకటి రాత్రిళ్ళు నెలపాటు వాడండి మెబెక్స్ ఉదయం, సాయంత్రం మూడు రోజులపాటు ఆరు బిళ్ళలు వాడండి మీసాలు శాశ్వతంగా పోవాలంటే ఎలక్ట్రాలిసిస్ చేయించుకోండి బ్యూటీషియన్ దగ్గర

**షేక్ పాషా, మంగళగిరి.**

సైల్స్ వలన నీరసం.

డాక్టరుగారికి చూపించుకుని అవసరమైతే ఆపరేషన్ చేయించుకోండి

**వై. హేమ, గడ్డిఅన్నారం.**

వయసు 18 సంవత్సరాలు. సెక్సు కోరికలు ఎక్కువగా కల్గటానికి మందు వ్రాయండి.

వివాహం అయి భర్తకు అసంతృప్తిగా వుంటే మాత్రమే మందులు వాడండి సైకియాట్రిస్ట్‌కు చూపించుకోండి. లేదా తెనాలి వచ్చినా పరీక్షించాక మందులు రాస్తాను

**ఎ. ఎల్. నారాయణ, విశాఖపట్నం.**

మొటిమలు గిల్లుతాను. ఎలా పోతాయి.

మొటిమలు గిల్లడం ప్రమాదం యుథైనా క్రీం రాయండి. సబ్బు బదులు సున్నిపిండి వాడండి టెట్రాసైక్లిన్ 250 మిల్లీ గ్రాముల గొట్టం రోజ కొకటి చొప్పున ఆరు నెలలు వాడండి.

**జి. సుబ్బారావు, కాకినాడ.**

పాఠాలు గుర్తుండడం లేదు.

ఎన్ సి ఫ జాల్ బిళ్ళ రోజు కొకటి చొప్పున నెల రోజులు వాడండి.

## గుండెజబ్బుల నివారణకు 'కొలెస్టరాల్' తగ్గింపు

అమెరికాలో ఇప్పుడు ఏటా సంభవిస్తున్న మరణాలలో అత్యధికభాగం గుండె జబ్బుల వల్లనే సంభవిస్తున్నాయి కాగా, రక్తనాళాలు గట్టి పడిపోవడం వల్ల ఏర్పడే హృద్రోగాన్ని 20 శాతం మేరకు తగ్గించేందుకై అమెరికన్లు తాము తీసుకునే ఆహారంలో క్రొవ్వు (కొలెస్టరాల్)ను నగటున 10 శాతం వరకు తగ్గించుకోవాలని 'నేషనల్ హార్ట్, లంగ్ అండ్ బ్లడ్ ఇన్‌స్టిట్యూట్' విడుదల చేసిన తాజా నివేదికలో సిఫారసు చేశారు. రక్తంలో అధికంగా చేరే క్రొవ్వుతో పాటు అధిక రక్తపోటు, ధూమపానం కూడా గుండె జబ్బులకు దారితీసే ఇతర ప్రధాన కారణాలుగా వున్నాయని, అయితే ఈ 'ప్రమాద కారణాల'న్నిటిని నిరోధించ వచ్చునని నివేదిక పేర్కొంది. అమెరికాలో 'కరోనరి' హృద్రోగం వల్ల ఏటా 5 లక్షల మందికి పైగా చనిపోతున్నారని ఈ నివేదిక వెల్లడించింది.

# "గజ" దొంగ వీరప్పన్ కోసం

శ్రీ విశ్వనాద్ ప్రతాప్‌సింగ్ గారి నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వ మంత్రివర్గంలో ఏకైక మహిళా సభ్యురాలయిన శ్రీమతి మేనకా గాంధీ పేరు మనకు యీమధ్య పేపర్లలో తరచూ కనిపిస్తూనే వుంది ఈవిడ గొప్ప పర్యావరణ పరిరక్షకురాలు మంత్రికాక ముందు కూడా పర్యావరణ పరిరక్షణకు శ్రీమతి మేనక తన వంతు ప్రచారం, కృషి చేస్తూ వుండేది పరిసరాల,పర్యావరణ, అడవుల పరిరక్షణ సహాయ మంత్రిగా అయిన తరువాత యీ కృషికి బాగా



ప్రచారం లభించింది. ఎక్కడైనా పంజరంలో చిలుకలు లేక యితర పక్షులేవైనా కనబడితే వాటిని స్వేచ్ఛా కాశంలోకి వదిలేసేదాకా వూరుకోదు. చివరికి ప్రధానమంత్రి వి. పి. సింగ్‌గారిని కూడా వదల్లేదు. ఆయన ధరిస్తున్న టోపీ గొఱ్ఱెల ఉన్ని నుండి తయారు చేయబడినదని, దానివలన కొన్ని అమాయక గొఱ్ఱెలకు ప్రాణ హాని జరుగుతోందని భావించి, కృత్రిమ ఉన్నితో తయారు చేయబడ్డ మూడు 'టోపీలు' ప్రెజెంట్ చేసింది. అలాగే పాము చర్మాలతో చేసే హ్యాండ్ బ్యాగ్‌లు వాడవద్దని, మాంసాహారం మానేయమని తన సహ జాతీయులకు విజ్ఞప్తి చేసింది తను కేవలం నూలు వస్త్రాలనే ధరిస్తుంది పట్టు చీరలంటే గిట్టదు ఎందుకంటే పట్టు చీరలు తయారు చేయడానికి పట్టు పురుగులను చంపేస్తారని!

శ్రీమతి మేనకా గాంధీ మంత్రి అయిన తరువాత భారత దేశంలో నానాటికీ క్షీణిస్తున్న ఏనుగుల సంతతి (మితిమీరు తున్న ఏనుగు దంతాల స్మగ్లింగ్)మీద, చందనం అడవుల మీదకి తన దృష్టి సారించింది. కానీ తన ప్రయత్నా లన్నింటిని నీరు గారుస్తున్న వ్యక్తి ఈవిడకి పెద్ద తలనొప్పిగా తయా రయ్యాడు. గంధపు వస్తువులని, ఏనుగు దంతంతో తయారు చేయబడ్డ వస్తువు లని స్మగ్లింగ్ చేసే వ్యక్తిని పట్టుకోవడం కోసం అనేక చర్యలు తీసుకోవడానికి నిర్ణయించుకొంది. అతని పేరు 'వీర ప్పన్.' ఇతను యిప్పటివరకు యీ స్మగ్లింగ్ వ్యవహారంలో 16 మంది ఉద్యోగులని, 350 ఏనుగులని చంపిం చాడు ఇతను తన కార్యకలాపాలన్నీ దక్షిణ భారత దేశంలోని కేరళ, తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల సరిహద్దు ప్రదేశాలలో సాగిస్తుంటాడు ఇతన్ని పట్టుకోవ డానికి నాలుగు రాష్ట్రాల ముఖ్య మంత్రులు 'సంయుక్త కార్యాచరణ పథకం' ఏదైనా ప్రారంభించాలని ఆ యా ముఖ్యమంత్రులకి విజ్ఞప్తి చేసింది

ఈ వీరప్పన్ తన కార్యకలాపాలను సాగించటానికి ఒక బృందాన్ని (సైన్యం లాంటిది) ఏర్పరుచుకొన్నాడు. వీరి దగ్గర అధునాతన పరికరాలు కూడా వున్నా యట. వీరు తమ ఆయుధాలతో ఫారెస్ట్ ఆఫీసర్‌లని, ప్రజలను భీతావహులనిచేసి అడవులను ఆక్రమించుకుంటారు. ఇతని ఆగడాలు పూర్తిగా అదుపు తప్పాయన డానికి క్రింద ఉదాహరణలు చాలు. వీరిని ఎదుర్కోవడానికి పారా మిలటరీ దళాలను లేదా సైన్యాన్నైనా పిలి పించాలని కర్నాటక పోలీసులు ఒక దశలో అనుకున్నారు. కర్నాటక పోలీసు లతో కలిసి దాడి చేయమని తమిళనాడు పోలీసులకు ముఖ్యమంత్రి కరుణానిధి ఆదేశించారు. ఇతన్ని పట్టుకోవడానికి 'ఆపరేషన్ స్నాప్' పేరుతో 'బర్‌గూర్' అడవుల ప్రాంతంలో పోలీసులు దాడి చేశారు. కానీ కేవలం యిద్దరు 'వీరప్పన్' మనుష్యులు మాత్రమే మరణించారు. 12 మంది పోలీసులు గాయపడ్డారు.

క్రిందటి సంవత్సరం జనవరిలో వీరప్పన్ కర్నాటకలోని మహదేశ్వర పర్వత ప్రాంతంలో 'సిల్ విక్కల్' అనే ప్రదేశంలో కోటి రూపాయల విలువైన చందనం దాచి వుంచాడని పోలీసులకు సమాచారం అందింది. మైసూరు ఎస్. పి. 'బిపిన్ గోపాల కృష్ణన్' ఆధ్వర్యంలో ఆ ప్రదేశానికి పోలీసులు తరలి వెళ్ళారు. వారికి అక్కడ తుపాకి గుళ్ళతో స్వాగతం లభించింది. దానితో ఆ పోలీసులకి



# మేనకాగాంధీ వేట!

ఆత్మస్థైర్యం తగ్గింది.

"మహా స్మగ్లర్" అయిన యీ వీరప్పన్ తమిళనాడులోని 'సేలం' వూరుకి 80 కి. మీ. దూరంలో వున్న ఒక కుగ్రామానికి చెందినవాడు. ఇతని వయస్సు 38 యేళ్ళు. ఈ సరిహద్దు ప్రాంతాలలో వుండే గ్రామ ప్రజలే యితనికి స్మగ్లింగ్‌లో సహాయ పడతారని అంటారు. దీనివల్ల వీరికి కూడా చాలా డబ్బులు లభిస్తా యిట. వీరప్పన్ ఈ దంతాలను, చందనాన్ని (సాండల్‌వుడ్) కర్నాటక, కేరళలోని పరిశ్రమలకి సరఫరా చేస్తుం టాడు.

1986వ సంవత్సరంలో ఒక 'బెంగుళూర్' బార్‌లో వీరప్పన్ పోలీసులకి దొరికిపోయాడు. కానీ జైలు ఉద్యోగులకి అధిక మొత్తంలో లంచం యిచ్చి తప్పించుకున్నాడు. అప్పటినుండి యిప్పటిదాకా మళ్ళీ దొరకలేదు. ఇతనివల్ల 1981లో మొత్తం దక్షిణ భారత దేశంలో 603 గా వున్న ఏనుగుల సంఖ్య ప్రస్తుతం 150కి పడిపోయింది. చందనం అడవులు కూడా అంత రిస్తున్నాయి. కేరళలో 'చందనం' పొందడానికి పరిశ్రమలు వేటికి పరిమితి లేకపోవడం కూడా యీ అక్రమ రవాణాకి ఒక కారణం. తమిళనాడులో యీ అడవులు ఎక్కువున్నప్పటికీ కేరళలో అడవుల దగ్గర పరిశ్రమలనేకం వెలిశాయి. ఈ పరిశ్రమలని తగ్గించమని, చందన వ్యాపారస్తులకి పరిమితి విధించే విధంగా చట్టాలు చేయమని శ్రీమతి మేనక కేరళ ముఖ్యమంత్రి నయనార్‌ను కోరారు.

నలుగురు దక్షిణ భారత రాష్ట్రాలకు వెళ్ళి ఒక పథకాన్ని రూపొందించమని 'ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ ఫారెస్ట్స్'ని అత్యవసరంగా పంపించింది శ్రీమతి మేనకా గాంధీ. పోలీసులకి యింకా అధునాతన ఆయుధాలు కూడా అందజేస్తామని కూడా హామీ యిచ్చారు. గజ స్మగ్లర్ వీరప్పన్‌ను వేటాడటంలో "భూతదయా పరురాలుగా" పేరు పొందిన శ్రీమతి మేనకా గాంధీ గెలుస్తారా? లేదా? చూడాలి. (జై)

# లవ్ గేమ్

చల్లా సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

నవ్య ఆశ్చర్యంగా చూస్తోంది.

అతని ప్రవర్తన మంచిది అని నిరూపించడానికి తగిన ఋజువు ఇందులో ఉందా? ఏవిటది?

ఉదయం లాల్ బహదూర్ స్టేడియంలో సూర్యం అగర్వాల్ టోర్నమెంట్ క్యాసెట్ అది. దానికీ-ఇతనికీ సంబంధమేవిటో అర్థం కాలేదామెకు.

"ఏవిటి నీ ఉద్దేశం. ఇది నేను ఉదయం నుంచి సాయంత్రం వరకూ స్టేడియంలో చూశాను" అంది చిరాగ్గా.

"కరెక్టే కానీ-నువ్వు చూసింది వేరని చెప్పడానికే మరోసారి చూపిస్తున్నాను. తొందరపడకుండా చూడు-" అన్నాడతను.

సూర్యం ఫస్ట్ సెట్ గెలిచినప్పుడు-కెమెరా ప్రేక్షకుల వేపు తిరిగింది. చిరాగ్గా అసహనంగా చూస్తున్న నవ్య-ఒక్కసారి ఉలిక్కిపడింది. నవ్వుతూ క్లాప్స్ కొడుతున్న తను-తన పక్కనే ఆవేశంతో చేతులూపుతున్న శ్రీమతి-

కెమెరా మరో వేపు ప్రేక్షకుల్ని చూపిస్తోంది.

అతను ఆమె వేపు చూశాడు.

"సోవాట్?" కోపంగా అంది.

"ఆవేశపడకు నవ్యా ....చూడు..." అని ఫాస్ట్ ఫార్వర్డ్ చేశాడు స్వాగత్-సూర్యం ఓ షాట్ కొట్టి-అది అగర్వాల్ రిసీవ్ చేసుకోలేకపోయినప్పుడు-

మళ్ళీ ప్రేక్షకుల్ని చూపిస్తోంది కెమెరా-మళ్ళీతను-శ్రీమతీ-మీనాక్షి-

"నీ వెనక కూర్చుని-కర్చీఫ్‌ని ఊపుతున్న ఆమె ఎవరో గుర్తు పట్టావా?" నవ్య చూసింది-అలా చూస్తూనే ఉంది.

లేచి నిలబడి-ఆనందంతో కేరింతలు కొడుతూ చేతులూపుతున్న ఆమె శైలజ!

"గుర్తుపట్టావ్ కదా! ఆమె పక్కనగానీ-కనీసం ఆమె పరిసరాల్లో ఎక్కడైనా నేనున్నానేమో చూడు."

అంటూ ఆ దృశ్యాన్ని ఫ్రీజ్ చేశాడు.

ఫొటోలో నిలబడి పోయిన ఆ సన్నివేశంలో ఆమె కళ్ళు ఆతృతగా వెదుకుతున్నాయి.

శైలజ పక్కన ఎవరో ఎనిమిదేళ్ళ పాప-ఆమె పక్కన ఇంకెవరో నలభై ఏళ్ళ స్త్రీ! అసలు స్వాగత్ కాదు. ఆమెకు అటూ ఇటూ పది కుర్చీల్లోనూ మగవాళ్ళే లేరు.

నవ్య ముఖం తెల్లగా పాలిపోయింది.

అంటే-అతను ఆమెతో కలిసి రాలేదు. ఆమెకు కారిచ్చి పంపించారు.

"నువ్వు అక్కడ ఆమెతో అప్పుడు ఉండి ఉండకపోవచ్చు. వేరే పని మీద ఎక్కడికయినా వెళ్ళి తిరిగి వచ్చి ఉండొచ్చు గదా?" అంది పట్టుదలగా.

"కరెక్టే....." అని-క్యాసెట్ ఫాస్ట్ ఫార్వార్డ్ చేసి-ఆఖరి ఘట్టం-సూర్యం గవర్నర్ చేతి మీదుగా మెమెంటోను అందుకుంటున్నప్పుడు మళ్ళీ ప్రేక్షకుల్ని చూపించారు- హర్షధ్వానాలు చేస్తున్న-ప్రేక్షకుల్లో తామూ-తమ వెనక శైలజ ఒంటరిగా-

"ఇంకా నీకు అనుమానంగా ఉంటే-" అని ఫోన్ దగ్గర కెళ్ళి ఓ నంబర్ డయల్ చేసి- రిసీవర్ ఆమెకిస్తూ అన్నాడు.

"ఇది శైలజ ఇంటి నెంబరు-నిన్ను నువ్వు పరిచయం చేసుకుని-నీ అనుమానాలన్నీ అడిగెయ్-" అన్నాడు.

ఫోనందుకుంది నవ్య-

అవతలి నుంచి "హలో.....హలో...." అంటోంది శైలజ.

"హలో...నేను......మిసెస్ స్వాగత్‌ని...." అతి కష్టం మీద పలికిందామె కంఠం.

"ఓ....గుడీవినింగ్ మేడమ్ చెప్పండి...." అంది శైలజ.

"ఈ రోజు మిస్టర్ స్వాగత్ ఆఫీస్‌కొచ్చారా?"

"వచ్చారు మేడమ్! కానీ-టోర్నమెంట్ చూడ్డం కోసం నేను జస్ట్ ఆఫీస్‌కెళ్ళి వెంటనే లీవ్ పెట్టి వచ్చేశాను. అప్పుడు బాస్ ఆఫీస్‌లోనే ఉన్నారు మేడం....ఎందుకు మేడం.... ఎనీథింగ్ రాంగ్?"

"నో.....నో....నథింగ్..థాంక్యూ....."

ఫోన్ పెట్టేసి అతని వేపు చూసింది.

అల్లరిగా నవ్వుతున్నాడతను.

ఆమెకు కంపరమెత్తింది. బుద్ధి గడ్డితిని-తాను చూసిందే నిజమన్న గుడ్డి నమ్మకంతో పిచ్చిదానిలా వెధవ పందెం కాసింది.

ఇప్పుడీ చీట్‌ని తాను ముద్దాడాలా?

అప్పుడు వెలిగిందామెకు ఆ ఆలోచన

"అయితే నీ కారు ఆ బ్యూటీ పార్లర్ ముందు ఎందుకుంది?"

కోలుకోలేని దెబ్బ కొట్టాననుకుని గర్వంగా చూస్తూ అడిగింది.

**ఇంతవరకూ సాగినకథ -: 9** పెళ్లయిన భార్యాభర్తలు ఆనందలోకాల్లో విహరించే మధురాతి మధురమైన తొలిరోజు అనుభవాలను చవిచూడాలనుకున్న స్వాగత్‌కు భార్య నవ్య నుంచి ఊహించని వ్యతిరేకత ఎదురవుతుంది. తన స్నేహితురాలు శ్రీమతి సహాయంతో స్వాగత్‌ను విడిపించాలనుకుంటుంది నవ్య. నవ్య బావ మన్మథరావుకు శ్రీమతి దేహశుద్ధి చేస్తుంది. తన సెక్రటరీ శైలజతో తనకున్న సంబంధాన్ని నవ్య నిలదీసి అడగటంతో వాస్తవం తెలియచెప్పేందుకు వీడియో ఆన్ చేస్తాడు.

"నువ్వు సరిగా గమనించి ఉంటే లీనా బ్యూటీ పార్లర్ పక్కనే గ్రిండ్లేస్ బ్యాంక్....."

"ఆ....చూశాను....."

"ఆ బ్యాంక్‌లో పనుండి-నాలుగ్గంటల టైమ్‌లో అక్కడికెళ్ళాను నేను. కావాలంటే పాస్ బుక్ చూసుకో..." అంటూ బీరువాలోంచి పాస్ బుక్ తీసి చూపించాడు. ముప్పై వేలు ఈ రోజు డ్రా చేసినట్టుగా ఎంట్రీ ఉంది. ఆమె తలెత్తలేదు.

"సో-నాకారు అక్కడ చూసిన నువ్వూ-నీ ఫ్రెండూ-ఇన్వెస్టిగేషన్ మొదలుపెట్టి- టోర్నమెంట్ చూసి బ్యూటీ పార్లర్ కెళ్ళిన శైలజను ఇంటరాగేట్ చేసి ఉంటారు. శైలజ చాలా స్టబర్న్-మీ ప్రశ్నలకు ఒళ్ళుమండి-తిక్కగా సమాధానాలిచ్చి ఉంటుంది. మీరది నిజమని నమ్మి-నా మీద దాడి చేయాలని ప్రయత్నించారు-బట్...." అతనో క్షణం ఆగి అన్నాడు.

"బ్యాడ్ లక్! నువ్వు ఓడిపోయావ్-"

ఆమె తలెత్తి చూసింది. విజయగర్వంతో నవ్వుతున్నాడతను.

"అంతేకాదు. మొన్న శ్రీమతికి పార్టీ ఇస్తున్నామని నన్ను ఇంటికి రమ్మని ఫూల్ని చేయాలని ప్రయత్నించారు. అనుకోకుండా ఇంటికి బయల్దేరిన నాకు మధ్యలో మీరు ఆటోలో వస్తూ కనిపించారు. నేను మిమ్మల్ని ఫాలో అయి సినిమా కొచ్చాను పాపం.... అక్కడా ఓడిపోయారు......"

నవ్వుతున్నాడతను.

ఆమెకేం చేయాలో తోచడం లేదు.

కొద్దిసేపటి క్రితం వరకూ-అతన్ని నడివీధిలో అతనింటి ముందే ఎడమకాలు చెప్పు తీసుకుని చెంపలు వాయించే మనోహర దృశ్యాన్ని పలుమార్లు రివైండ్ చేసి మరీ ఊహించుకుంది. కానీ-

కథడ్డం తిరిగింది.

ఏం చేయాలి? ఏం చేయాలి?

ఉన్నపళంగా బయటకు పరుగెత్తి వేరే గదిలోకి వెళ్ళి తలుపేసుకుంటే-ఇతనొక మూర్ఖుడు.

అవతల సూర్యం-అక్క-మన్మథరావ్‌లు ఉన్నారన్న విచక్షణ కూడా లేకుండా తలుపులు బాదుతాడు.

"ఇంకాలస్యం దేనికి?"

ఉలిక్కిపడి చూసింది. అతను అల్లరిగా నవ్వుతున్నాడు.

ఆమెకు ఒంటి మీద కారం రాసుకున్నట్టుంది.

అవమానంతో గుండె భగ్గుమంటోంది.

"పోనీ-ఎంతైనా ఆడదానివి-మొదటిసారిగా నన్ను ముద్దుపెట్టుకునేంత చనువు నీలో లేకపోతే-అవనేదో నేనే చేస్తాను-ఒకే?"

అతను కదిలి నెమ్మదిగా ముందుకొస్తున్నాడు.

ఆమెకు కాళ్ళ కింద భూమి కదిలిపోతున్నట్టు-

ఆకాశం విరిగి-మీదపడినట్టు-

శరీరం పట్టుతప్పి తూలిపోతున్నట్టు అనిపించసాగింది-

అసహ్యం-ద్వేషం-పగ-కసి-ప్రతీకారం-

అన్నీ ఒక్కసారే ఆమెలో ముప్పిరిగొనగా-

కళ్ళుమూసుకుని-

తన పరాజయానికి-పతనానికి క్షణాలు లెక్కవేస్తోంది.

ఒకటి-

రెండు-

మూడు-



అతని అడుగులచప్పుడు దగ్గరవుతోంది.

నాలుగు-ఐదు-

"బలవంతంగా సింహాన్ని లొంగదీసు కోవచ్చునేమోగానీ-ఓ మొగ్గను వికసింప చేయలేమన్నది నా సిద్ధాంతం. నీ ముఖంలో నా మీద కనిపిస్తున్న ఆ దారుణమైన అసహ్యాన్ని చూస్తూ-భరిస్తూ-నీ పెదవులు ముద్దాడేంత రాక్షసుణ్ణి కాదు నేను. డోంట్ వర్రీ-హాయిగా పడుకో-గుడ్‌నైట్!"

ఆమె కళ్ళుతెరిచి చూసింది. అతను మంచం మీదపడుకునున్నాడు.

హాయిగా ఊపిరి పీల్చి-బెడ్ మీద వాలింది నవ్య.

*** *** *** ***

ఆమె టాక్సీ దిగి బీచ్‌లోకి నడిచింది.

అతను ఆమె వెనుకనే కారు దిగి-ఆమెకు మూడు గజాల దూరంలో నడుస్తున్నాడు.

వాళ్ళిద్దర్నీ ఫాలో అవుతున్న ఆ వ్యక్తి ఆటో దిగి అతనికి నాలు గజాల దూరంలో నడుస్తున్నాడు.

ఆమె ఓ చోట నిలబడి చుట్టూ చూసింది.

అతను మరో చోట నిలబడి ఆమెనే చూస్తున్నాడు.

ఆ వ్యక్తి వేరే చోట నిలబడి వాళ్ళిద్దర్నీ చూస్తున్నాడు.

ఆమె అతని వేపు కోపంగా చూసింది. అతను చిన్నగా నవ్వాడు.

ఆమె ముఖం చిట్లించింది.

అతను చెయ్యెత్తి మూడు వేళ్ళు చూపించాడు.

ఆమె ఒక్క వేలు చూపించింది.

ఆ వ్యక్తి దవడకండరం బిగుసుకుంది.

వీళ్ళిద్దరూ కలిసి ఆ రోజు తనని ఫూల్‌ని చేశారు, మొగుడూ పెళ్ళాలని నాటకమాడి.

ఆరోజు తప్పించుకున్నారు.

కానీ తనకు తెలిసినంత వరకూ ఏ మొగుడూ పెళ్ళాలూ-ఒకరు టాక్సీలో మరొకరు కారులో బీచ్‌కి రారు. పైగా హాయిగా చెట్టాపట్టాలేసుకుని కబుర్లు చెప్పుకోకుండా-ఇలా సైగలు చేస్తూ కోడ్‌లో మాట్లాడుకోరు. అంటే ఖచ్చితంగా వీళ్ళిద్దరూ-

మాఫియా గాంగ్!!

ఆమె విసురుగా లేచి నడుస్తోంది.

ఆమె కూర్చుని లేచిన చోట చిన్న కాగితం మడతపెట్టి పడుంది.

అతను వేగంగా వెళ్ళి అది తీసుకుని-

ఆమె వేపు చూశాడు. అతని ముఖంలో కనిపిస్తున్న ఆనందాన్ని గమనించిన ఆ వ్యక్తి దవడ కండరం మళ్ళీ బిగించాడు.

అతను ఆమె దగ్గరకెళ్ళి చెవిలో ఏదో గుసగుసలాడాడు.



కొందరి మరణాలు ఎప్పుడు ఎక్కడ ఏ విధంగా సంభవిస్తాయో చెప్పలేమనటానికి నిదర్శనమే ఈ వ్యక్తి మరణం. కల్లు గీసి తాటి చెట్టు దిగుతూ ప్రాణాలు కోల్పోయిన మీనానగరానికి చెందిన కట్టా రామన్న అనే ఈ గీత కార్మికుని 'గీత' యిలా వ్రాసి వుంది కాబోలు!

ఆమె తల అడ్డంగా ఊపి రెండు వేళ్ళు చూపించింది.

అతను మూడు వేళ్ళు చూపించాడు.

ఆ వ్యక్తికి మతిపోతోంది.

ఈ రోజు వీళ్ళ వ్యవహారం అంతుచూడాలి. రెడ్‌హేండెడ్‌గా వీళ్ళిద్దర్నీ ప్రభుత్వానికి పట్టించాలి.

తనలాంటి పౌరధర్మం తెలిసిన పౌరుడు ఈ దేశంలో ఉండడం ఈ దేశం చేసుకున్న పుణ్యం.

అవును. ఈ దేశం గుర్తించే ఉత్తమ పౌరుడిగా తాను ఎదిగిపోవాలి.

ఆవేశంతో అతని ఛాతీ అరంగుళాలు పెరిగింది.

ఆ పెరుగుదలకు నిరసనగా-అతని షర్ట్ బటన్స్ గుండెల మీద ఫట్‌మని తెగిపడ్డాయి.

అతను నాలుక్కర్చుకుని.

మరీ ఇంతిదిగా ఆవేశపడకూడదనుకున్నాడు.

ఐస్‌క్రీం తీసుకుంటోందామె.

అతను కూడా వెళ్ళి ఐస్‌క్రీం తీసుకున్నాడు.

అటుగా బాల్‌కోసం పరుగెత్తుకొచ్చిన ఓ ఐదేళ్ళ కుర్రాడిని పిలిచి ఆమె ఐస్‌క్రీం ఇచ్చింది.

ఆ కుర్రాడు అది తీసుకుని ఆనందంగా వెళ్ళిపోతుంటే-

అతను పిలిచి-తన దగ్గర ఐస్‌క్రీం కూడా ఆ కుర్రాడికిచ్చాడు.

ఆ వ్యక్తి భృకుటి ముడిపడింది.

తన చేతిలోని ఐస్‌క్రీం-తినాలా వద్దా? లేక తాను కూడా ఆ కుర్రాడికివ్వాలా? అన్న డైలమాలో పడిపోయాడా వ్యక్తి. మాఫియా వ్యక్తులు చేసే ప్రతి పని వెనుక ఓ మాస్టర్ ప్లాన్ ఉంటుందన్న తన అభిమాన రచయిత వాక్యం గుర్తొచ్చి-ఇక ఆలోచించకుండా-ఆ కుర్రాణ్ణి పిలిచి-తన దగ్గర ఐస్‌క్రీం ఇవ్వబోయాడా వ్యక్తి.

రెండు చేతుల్లో రెండు ఐస్‌క్రీమ్స్ పట్టుకుని. అతనిస్తున్న మరో ఐస్‌క్రీంని ఎలా పట్టుకోవాలో అర్థం కాక నిలబడిపోయాడా కుర్రాడు.

ఆ వ్యక్తి దవడ కండరం బిగుసుకుంది.

అంటే-

ఈ కుర్రవెధవ కూడా ఆ మాఫియా గాంగ్‌లో వాడన్నమాట.

లేకపోతే-వాళ్ళిద్దరిచ్చిన ఐస్‌క్రీమ్స్ తీసుకుని తానిచ్చే ఐస్‌క్రీం తీసుకోలేదంటే-

తాను ఆ మాఫియా గాంగ్ వాడు కాదని వాడికర్థమైపోయిందన్న మాట-

సన్నగా-పొట్టిగా-బట్టతలతో-షర్ట్ గుండీలు తెగిపోయి దవడకండరం బిగించి తననే ఉరిమి చూస్తున్న ఆ వ్యక్తిని చూసి

ఆ కుర్రవాడు ఘొల్లుమన్నాడు.

భాగ్యరాజ్ వెనక్కి తిరిగి చూశాడు.

భార్గవి కూడా చూసింది.

ఆ వ్యక్తిముందు నిల్చుని ఏడుస్తున్న కుర్రాణ్ణీ - కోపంగా చూస్తున్న ఆవ్యక్తినీ గమనించి అక్కడికొచ్చాడు భాగ్యరాజ్.

"వాట్ హాపెన్డ్ జెంటిల్మన్?" అడిగాడు భాగ్యరాజ్.

"అదే ప్రశ్న నేనూ అడగాలనుకుంటున్నాను. తీవ్రంగా అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడావ్యక్తి."

"మిమ్మల్నెక్కడో చూసినట్టు గుర్తు." అన్నాడు భాగ్యరాజ్.

"హు - ఎంతందంగా నటిస్తున్నారు."

పబ్లిక్ ప్లేస్ కావడం మూలంగా ఇంకా అతను కుడిప్యాంటు జేబులో 0.35 ఆటోమేటిక్ కోసం చేయిపెట్టలేదు.

ఇంతలో భార్గవి కూడా అక్కడికొచ్చింది.

వచ్చిన వెంటనే ఆవ్యక్తిని గుర్తుపట్టి-

"హలో... ఆ రోజు మీరు రెస్టారెంట్‌లో మమ్మల్ని ఫాలో అయ్యారు కదూ-" అంది.

ఆ వ్యక్తి విలాసంగా నవ్వి -

సిగరెట్ తీసి వెలిగించుకుని అన్నాడు.

"యస్ మేడం... ఆ వ్యక్తిని నేనే!"

"మళ్ళీ ఇక్కడ కూడా మమ్మల్ని ఫాలో అవడానికే వచ్చారా?" కోపంగా అడిగింది

"హు! బాధ్యతగల పౌరుడిగా నా కర్త

వ్యాన్ని కాదనడానికి మీరెవరు?" గర్వంగా సిగరెట్ పొగ పైకి వదిలి అన్నాడతను.

"ఇదేదో పిచ్చాసుపత్రి కేసులా ఉంది. పదండి వెళ్దాం-" అంది భార్గవి.

ఆ వ్యక్తి ప్రళయకాళరుద్రుడిలా విరుచుకు పడాలనుకున్నాడు.

తన అభిమాన రచయిత నవల్లో - హీరో అలాగే విరుచుకుపడతాడు. కానీ అలా విరుచుకుపడడం అంటే ఏవిటో అతనికి తెలీకపోవడంవల్ల - నోటికి ఆగ్నేయమూలంగా ఓ చిరునవ్వు విసిరి -

"ఎవరు ఎవర్ని పిచ్చివాళ్లను చేయాలనుకుంటున్నారో - ఎందుకు చేయాలనుకుంటున్నారో - ఎప్పుడు చేయాలనుకుంటున్నారో, ఎలా చేయాలనుకుంటున్నారో నాకు బాగా తెలుసు మేడం" అన్నాడు.

"ఇది మామూలు పిచ్చికాదు భార్గవీ. తెలుగు నవలలు చదివి చదివీ ఎక్కిన పిచ్చి. దీనికి మందు లేదు. ఆ భగవంతుడే దిక్కు పాపం." అన్నాడు భాగ్యరాజ్.

ఆ వ్యక్తి దవడ కండరం గట్టిగా బిగుసుకుంది.

భాగ్యరాజ్ అడిగాడు.

"ఎందుకలా చీటికి మాటికీ ఆ దవడ కండరాన్ని అలా బిగిస్తావ్?"

"శరీరంలో మరే కండరం బిగుసుకోక పాపం...."

దిగులుగా అతన్ని చూస్తూ అంది భార్గవి.

"హు" అని నిట్టూర్చి - విషాదంగా నవ్వి అన్నాడావ్యక్తి.

"సమాజానికి మేలు చేయాలనుకుని - సమసమాజంకోసం శ్వాసిస్తూ - సమసమాజం కోసం తన రక్తాన్ని సైతం ధార పోయగల ఉత్తమ పౌరుడికి ఈ సమాజం - ఈ మనుషులు - ఈ సంఘం ఇచ్చే గౌరవం ఇదేనా?"

"ఎక్స్‌క్యూజ్ మీ... మీరెవరితో మాట్లాడారు?" ఆశ్చర్యంగా అడిగాడు భాగ్యరాజ్.

"నేను మాట్లాడలేదు. నా అంతరాత్మ ఘోషిస్తోంది. ఆ ఘోష నా నోటి ద్వారా



బహిర్గతమయింది. అంతే."

"మే గాడ్ బ్లెస్‌యూ - వస్తాం. " భాగ్యరాజ్ వెళ్లబోతుండగా -

"ఇంతకూ డీల్ కుదిరిందా?" గంభీరంగా ప్రశ్నించాడా వ్యక్తి.

"మీ గొంతెందుకలా హఠాత్తుగా మారిపోయింది?" వింతగా అడిగింది భార్గవి.

"అది గంభీరంగా అడిగిన ప్రశ్న కదా? అలాగే వినిపిస్తుంది!"

అన్నాడా వ్యక్తి మరింత గంభీరంగా.

"డీల్ ఏవిటి?" అడిగాడు భాగ్యరాజ్.

"అదే మాఫియా డీల్."

"సీ బ్రదర్ - జీవితంలో పైకి రావాల్సిన వాడివి. తెలుగు సాహిత్యం చదివి బుర్ర పాడుచేసుకోకు. డీలూ లేదు. నీ బొందా లేదు. మా మేనల్లుడు స్వాగత్‌కి ఇంట్లో ఏదో గొడవ వచ్చి గొప్ప చిక్కుల్లో పడిపోయాడట. వెంటనే బయల్దేరమని ఫోన్‌చేశాడు. నేను నాలుగు రోజులాగి వెళదామంటే - మా ఆవిడ రేపే బయల్దేర దామంటోంది. దాని విషయం ఆమె అలిగింది."

"అలిగిందా?" అరిచాడా వ్యక్తి.

"అవును. అలగడం ఆమె జన్మహక్కు. అలక తీర్చడం నా జన్మబాధ్యత."

"జన్మబాధ్యత అనరు" చిరాగ్గా అంది భార్గవి.

"జన్మహక్కు అన్నప్పుడు - జన్మ బాధ్యతని కూడా అనొచ్చు."

"ఎక్స్‌క్యూజ్ మీ... మళ్లీ మీరిద్దరూ అలిగి ఎంతో విలువైన నా కాలాన్ని మిమ్మల్ని ఛేజ్ చేయడంలో వృధా చేసుకునేలా చేయడం భావ్యం కాదు. ప్లీజ్..." అన్నాడా వ్యక్తి.

ఫక్కున నవ్వి భార్య భుజం మీద చెయ్యేసి కారుదగ్గరకు నడిపించుకుని వెళ్లాడు భాగ్యరాజ్.

ఆ వ్యక్తి దవడ కండరం మళ్లీ బిగుసుకుంది.

********************

"సార్!"

తలెత్తి చూశాడు స్వాగత్.

మేనేజర్ రత్నాకర్‌రావు నవ్వుతూ నిలబడున్నాడు.

"యస్...చెప్పండి..." అన్నాడు స్వాగత్.

"ఏం లేదు సర్... మనస్టాఫంతా మేడంగార్ని చూడాలని తెగ సరదాపడి పోతున్నారు. మీరు అనుమతిస్తే ఈరోజు సాయంత్రం వచ్చి చూడాలనుకుంటున్నాం." అన్నాడు.

స్వాగత్‌కేం చెప్పాలో అర్థంకాలేదు.

ఎప్పుడో పార్టీ ఇస్తానని చెప్పాడు తను. ఇంతవరకూ ఇవ్వకపోవడమే ఇల్ మేనర్స్ పైగా వాళ్లే వచ్చి స్వయంగా అడుగుతుంటే కాదనడం కూడా బావుండలేదు.

"అయాం వెరీ సారీ. ఆఫీస్ గొడవల్లో పడిపోయి - ఆ సంగతే మర్చిపోయాను. ఓ....కే... ఈరోజు సాయంత్రం మన స్టాఫంతా మా యింటికి వచ్చేయండి. డిన్నర్‌కూడా అక్కడే చేద్దురు గానీ-" అన్నాడతను.

"థాంక్యూ సర్." అని ఆనందంగా వెళ్లిపోయాడు రత్నాకరరావు.

స్వాగత్ ఆలోచించాడు.

వీళ్లందరిముందు నవ్య ఏ విధంగా ప్రవర్తిస్తుందో అతనూహించాడు. అలా గనుక ప్రవర్తిస్తే - ఇక తనకి ఆఫీస్‌లో కాదుగదా - సొసైటీలో కూడా గౌరవం ఉండదు.

పోనీ ఆమెను ఈ ఒక్కసారికి కొంచెం వినువుగా - సంతోషంగా బతిమాలితే -

ఉహూ. రాయైనా కరుగుతుందేమోగానీ - ఆమె కరగదు. సరికదా. అందరి ముందు తనను అవమానించినా ఆశ్చర్యపోనక్కర్లేదు. తనను నడివీధిలో చెప్పుతీసుకుని కొట్టమంటే -ఆమె కళ్లల్లో ఎంత ఆనందం నాట్యం చేసింది.



అలాంటి పైశాచిక ఆనందంకోరే ఆమె తన స్టాఫ్ ముందు తనను మన్నిస్తుందన్న గ్యారంటీ ఏముంది?

తలపట్టుకున్నాడు స్వాగత్.

సమయానికి మీనాక్షి కూడా లేదు.

వాళ్లుంటే కాస్త నవ్యను కంట్రోల్ చేసి ఒప్పించే ప్రయత్నం చేసివుండేవారు. కనీసం వారి ఆనందంకోసమైనా తనతో చనువుగా ఉన్నట్లు నటించేది.

డిన్నర్ ఏదైనా హోటల్లో అరేంజ్‌చేసి - కేవలం పది నిముషాలు ఆమెని తీసుకొచ్చి పరిచయం చేసి - ఆమెకు తలనొప్పిగా వుందని పంపించివేస్తే-

ఆ పది నిముషాలకోసమైనా ఆమె ఒప్పుకోవాలి గదా.

అవమానించాలనుకుంటే ఒక్క నిమిషం చాలు.

చాలాసేపు ఆలోచించి - చివరికి ఓ నిర్ణయానికొచ్చి - ఫోనందుకుని డయల్ చేశాడతను.

"హలో...నవ్యేనా?"

"అవును."

"నవ్యా... ఓ చిన్న రిక్వెస్ట్...."

"డిమాండ్ చేసి సాధించుకునే మగాడివి కదా? రిక్వెస్టెందుకు?"

"అలా కాకుండా మామూలుగా మాట్లాడడం చేతకాదా నీకు?"

## లవ్ గేమ్

"అవన్నీ నీ కనవసరం...విషయంచెప్పు..."

"మరేం లేదు. మా ఆఫీస్‌స్టాఫంతా నిన్ను చూడాలని సరదాపడుతున్నారు. ఇప్పటికి రెండుసార్లు అడిగారు. అయినా ఏదో ఒక సాకుతో తప్పించాము. కానీ ఈ రోజు మళ్లీ అడిగారు. అంచేత...."

"ఊ... అంచేత?"

"ఒప్పుకున్నాను. అఫ్‌కోర్స్ నిన్నడగి ఒప్పుకుంటే బావుండేది. కానీ మన గొడవలు వాళ్లకు తెలీవు కదా. అందుకుని ఈరోజు మనింటికి డిన్నర్‌కి రమ్మన్నాను."

"సారీ. ఈరోజు నేను శ్రీమతికలిసి షాపింగ్‌కెళ్తున్నాం. నాకు కుదరదు."

"నవ్యా - ప్లీజ్ - పరిస్థితి అర్థం చేసుకో. శ్రీమతికి నేను చెప్తాను. రేపెళ్లండి షాపింగ్‌కి. ఈరోజు దయచేసి నా మాట విను."

"ఎందుకు? నీ పరువు ప్రతిష్టలకోసం - సొసైటీలో నీ గౌరవం - స్టేటస్- ఇమేజ్ కాపాడడంకోసం - నేను నీతో నటించాలి. అవునా?"

"నవ్యా."

"మరోసారి చెప్తున్నాను. నాకిలాంటి జాతర్లంటే ఇష్టంలేదు. సాయంత్రం నేను ఇంటిదగ్గరుండను. ఉండను - ఉండను."

"నవ్యా - ప్లీజ్... నేను చెప్పేది విను."

"నువ్వు చెప్పేది వినడానికి నేను నీ పెళ్లాన్ని కాదు. మైండిట్." ఫోన్ పెట్టేసిన శబ్దం.

కొన్ని క్షణాలు ఫోన్ వేపే చూస్తూ కూర్చున్నాడతను.

మళ్లీ డయల్ చేశాడు.

"హలో నవ్యా...ప్లీజ్ నేను చెప్పేది పూర్తిగా విను."

"అది తప్ప ఇంకేమయినా చెప్పు."

"ప్లీజ్.... ఒక్క నిముషం. మా స్టాఫ్‌కి అలా కనిపించి వెళ్లిపో - ఆ తర్వాత నేను వారికి ఎలాగో నచ్చచెప్పుకుంటాను ప్లీజ్."

"ఒక్క నిముషం కాదు గదా - ఒక్క సెకన్ కూడా నేను స్పేర్ చేయలేను. మరొక్క విషయం. ఫోన్ రిసీవర్ పక్కన పెట్టేస్తున్నాను. గుడ్‌బై..."

కసిగా విసిరి కొట్టాడు ఫోన్‌ని.

"షిట్!" తలపట్టుకున్నాడు.

కోపం - ఆవేశం - అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

సిగరెట్ వెలిగించాడు.

తీవ్రంగా ఆలోచించాడు.

తాను కనీసం రేవని చెప్పినా బావుం డేది.

మరో సిగరెట్ వెలిగించాడు.

ఆ తర్వాత మరోటి -

ఐదో సిగరెట్‌కు అతని మనసులో ఫ్లాష్ లాంటి ఆలోచనొచ్చింది.

వెంటనే ఫోన్లో శైలజని పిలిచాడు.

మరుక్షణం ఆమె అతని ముందు ప్రత్య క్షమైంది.

"చూడు మిస్ శైలజా."

ఈసారి బాస్ ఏ ప్రశ్న వేస్తారోనని భయపడుతూ నిల్చుందామె.

"ఆడవాళ్లు అలిగితే ఏం చేయాలి?"

రెండు గుటకలు మింగి, నవ్వాలని ప్రయ త్నిస్తూ.

"అది మగవాళ్లకే తెలుస్తుంది సర్." అంది.

" ఆ విషయం నాకు తెలుసు కానీ - ఆడవాళ్ల అలకను ఆడవాళ్లే గొప్పగా తీర్చగ లరని ఎక్కడో చదివాను."

"ఐసీ."

అసలలిగిందెవరో - అలక తీర్చేవారె వరో - అసలా విషయం తనతో ఎందుకు చెప్తున్నాడో - ఏమీ అర్థం కాలేదామెకు.

"అంచేత ఓ చిన్న సహాయం చేయాలి నువ్వు."

"చెప్పండి సర్."

"మా ఆవిడ అలిగింది. బైదిబై స్టాఫం దర్నీ ఈరోజు రాత్రికి డిన్నర్‌కి పిలుస్తున్నాను గదా?"

"అవును సర్."

"అందుకే. నీకు పర్మిషనిస్తున్నాను. దయచేసి నువ్వెళ్లి ఆమె అలకతీర్చి సాయం త్రానికి తనను 'సెట్‌రైట్' చెయ్యగలవా?"

కొన్ని క్షణాలు మాట్లాడలేదామె. ఆ తర్వాత తలెత్తి -

"కానీ సర్. మేడంతో నాకు పరిచయం లేదు కదా?" అంది.

"ఆడవాళ్లు - ఆడవాళ్లని పరిచయం చేసుకుని - క్షణాల్లో ప్రాణస్నేహితులైపో తారు." అన్నాడతను.

"ఎవరు చెప్పారు సర్?"

"ఇదీ ఎక్కడో చదివాను. అంచేత నువ్వు వెంటనే బయల్దేరి వెళ్లి ఆమె అలక తీర్చాలి!"

"ఇఫ్ యు డోంట్‌మైండ్ - ఆ పని మీరే ఎందుకు చేయకూడదూ?"

"చెయ్యొచ్చు గానీ నేను అర్జంట్ పనిమీద జీడిమెట్ల వెళ్లిరావాలి."

పెళ్లాం అలక తీర్చడానికి - జీడిమెట్లకీ సంబంధమేమిటోఅర్థం కాలేదామెకు.

"వాడ్డూయూసే-" అన్నాడతను.

"ష్యూర్ సర్. ఐ విల్ ట్రై మై లెవెల్ బెస్ట్..." అందామె.

"థాంక్యూ శైలజా. థాంక్యూ వెరీ మచ్. ఏమైనా చేసి ఆమె అలక తీర్చే బాధ్యత నీది. బైదిబై ఈ విషయం మన స్టాఫ్ ఎవరికీ తెలియనివ్వకు. నువ్వు నా శ్రేయోభిలాషివి గనుక నీకు చెప్తున్నాను."

ఆ మాట బాస్ ద్వారా విన్న ఆమె కళ్లు ఆనందంతో మిలమిల్లాడాయి.

"అలాగే సర్. ఎవరికీ చెప్పను. తప్ప కుండా మేడం అలక తీర్చి పార్టీ సక్సెస్ అయ్యేలా చూస్తాను."

"థాంక్యూ. ఆల్ ది బెస్ట్. వెళ్లిరా."

శైలజ వెళ్లిపోయింది.

హుషారుగా విజిల్ వేసుకుంటూ ఓ పదినిమిషాలు ఫైల్స్ చూసి ఆ తర్వాత 'బంజారా'కి ఫోన్ చేసి డిన్నర్ ఏర్పాట్లు చెప్పాడు. ఎంతయినా సాటి ఆడదాని ముందు తన భర్త దుర్మార్గుడని చెప్పలేదు ఏ ఆడదీ. పైగా శైలజ చాలా స్మార్ట్ లేడీ! ఇలాంటి విషయాలు చిటికెలో సెటిల్ చేయగలదని తన నమ్మకం.

ఆనందంతో సిగరెట్ వెలి గించుకో బోయే సమయంలో - అప్పుడు గుర్తొచ్చిం దతనికి ఆ విషయం.

అంతే నోట్లో సిగరెట్ జారి కింద పడింది. శిలాప్రతిమలా కూర్చుండిపోయాడు.

లీనా బ్యూటీ పార్లర్‌లో శైలజకీ - నవ్యకీ జరిగిన పోట్లాట విషయం. ఆమె శైలజ విషయంలో తనను అనుమానించిన విషయం!!

కంగారుతో చెమటలు పట్టాయతనికి. ఇప్పుడు శైలజని చూస్తే ఆమె అపరకాళి కయిపోతుంది.

మొత్తం రసాభాసయి తన పరువు ప్రతిష్ట - వగైరాలన్నీ వీధినపడతాయి.

హడావుడిగా శైలజ రూంకెళ్లి చూశాడు. శైలజ లేదు.

ఆఫీస్ బాయ్ నడిగాడు.

అతను చెప్పాడు.

"ఆమె వెళ్లి అరగంటయింది సార్!"

(ఇంకా వుంది)



## పెద్ద దోస కాయ

బొమ్మలో కనిపించేది సొరకాయ అనుకుంటున్నారేమో! సొరకాయ కాదు దోసకాయ అంటే నమ్ముతారా? నమ్మాల్సిందేమరి. మనం సహజంగా గుండ్రంగా వుండే దోసకాయల్ని చూస్తూ వుంటాం. కాని సొరకాయంత పరిమాణంలో యింత పొడవాటి దోసకాయను ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్‌లో వున్న బోవెన్ హిల్స్‌కు చెందిన శ్రీమతి ఈలీన్ చాపెల్ పెంచారు. దీని బరువు 22 కేజీలట. ఆ దోసకాయను ఆమె ఎంత సునాయాసంగా పట్టుకున్నదో చూడండి! మరి ఇంత పెద్ద దోసకాయను కాయించాలంటే ఆమె ఏం 'ఎరువు'లు వేశారో కనుక్కోవలసిందే!

# టానా- ఆంధ్రసచిత్రవారపత్రికల సంయుక్త

## సాహితీసంబరం పోటీలో బహుమతి పొందిన కథ




"హలో"

"హలో విజయ్... నేన్రా చక్రిని"

"ఒరేయ్ చక్రీ! ఏంట్రా కొత్త పెళ్ళి కొడకా? ఏంటి విశేషాలు చెప్పు"

"పెళ్ళయిపోయిన అవశేషాన్ని. నా దగ్గరేముంటాయిరా విశేషాలు. నువ్వే చెప్పు. అన్నట్టు ఎగ్జిబిషన్‌కి వెళ్ళావు కదా! ఏమయింది?"

"ఎగ్జిబిషనా? అదేంటి?"

"అదే లేవోయ్ పెళ్ళి చూపులు. ఏం జరిగింది? సక్సెసేనా?"

"ఏదో బాగానే జరిగిందిరా! అమ్మాయ్ పేరు శ్వేతట. పేరుకి తగ్గట్టుగానే తెల్లగా ఉంది"

"ఇంతకూ ఖాయం చేసుకున్నట్టేనా?"

"హలో! హలో! శ్యామలా?..

"మేడమ్! మీరొకసారి ఫోన్ పెట్టేయాలి. నేను మా ఫ్రెండ్‌తో చాలా ముఖ్యమైన విషయం మాట్లాడుతున్నాను. మధ్యలో మీ క్రాస్ టాక్ వస్తోంది. కాస్సేపు ఫోన్ పెట్టేయ్యండి."

"ఆ చెప్పరా చక్రీ! మధ్యలో ఏదో డిస్టర్బెన్సొచ్చిందిలే."

"ఆ ఎక్కడాగిపోయాం? అదే సంబంధం ఖాయం చేసుకున్నావా?"

"అవున్రా! నలభై వేలకి కుదిరింది. నాకు అంత సంతృప్తిగా లేకపోయినా-ఏదో అమ్మాయి బాగుంది కదా అని ఒప్పేసుకున్నాను"

"వ్వాట్! నలభై వేలేనా? పరువు తీసేసావు కదా బ్రదర్! మన ఫ్రెండ్స్ సర్కిల్‌లో అందరిలోకీ నువ్వే చవకగా వెళిపోతున్నావన్నమాట. వెధవది ప్రైవేట్ కంపెనీలో గుమస్తాని నేను ఏభై వేలు పలికాను కదరా! అలాంటిది బంగారంలాంటి బ్యాంకు ఉద్యోగం చేస్తూ కూడా నువ్వింత తక్కువకి ఎలా ఒప్పుకున్నావ్‌రా!"

"హలో! శ్యామలా! హలో. హలో...."

"అబ్బబ్బ....ఏంటండీ మీ గోల మధ్యలో మీరు మీ శ్యామలకి తర్వాత ఫోన్ చేసుకుందురుగాని ముందుకాస్త ఫోన్ పెట్టేయండీ బాబూ! అవతల నా ఫ్రెండ్ చక్రితో ఎస్.టి.డీ మాట్లాడుతున్నాను."

• • •

"ఆ చెప్పరా చక్రీ! ఏమిటీ? అంత చీప్‌గా ఎలా అమ్ముడుపోయానంటావా? నేనన్నీ బాగా ఆలోచించాన్రా నాయనా! మా కాబోయే మామగారు రెవిన్యూ డిపార్ట్‌మెంట్లో గెజిటెడ్ ఆఫీసర్‌రా!ఈ నలభై వేలు పైకి కనిపించేవే! ఇక పెళ్ళయ్యాక యాడాదికో ఇరవై వేలు చొప్పున అయన రిటైరయ్యేలోగా ఒక రెండు లక్షల దాకా ఏదో ఒక రూపంలో క్లెయిమ్ చెయ్యగలను. ఆ

---

"యూ షటప్" మినీకథా రచయితలు శ్రీ శాయి, శ్రీ కుమార్ అనబడే సోమయాజుల సోదరులు ఐదుగురు అన్నదమ్ములలో ఆఖరివారు. వీరు పెరిగిందీ, చదివిందీ విజయనగరంలో. ప్రస్తుతం హైదరాబాద్‌లో ఉంటున్నారు. ఒకరికి ఆంధ్రా బ్యాంకులో స్టైనోగా ఉద్యోగం. ఇంకొకరు బి. కాం. పాసయి ఉద్యోగాన్వేషణలో ఉన్నారు. వీరు తమను గురించి చెబుతూ "ఇప్పటివరకూ వివిధ పత్రికలలో 58 కథలు ప్రచురింపబడ్డాయి. కార్టూన్, కవిత, నాటక ప్రక్రియలలో కూడా ప్రవేశించాం. సందేశమివ్వలేకపోయినా, పాఠకులకు సంతృప్తినిచ్చే కథలు అందించాలని మా ఆశయం. బహుమతినిచ్చి ప్రోత్సహించినందుకు ఆంధ్ర సచిత్రవారపత్రిక - టానాలకు సంయుక్తంగా మా కృతజ్ఞతలు" అంటున్నారు.

నమ్మకం నాకుంది"

"మై గుడ్‌నెస్! అయితే తెలివైన వాడివేరోయ్!"

"మరి! ఏమనుకున్నావ్! అన్నట్టు మా మావగారికి ఆ అమ్మాయి ఒక్కర్తే కూతురు. కనుక ఆయన తదనంతరం ఆస్తంతా నాదే! ఏమంటావ్?"

"ఏమంటాను! నీ బుర్ర పాదరసం అంటాను. మరి పార్టీ ఎప్పుడిస్తున్నావ్?"

"ఇస్తాలేరా...."

"హలో....హలో...శ్యామలా..

"చూడండి మేడమ్. మీరొక ఫైవ్ మినిట్స్ ఆగి మీ ఫ్రెండ్ నెంబర్ ట్రై చెయ్యండి. ఇవతల మా కాల్ డిస్టర్బ్ అవుతోంది."

"సారీ సర్! ఇప్పుడు నేను చెప్పబోయే విషయం వింటే మీ మనసే డిస్టర్బ్ అవుతుంది. క్రాస్ టాక్ పుణ్యమా అని మీరు మీ ఫ్రెండ్ చక్రితో మాట్లాడిన మాటలన్నీ నేను విన్నాను. మీకిలాంటి ఉద్దేశ్యాలున్నాయని తెలీదు. ఫోన్ కనుక సరిపోయింది. ఇదే మీ పక్కన ఉండి ఉంటే, నా ఎడంకాలి చెప్పు తీసి కొట్టేదాన్ని. థాంక్ గాడ్! టెలిఫోన్ చాలా మేలు చేసింది."

"హలో! హలో! మేడమ్! ఎవరండీ మీరు?"

"హలో శ్యామలా! నువ్వేనా! అమ్మయ్య! ఎంత సేపు ట్రై చేస్తే నీ నెంబర్ దొరికి చావలేదు. నేను శ్వేతని. ఆ ఏం లేదులే చిన్న క్రాస్ టాక్ కలిసింది. ఏమిటే! మొన్న పెళ్ళి చూపుల సంగతా! వాడు నాకేం నచ్చలేదు! వట్టి డబ్బు పిచ్చోడు. హి ఈజ్ టూ గ్రీడీ. హి ఈజ్ మ్యాడ్ ఫర్ మనీ....ఐ హేట్ దట్ ఫెలో..."

"హలోవ్-మాడమ్....ఎవరి గురించి మీరు..."

యూ...షటప్! ●

# బహుమతి పొందిన కవిత

## కలల కౌగిళ్ళు

కనురెప్పల లోగిళ్లలో ఊగే
ఆశల ఊయలలు కలలు!
రాత్రి చిక్కబడి చీకటి నల్లటి వెల్వెట్ తెరలుదించినప్పుడు
సుషుప్తి ఒడిలోకి పూలచెండులా,
కలల కౌగిళ్లలోకి పలిమలిస్తూ...
బరువెక్కిన కళ్లకు నిద్ర అంజనాన్ని రాస్తూ
అందాల అలు చిప్పలుగా రెప్పల్ను ముడిచేస్తుంది.
వీచే కష్టాల వడగాడ్పుల్లో, బతుకు ఎడారిలో
తడబడే అడుగులతో కాస్తంత సుఖమిచ్చే
ఒయాసిస్‌ల కోసం వెతికి వెతికి వేసారి
సొమ్మసిల్లిన శరీరం మెత్తటినిద్రలోకి జారి జారి...
అమ్మ ఓదార్పులా సేదదీరుస్తూ ఎన్నెన్నో కలలు.
రంగు రంగుల్లో కొన్ని సాదాసీదాగా కొన్ని కొన్ని.
ఇంద్ర ధనుస్సులు చేతికి అంది పతంగాలుగా
ఎగరెసే స్వప్నాలు
గడుసు దెయ్యాలై భయపెడుతూ
పాతాళానికి నెట్టేసే కలలు.
తీయ తీయటి బాల్యాన్ని ఆ హోయి హోయి దృశ్యాల్ని
ఆడిన ఆటల్ను, పాడిన పాటల్ను
మదిలో అద్దుకొన్న స్నేహాన్ని తీపిగా చూపి
అదృశ్యంలో ఉన్నామనే అనుభూతినిస్తూ.
ప్రేమపంచి ఇచ్చి గుండెల్లో గుడికట్టుకొన్న
నెచ్చలి చిరునవ్వుల మ తాబులు వెలిగిస్తూ ఓముద్దిచ్చిపోతూనే
వుంటుంది ఓనిమిషమో, అరనిమిషమో.
కలల్లో రాజాధి రాజులం, వీరాధి వీరులం!
కంటికి కలలే లేకపోతే
బతుకు బండిక చతికిలబడిపోదూ!
కలలున్న బతుకు కోటి ఆశలు రేపు!

- కొడిమెల శ్రీరామమూర్తి



"కలల కౌగిళ్ళు" కవితా రచయిత శ్రీ కొడిమెల శ్రీరామమూర్తి తన గురించి పరిచయం చేసుకుంటూ_

"స్వాతంత్ర్య సమరయోధులు, తామ్రపత్ర గ్రహీత కొడిమెల శ్రీకృష్ణమూర్తిగారు మా తండ్రిగారు. "రంజని" అవార్డు, "సాంస్కృతి సమాఖ్య" అవార్డు, "కళా స్రవంతి" అవార్డు "పతివాడ సుధాకర్" అవార్డు వంటి అనేక పురస్కారాలు లభించిన వీరికి 'టానా' ఆంధ్ర సచిత్ర వారపత్రిక నిర్వహించిన కవితల పోటీలో బహుమతి రావడం తన అదృష్టంగా భావిస్తున్నారట. వారపత్రిక సంపాదకులకూ, "టానా" వారికీ తమ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నారు.

# విశ్వసందర్శనం

**– వి. లక్ష్మణరావు**



చిన్న కొండ మీద అందంగా అగుపించే వేంకటేశ్వరుని దేవాలయం, దగ్గర్లోనే మరో కొండమీద చర్చి, త్రికోణాకారాన్ని పూర్తిచేస్తూ మరో చిన్నకొండపై మసీదు. సముద్రంపైనుంచి వీస్తున్న చల్లనిగాలి. గాలిమోసు కొస్తున్న ఘంటసాలగానం చేసిన భగవద్గీత.

ప్రతి ఆదివారం దేవాలయంలో దైవదర్శనం చేసుకుని కోవెల ముంగిటమెట్లపై సుమారు గంటైనా కూర్చోవడం, సంగీత మధురిమలను అనుభవించటం శరత్‌కు అలవాటయిపోయింది. అలా కూర్చోవడం వలన కలిగే సుఖానుభూతి అనిర్వచనీయం. "శ్రీదేవి వంకకు చిలిపిగా చూడకు, అలమేలుమంగకు అలుకరానీయకు..." ఘంటసాల గానం చెవికి శ్రావ్యంగా వినిపిస్తోంది. శరత్ తలపులో రమ నిలిచింది. ఆమె మధురగాయని. తొలిసారిగా ఆమె గొంతు విని ఆమెను ప్రేమించాడు. ఆమె ఎక్కడ కచేరి ఇచ్చినా ఖర్చుకు వెనుకాడకుండా బ్యాంకుకు సెలవుచీటీ ఇచ్చి వెళ్లి మనసుతీరా ఆమె గానాన్ని వినేవాడు. క్లాసికల్, లైట్ క్లాసికల్, హిందుస్థానీ అన్ని బాణీలలో ఆమె పాడేది. ఏ బాణీలో పాడినా ఆమె కంఠం ఆ బాణీకే కొత్త అందాల్ని ఆసక్తిని అందించేది. శరత్ పరవశించిపోయేవాడు. ఎటువంటి ప్రేయసిని గురించి కలలు కన్నాడో అటువంటి ప్రేయసిని రమలో ప్రత్యక్షంగా చూసేడు. బ్యాంకులో ఉద్యోగం, బ్యాంకు నుంచి వచ్చిన తర్వాత రమను గురించి కలలు కనడం. కలలు ఫలించి జీవితం ఆనందదాయక మవుతుందన్నరోజు, శరత్ రమ ఇంటికి వెళ్లి తన మనసులో మాట బయటపెట్టాలనుకున్నరోజు, రమ ఇంటి తలుపు తట్టిన రోజు.

"రండి ! సంగీత మంటే ఇష్టపడేవాళ్లను చాలామందిని చూసేను, కాని మీలా పరవశించిపోయేవారు అరుదుగా ఎదురవుతారు. కూర్చోండి" సోఫాను చూపిస్తూ అంది రమ. మధ్యతరగతి ఇల్లు, నిరాడంబరంగా ఉన్న ఇల్లు.

"అమ్మతో కాఫీ తెమ్మని చెప్పివస్తాను. వన్‌మినిట్" అని లోనికి వెళ్లింది రమ.

## బహుమతి పొందిన కథ

"విశ్వ సందర్శనం" మినీ కథా రచయిత శ్రీ వి. లక్ష్మణరావు జననం 1940, జన్మస్థలం పార్వతీపురం. తనను తాను పరిచయం చేసుకుంటూ -

"మమతానురాగాలను, దైవభక్తిని, కలుగజేసింది నా తల్లి. చదువంటే, సాహిత్యమంటే శ్రద్ధాసక్తులను కలుగజేసినది మా అన్నయ్య డా. వి. వి. బి. రామారావు.

గత పాతికేళ్లుగా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అర్థికశాస్త్ర బోధన, ఆ శాస్త్రంలో పరిశోధన కొనసాగించటం నా వృత్తి బాధ్యతలు. 1985 లో అర్థికశాస్త్ర ఆచార్య పదవి లభించినది. నా వంకర టింకర అక్షరాల చిత్తు ప్రతులకు మేలు ప్రతులు వ్రాస్తున్న నా భార్య చుక్కమ్మ, మా అమ్మాయి వరలక్ష్మి నా సాహితీ వ్యాసంగంలో భాగస్థులు.

అర్థశాస్త్రంలో ఇప్పటివరకు ప్రచురించినవి ఆరు పుస్తకాలు, నూరుకంటే ఎక్కువగా పరిశోధనా వ్యాసాలు. ఆంధ్ర పత్రిక, ఇతర వార మాస పత్రికలలో కొన్ని కథలు, కవితలు ప్రచురింపబడ్డాయి. అర్థిక శాస్త్ర అధ్యయనానికి ఆ శాస్త్రంలో పరిశోధనకు ప్రేరణ, ప్రోత్సాహాల నిచ్చినది ఆచార్య భావరాజు సర్వేశ్వరరావుగారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి అర్థిక శాస్త్రంలో ఎం.ఏ.పి.హెచ్.డి. పట్టాల నందుకున్నాను. వాండర్ బిల్ట్ యూనివర్సిటీ (యు.ఎస్.ఎ.) నుంచి కూడా అర్థిక శాస్త్రంలో ఎం.ఏ. పట్టా పొందాను.



వ్రాయడం కంటే చదవడమంటే ఇష్టం. చదవడం కంటే విజ్ఞులు, రసజ్ఞులు చెప్పింది వినడం యిష్టం" అంటున్నారు.

## బహుమతి పొందిన కవిత

### కేవలం వాననీళ్ళే!

వర్షం నిలిచిపోయింది,
వెల్లువను మాత్రం వుంచి,
దార్లు యేర్లయ్యాయన్నట్టు
నీరు ప్రవహిస్తోంది.
గాలిలో, నేలలో,
దుమ్మునూ, ధూళినీ
వెంటేసుకొని నీటి
వరద వెళ్లిపోతోంది.
నెలల తరబడి పేరుకున్న
చెత్తనూ, కుళ్లునూ యీ
నీళ్లు మోసేస్తోంది పూరవతలికి!
దుర్మార్గుల చేతలను దయతో
భరించే మహోత్మునిలా,
పాపాలను ప్రక్షాళనం చేసే
భాగీరథిలా,
అమృత సాధన కోసం గరళాన్ని మింగిన
ఆది శంకరుడిలా,
కంపునూ, కశ్మలాన్నీ మోస్తూ
గల గలా ప్రవహిస్తోంది,
బీడు వారిన భూములను
సస్యశ్యామలం చేయడానికి!
ఈ నీళ్లు వట్టి వాననీళ్లే
కొందరి దృష్టికి !
బురద నీళ్లు కూడానేమో!
మాలిన్యాన్ని తొలగిస్తూ
మౌనంగా ప్రవహించే యీ నీళ్లు
నాకు మాత్రం
మానవ హృదయాల
కాలుష్యాన్ని కడిగే
ఓ 'క్రీస్తు'లా-
ఓ 'మహమ్మదు ప్రవక్త'లా-
ఓ 'గాంధీ మహోత్ముని'లా
కనిపిస్తోంది! ఇది నిజం!

ఆర్.వి. చలపతి

శ్రీ ఆర్. వి. చలపతి "కేవలం వాన నీళ్లే" కవితా రచయిత స్వస్థలం చిత్తూరు. ప్రస్తుత నివాసం తిరుత్తణిలో గతంలో ఒకసారి ఆంధ్ర సచిత్ర వార పత్రికలో వీరి గేయాలు ప్రచురిత మయ్యాయి. తమ గురించి చెప్పుకుంటూ—

"పద్య రచన పట్ల వుత్సాహంతో వున్న ఆ సమయంలో నా రచనలు చదివి, సరిదిద్ది నడిపించిన వారు మా కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ గాడెపల్లి కుక్కుటేశ్వరరావు. తరువాత తరువాత కథా రచన వైపు మొగ్గుచూపడంతో పద్యరచన వెనుకబడింది.



సాహిత్యంతో పాటు సమానంగా సంగీతంలో నూ ఆసక్తి వుంది. చిత్తూరు నైటింగేల్ ఆర్కెస్ట్రాలో ముఖ్య సభ్యుడిగా అనేక కార్యక్రమాలు నిర్వహించాను.

---

జడవేసుకుందామనుకుంటుండగా తలుపు తట్టాడేమో ! దట్టమైన నీలికురులు ఆమెలో స్త్రీత్వాన్ని పెంపుచేసేయి. ఆ కదిలికలను చూసిన శరత్ మనసులో పోయిభావం నిండింది. ఇంతవరకూ ఏ అమ్మాయి ఆ భావాన్ని కలిగించలేకపోయింది శరత్‌లో.

"అమ్మాయి నీ గురించి చెప్తూంటుంది బాబూ! వాద్యాల మ్రోతలకు తలలూచి అదే సంగీతమనుకుని మురిసిపోయేవాళ్లు ఎక్కువైపోతున్న ఈ రోజుల్లో సంగీతాన్ని మెచ్చుకునే నీ లాంటి వాళ్లు అరుదుగా ఉంటారు..."

రమగాన మాధుర్యాన్ని తలపులలో నింపుకుని ఆనందిస్తున్న శరత్‌కు రమతల్లి మాటలు చెవిన పడడంలేదు.

"నేను ఒకటి అడగాలని వచ్చేనండి..."

"చెప్పుబాబూ! ఏమిటి?"

"మీ అమ్మాయిని నేను వివాహం..." మాట పూర్తిచేయకుండానే ఆగిపోయేడు శరత్.

రమతల్లి ముఖంలో ఆశ్చర్యం, ఆందోళన, జాలి, ఎన్నో భావాలు కదిలాయి.

"మా అమ్మాయికి మేనరికం ఉంది బాబూ, వచ్చే శ్రావణమాసంలోనే పెళ్లి..."

గతంలోంచి ప్రస్తుతంలోకి వచ్చేడు శరత్. చెమ్మగిల్లిన కనులను తుడుచుకుని లేచేడు. బాలమురళీ గానం వినిపిస్తోంది. అతికష్టంమీద ముందుకు కదిలేడు శరత్.

"ఒరే శరత్! ఆ తండ్రికి సాహిత్యమంటే మక్కువ, నీకు సంగీతమంటే విపరీతమైన ఇష్టం. మధ్యలో నా మాటకు గౌరవంలేకుండా పోతుందిరా !నీకు పెళ్లైతే. .. "

"అమ్మా ! ప్లీజ్, జేసుదాస్ అష్టపది, విననీ అమ్మా!", టేపురికార్డర్ అందిస్తూన్న సంగీతాన్ని కనులుమూసుకుని పరవశిస్తూ వింటున్న శరత్ తల్లిని వారిస్తూ అన్నాడు.

తెల్లవారురుఝామున అయిదుగంటలకు లేవడం శరత్‌కి అలవాటు. శరత్ లేచి పెరట్లోకి వచ్చేడు. శ్రావ్యమైన గొంతులో త్యాగరాయకృతి వింటూ చేతిలో బ్రష్‌తో అలానే నిల్చుండిపోయేడు.

"నిన్ననే దిగేరురా పక్కింట్లో. పెళ్లికావల్సిన అమ్మాయి-ఎంత మధురంగా పాడుతోందో విను" అని చెప్పి, పనుల్లో పడిపోయింది శరత్ తల్లి.

విరిగిపోయిన కలలు తిరిగి రూపుదిద్దుకోనారంభించేయి. శరత్ అంతరంగంలో వారంరోజులు గడిచిపోయేయి. ప్రొద్దున్నలేచి ఆ అమ్మాయి గానం వినడం దినచర్య అయిపోయింది శరత్‌కు. అతన్ని గమనిస్తున్న తల్లి ముభావంగా ఉండిపోయింది.

ఒకరోజు పెరట్లోకి వచ్చిన ఆమెను చూసేడు. మధురమైన గొంతుతో పోటీపడే సౌందర్యం ఆమెది.

"అమ్మా ! మన పక్కింటి అమ్మాయి..."

"ఇద్దరికీ ఈడూజోడూ, వాళ్లూ సుముఖంగానే ఉన్నారు. కాని ఆమె..."

"ఏవిటమ్మా! ఆమెకు..."

"ఆమె అంధురాలు బాబూ ! "

కొన్నిక్షణాలపాటు నిశ్శబ్దం రాజ్యమేలింది.

"అమ్మా ! గొంతు మధురిమన్ని ఆనందించేందుకు నాకు చెవులున్నాయి. ఇద్దరం భార్యభర్తలుగా ఒకటైన తర్వాత ఈ రెండు కళ్లు ఇద్దరివీ అవుతాయికదా. ఆమెతో నా వివాహానికి ఏర్పాట్లు చెయ్యమ్మా!" శరత్ గొంతులో దృఢనిశ్చయం ధ్వనించింది. ●

# యువతా! కవితా!

## "నాందీ వాచకం"

ఆపలేరు కాలాన్ని
డబ్బుతో ను, పదవితోను
ఆపలేరు సృష్టి గమనాన్ని
ఏ శక్తితో ను, ఏ యుక్తితో ను!

ఆపగలరు– విశృంఖల
అవినీతిని– నీతితో
ఆపగలరు– విచ్ఛిన్న
విలయాన్ని– ప్రేమతో
ఓర్పు నశించిన నాడు
వస్తుంది విప్లవం
సహనం పెరిగిన నాడు
పెరుగుతుంది సఖ్యత!

ప్రేమాభిమానాలు
విలయానికి స్వస్తి చెపుతాయి
మమతాను రాగాలు
సమ సమాజానికి
నాందీవాచకాలవుతాయి!

శ్రీ జగన్
(కొ. జగ్గారావు)

## అక్షయమైన ప్రకృతి

ఎన్ని మొగ్గలు-
విచ్చుకోకుండానే రాలిపోతున్నాయో,
ఎన్నిపువ్వులు-
నిష్కల్మషమైన తమ నవ్వుకు
నిఖార్సైన మూల్యంపొందకనే కాలంచెల్లిపో
తున్నాయో!
ఎన్నిమ్రానులు-
నిష్ఫలంగా కూలిపోతున్నాయో!
ఏమైతేనేం-
అక్షయమైన ప్రకృతి
నిక్షేపంగా సాగిపోతూనే వుంది.
నిండుదనం కోల్పోడంలేదు.
ఎప్పుడో ఒకప్పుడు పోయేవాళ్లకే
ఏదోకోల్పోయిన భావం పీడించుతుంది.
తమను తాము కోల్పోయేదాకా వెంబడిం
చుతుంది.

మహబూబ్ కమల్

## మాన్యము

ఎరువెక్కిన ఆకాశం
రవి మార్గం చూచునురా!
బరువెక్కిన జీవితాన
దరి జేరును సౌఖ్యమురా!

తలవంచిన-తెరదించిన
వెనుచీకటి కంబళిరా!
తల ఎత్తిన-తెర తెంచిన
చిరుదీపం కనబడురా!

దయ నిండిన మది వెలుగును
భయముండిన శూన్యమురా!
సంయమనానికి సమయానికి
సంధానము మాన్యమురా!

-కాణిపాకం లింగన్న



## స్త్రీ నైజం

ఆరేళ్ళ లేబ్రాయంలో – అమ్మానాన్నలంటే
అభిమానం
పదహారేళ్ల యౌవనంలో – కుర్రాళ్లంటే
ప్రియం
పెళ్లయ్యాక– మొగుడంటే ముద్దు
అటుతర్వాత– పిల్లలంటే ముచ్చట
అరవైయేళ్ల ముసలితనంలో – దేవుడంటే
భక్తి
ఈ స్త్రీ నైజం– అర్థంగాని విచిత్ర వైనం!!

–శేషు కొత్తపల్లి

## వజ్రోదయం

నిజాయితీ నీకుంటే–
వెలుతురు మొక్కల్లాంటి
పిల్లల బాల్యాన్ని
కాలరాస్తున్న ఉక్కుపాదాల్ని
ముక్కలు ముక్కలుగా నరికించు!

నిజాయితీ నీకుంటే–
వక్రవాదాల మాదక ద్రవ్యాల్తో
అనారోగ్యాన్ని పెంచుకుంటూ
యవ్వనాన్ని కొంటూన్న
క్రూరుల్ని సంహరించు!

నిజాయితీ నీకుంటే–
శతాబ్దాల మత్తుమందు
విరిగేలా
నూతన జాగృతికి
వైతాళిక గీతాన్నాలపించు!

నిజాయిత నీకుంటే–
స్వప్నాల సెలయేళ్ళను ప్రేమించే
నీ జనుల కళ్ళల్లో
మెరుపుల్ని సృష్టించే
చైతన్య పుష్పాలు పూయించు!

నిజాయితీ నీకుంటే
జిగేల్మనిపించే
వజ్రభానుడిలా వచ్చి
నిరాశని చిప్పంటించు!

అప్పుడే
చీకటికి శిరశ్ఛేదం
వెన్నెలకి వజ్రోదయం

– పురాణపండ శ్రీనివాస్

## రాజకీయ నాయకులు

పదవి కోసం
పడతారు కాళ్ళైనా
ఓట్ల కోసం
తింటారు తిట్లైనా
పదవి దొరికిన తర్వాత
కనిపించరు కంటికి
వినిపించరు మాటకి!

– కర్రి రామకృష్ణారెడ్డి

# కొత్త మలుపు

కంచుమర్తి వెంకటేశ్వరరావు

**ఈ ఒక్క రోజు. తను ఎంత పని చేసినా ఎవరితో నైనా నవ్వుతూ మాట్లాడాలన్నా, తన క్రింద వాళ్ళను మందలించాలన్నా, వారి గౌరవం పొందాలన్నా ఈ ఒక్క రోజే... రేపటి మలుపు తనలో ఎటువంటి అనుభూతి కలిగిస్తుందనేదే ఆలోచన.**

ఒక క్రమ బద్ధమైన జీవితంకు అలవాటుపడిన ఈ శరీరం క్రొత్త అలవాట్లకు ఎడ్జెస్టవడానికి ఎన్ని రోజులకు సహకరిస్తుందో?

రేపటి మలుపును ముందుగానే తెలుసుకున్న తన కొలీగ్స్ పాత, క్రొత్త తేడా లేకుండా తమ అభిమానాన్ని, గౌరవాన్ని చూపిస్తున్నారు అందరిలోనూ కొంత దిగులు కనిపించక పోలేదు అయితే తన చిరునవ్వుకు సమాధానంగా వాళ్ళూ నవ్వుతున్నారు

ఇరవయ్యేళ్ళ వయసులోనే తను ఉద్యోగంలో చేరాడు అదే సంవత్సరం తన జీవితంలోకి అందంగా అడుగు పెట్టింది సుమిత్ర ఆమె అడుగు పెట్టిన వేళా విశేషమేమోగాని ఒక్కొక్క మెట్టు ఎదుగుతూ వచ్చాడు తను ప్రతి మెట్టు ఎక్కడంలో సుమిత్ర ప్రోత్సాహం ఉంది తను ఎప్పుడైనా సమస్యలతో సతమతమవుతుంటే చక్కని పరిష్కారాలు చెప్పేది అలాగని ఆమె ఎక్కువగా చదవ లేదు పల్లెటూరులో ఐదో తరగతి మాత్రమే చదివింది కానీ లోకాన్ని చదవటంలో ఫస్టుక్లాస్ అందుకే తల్లిగా ఇద్దరు కొడుకులను, ఇద్దరమ్మాయిలను ఉత్తములుగా తీర్చిదిద్ద గలిగింది

ఒక అబ్బాయికి ఉద్యోగం వచ్చింది పెద్దమ్మాయి పెళ్ళయింది ఇక రెండు బాధ్యతలు చిన్న వాళ్ళ ఉద్యోగం, పెళ్ళిళ్ళు చేయాలి రెండోవాడు ఎమ్మెస్సీ పాసయి సంవత్సర మైంది అమ్మాయి పెళ్ళి కెదిగింది వచ్చే సంవత్సరం ఎలాగైనా పెళ్ళి చేసెయ్యాలి

ఇన్ని సంవత్సరాల సర్వీసులో తను నీతిగా బ్రతికేడు అవకాశమున్నా అవినీతి చాయలకు వెళ్ళలేదు భగవంతుడు తనకు, తన పిల్లలకు సరిపడినంత ఇచ్చాడని తృప్తి పడుతుంటాడు

ఇంతవరకు ఏ బాధలూ లేకుండా గుట్టుగా నెట్టుకొస్తున్నాడు రేపటి నుండి ఎలా?

"నమస్కారం గురువుగారూ! ఐదయి పోయింది ఇక కుర్చీలోంచి లేవరా?

ఆలోచనలోంచి తేరుకున్నాడు మాధవరావు

"రేపటి నుండి మీరెలాగూ కూర్చో నివ్వరు కదా! అందుకే గడిచిన రోజులను నెమరు వేసుకుంటున్నాను."

మాధవరావు బయటకు వచ్చాడు

మాధవరావు ఇంటికి వచ్చేసరికి పెద్దమ్మాయి, అల్లుడు, పెద్దబ్బాయి వచ్చి ఉన్నారు వీళ్ళంతా ఎందు కొచ్చినట్లు? తను రిటైరవుతున్నట్లు వీళ్ళకు ముందే తెలుసో అయినా తను ఎప్పుడూ ఆ ప్రస్తావనే తీసుకు రాలేదు రేపటివరకు చెప్పకూడదనే మాధవరావు ఆలోచన

ఆ రాత్రి భోజనాలయింతర్వాత అందరూ వరండాలో కూర్చున్నారు అందరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు

మాధవరావు గదిలోకి వెళ్ళి చిన్న డైరీ పట్టుకుని వచ్చాడు

"ఏమిటి విశేషం మూర్తీ అందరూ కట్ట కట్టుకుని వచ్చారు"

ముందు పెద్దబ్బాయిని అడిగాడు

"ఏంలేదు నాన్నగారూ! ఓ నాల్రోజులు అందరం కలిసి మీ దగ్గర సరదాగా గడుపుదామని వచ్చాం

అదే మాట అంది పెద్ద కూతురు ప్రమీల

రేపటి సంఘటనకు ఉపోద్ఘాతంగా చిన్న వివరణ ఇవ్వదలచు కున్నాడు మాధవరావు

"మూర్తీ పెద్దవాడివి కాబట్టి నా తర్వాత ఈ కుటుంబ బాధ్యతలను చూడవలసిన వాడివి కనుక కొంత వివరంగా చెప్పదలచు కున్నాను ఇరవయ్యేళ్ళ వయసులో ఉద్యోగస్తుడిగా చేరి ఇంతవరకు నా విధులను అటు బయట, ఇటు ఇంట్లో సక్రమంగా నిర్వహించ గలిగేనని నా వరకు 'నేను తృప్తి పడుతున్నాను ఒకవేళ మీలో ఎవరైనా అసంతృప్తి



ఫీలయితే చెప్పండి.

నా శక్తి కొలది మిమ్మల్ని చదివించాను. నువ్వు ఉద్యోగస్తుడి వయ్యావు. ప్రమీల పెళ్ళి చేసాను ఇక రెండు బాధ్యతలు రాజా ఉద్యోగం.... కీర్తి పెళ్ళి. . ప్రమీల పెళ్ళికి కొంత పి ఎఫ్ లోను తీసుకున్నాను. మిగిలిన ఆ డబ్బుతో కీర్తి పెళ్ళి, రాజా ఉద్యోగం. . బ్యాంకులో కొంత డబ్బుంది ఉద్యోగస్తుడిగా పొలాలు కొనకపోయినా నలుగురికి సమానంగా నా బాధ్యతలను నిర్వహించాను. బ్యాంకు డబ్బు, పి ఎఫ్ ఎమౌంటు, ఎల్ ఐ. సి పాలసీ డబ్బు రేపు సాయంత్రంలోగా మీకు ఇస్తాను నలుగురూ నన్ను తృప్తి పరుస్తారని ఆశిస్తున్నాను "

అని ఆగేడు మాధవరావు

ఈ అప్పగింతలు ఎందుకో ఎవరికీ అర్థం కాలేదు .. ఒక్క మూర్తికి తప్ప.

# క్రొత్త మలుపు

అందరూ విచారంగా ఉండడం కనిపెట్టిన మూర్తి టాపిక్ మార్చి, "నాన్నగారూ... పదయింది మీరు పడుకోండి... అమ్మా! నాన్నగారికి పాలు కలిపి ఇవ్వు" అన్నాడు.

సుమిత్ర అక్కడ నుండి లేచింది.

పాలు త్రాగింతర్వాత బెడ్ రూంలోకి వెళ్ళాడు మాధవరావు

"రేపు తను రిటైరవుతా"నని చెప్పితే ఇంట్లో ఎటువంటి విషాదఛాయలు అలుముకుంటాయో. . అదే ఆలోచన

ఆ రాత్రి సరిగ్గానిద్ర పట్టలేదు మాధవరావుకు

* * * * * * *

## ప్రచారం కోసం అనిల్ పాట్లు

చిత్ర సీమలో నటీనటులు తమకు పేరు ప్రతిష్టలు రావాలని పబ్లిసిటీ కోసం లక్షలు లక్షలు ఖర్చుపెడుతుంటారు. అనిల్ కపూర్, అతని సోదరుడు బోనీలు ఆ కోవలోకే వస్తారట. పత్రికల్లో ప్రచారం నిమిత్తం వీరిద్దరూ ప్రతినెలా 5 లక్షల రూపాయలు తమ బడ్జెట్ లో కేటాయిస్తారు. ఈ మొత్తాన్ని పార్టీలకు, వచ్చిన వారికి బహుమతులు పంచేందుకు వినియోగిస్తుంటారు. అప్పుడప్పుడు నగదు రూపేణా కూడా ముట్ట చెప్తుంటారట. ఒక సినిమా పక్షపత్రికకు, బొంబాయి, ఢిల్లీల నుంచి సాయంత్రం పూట వెలువడే సినిమా పత్రికల్లో యింటర్వ్యూలు వ్రాసే ఫ్రీలాన్స్ జర్నలిస్టుకు భారీ మొత్తంలో డబ్బు ముడుతుంటుందట.



స్వతహాగా పేరు ప్రతిష్టలు రావాలి గాని డబ్బిచ్చి ప్రచారం చేసుకునే జబ్బేమిటో మరి?!

సుమిత్ర కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

"సుమిత్రా.. నీకేం ఇవ్వాలో చెప్పలేదు కదా! పెళ్ళయిన మూడు నెలలకు ఈ ఇంట్లో అడుగు పెట్టినప్పటి నుండి ఇంతవరకు నాకు తోడుగ బాధ్యతలను, బరువులను, అన్నీ నువ్వే చూసుకుంటూ వచ్చావు నీకు ఏమిచ్చినా నాకు తృప్తి ఉండదు. ఈ ఇల్లు నీ పేరున రాస్తాను, నా అంతిమ క్షణాల వరకు నీకు తోడుగ ఉంటాను మనకు నలుగురు పిల్లలున్నారు. ఒక వేళ నేను పోయినా .. '

ఆ మాట పూర్తి చేయలేదు మాధవరావు కాదు. పూర్తి చేయనీయ లేదు సుమిత్ర . తన చేయి అతని నోటికి అడ్డం పెట్టింది ఆ మాట అనవద్దని బేలగా చూసింది కన్నీళ్ళతో

ఆఫీసులో ఘనంగా వీడ్కోలిచ్చారు మాధవరావుకు అతని నీతి నిజాయితిని, పట్టుదలను, మంచితనాన్ని పొగిడేరు.

మేనేజరు తన కారులో మాధవరావును ఇంటి దగ్గర డ్రాప్ చేసాడు కారులో మరో ముగ్గురు కొలీగ్స్ ఉన్నారు కారు దిగిన మాధవరావు ఆశ్చర్య పోయాడు మేనేజరు మాధవరావును చూసాడు

అందరిలోనూ ఆశ్చర్యం

-ఇల్లు రంగు రంగు దీపతోరణాలతో అలంకరించబడి ఉంది వెల్‌కమ్ బోర్డు మిల మిల మెరుస్తుంది

కారు దగ్గరకు వచ్చాడు మూర్తి ఆ వెనుక రాజా, ప్రమీల, రాణి, నలుగురూ నాన్నగారి చేతిని పట్టుకుని నడిపించారు. అతనికంతా అయోమయంగా ఉంది.. కలగా ఉంది. మేనేజరు, కొలీగ్స్‌కు వింతగా ఉంది. అప్రయత్నంగా వాళ్ళు కదిలేరు

వరండాలో అల్లుడు మాధవరావు మెడలో దండ వేసి గదిలోకి తీసుకెళ్ళాడు.

సుమిత్ర చిరునవ్వుతో అతన్ని అందంగా అలంకరించిఉన్న కుర్చీలో కూర్చోబెట్టింది.

"ఏమిటిదంతా!"

అని అడిగాడు మాధవరావు ఏం మాట్లాడాలో తోచక

"నాన్నగారూ! మమ్మల్ని తీర్చిదిద్దడంలో మీరు అహర్నిశలూ కృషి చేసారు మీ బాధ్యతలను మీరు ఎంత సక్రమంగా నిర్వర్తించారో అందరికీ తెలుసు. మీ బాధ్యతలను పిల్లలుగా మేము స్వీకరించదలిచాం. మీ కృషికి ఇది మా అభినందన సన్మానం ఈ రోజు కోసం మేము నిరీక్షిస్తున్నాం ఇంతవరకూ మేము మీ పిల్లలం.. ఈ రోజు నుండి మీరు మా పిల్లలు మీ ఇద్దరినీ కంటికి రెప్పలా చూసుకుంటామని మేం నలుగురం భగవంతుడి మీద ప్రమాణం చేసి చెబుతున్నాం" అని మూర్తి మాధవరావు పాదాలకు నమస్కరించాడు

"నాన్నగారూ! ఇన్ని సంవత్సరాలూ అలసట చెందక మమ్మల్ని అభివృద్ధిలోకి తీసుకొచ్చారు మీరిచ్చిన ఈ ఆస్తి చాలు. మాకు వేరే ఆస్తి అవసరం లేదు నేను ఎలాగైనా ఈ సంవత్సరం ఉద్యోగం సంపాదిస్తాను అన్నయ్యా, నేను చెల్లెలు పెళ్ళి ఘనంగా జరిపిస్తాం అదీ మీ చేతుల మీదుగా రాత్రి మీరు అప్పగించిన డబ్బు మీకే చెందాలి అది మీ కష్టార్జితం. దాన్ని మీకు ఇష్టమైన రీతిలో ఖర్చు పెట్టండి ఏదిక్కులేని వృద్ధులు మన సంఘంలో చాలా మంది ఉన్నారు . వారి సంక్షేమానికి వినియోగించండి " అన్నాడు రాజా

"నాన్నగారూ! ఈ రోజు నుండి మీరు మరో క్రొత్త జీవితంలోకి అడుగు పెడుతున్నారు ఈ జీవితంలో అమ్మ, మీరు చిన్న పిల్లల్లా నవ్వుతూ గడపాలి అదే మా కోరిక' అంది ప్రమీల

"నాన్నగారూ! మీ టైంటేబిలు నేను తయారు చేసాను

అని కీర్తి నాన్నగారి దినచర్యలు చెప్పింది

మాధవరావు కళ్ళల్లో ఆనందభాష్పాలు

కొలీగ్స్ పిల్లల ప్రేమాభిమానాలకు, మాధవరావు అదృష్టానికి సంబరపడి అందరినీ మనస్ఫూర్తిగా అభినందించారు

రిటైరయిన ప్రతీ తండ్రికి ఇటువంటి సత్కారం జరిగినప్పుడే అతని నిరంతర కృషికి చక్కని విశ్రాంతి దొరుకుతుంది

మేనేజరు, కొలీగ్స్ మూర్తి బలవంతంమీద డైనింగ్ టేబిలు ముందు కూర్చున్నారు మాధవరావు, సుమిత్రలతో

○

# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: బి.భాస్కరరావు ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

కృష్ణకుమారి, నాగవరప్పాడు (ఖమ్మం జిల్లా)

ప్రశ్న:- నా భర్త అప్పారావు 7-1-1989 తేదీన మరణించారు మాకు ఇద్దరు కుమారులు వారి వయస్సు 7, 5 సంవత్సరాలు నా భర్త తదనంతరం నన్ను, నా పిల్లలను మామగారు ఇంటి నుండి వెడల గొట్టినారు. మేము మా నాన్న దగ్గిర వుంటున్నాము మా నాన్న పేదవారు నా భర్త ఆస్తిని. తన స్వార్జితమైన ఆస్తిని మా మామగారు చిన్న కుమారునకు ఇచ్చి వేశారు. తన ఆస్తిని తాకట్టు పెట్టి నా భర్త మంగళగిరి స్టేట్ బ్యాంక్ నుంచి అప్పు తెచ్చి ట్రాక్టర్ కొన్నారు కొంత అప్పు నా భర్త తీర్చారు. ట్రాక్టర్‌ను నా నుండి మా మామగారి చిన్న కుమారుడు బలవంతంగా తీసుకొని వ్యవసాయము, బాడుగులకు ఉపయోగించు కొనుచున్నారు బ్యాంక్ వారికి మా మామగారు ట్రాక్టర్ అప్పు తీర్చు చున్నారు నా భర్త ఆస్తి నుండి నాకు ఏమీ లేకుండా చెయ్యాలని ప్రయత్నిస్తున్నారు ఈ విషయమై ఈ కేసు పరిశీలిస్తున్న లాయర్ శ్రీ లంకా నాగేశ్వరరావు గారికి తెలియజేసి యున్నాను మీరు సహాయము అందిస్తారని ప్రార్థిస్తున్నాను

జవాబు:- మీ భర్త ఆస్తి, మీకు, మీ పిల్లలకు చెందుతుంది. కనుక ట్రాక్టర్‌ను మీకు, మీ పిల్లల పేరుమీద ట్రాన్స్ఫర్ చెయ్యవలెనని మీరు లాయర్ ద్వారా బ్యాంక్‌కు నోటీస్ పంపించండి. వారు ట్రాక్టర్‌ను మీకు, మీ కుమారుల పేరు మీద ట్రాన్స్ఫర్ చేస్తారు.

డి. భాస్కరరావు, కొండపల్లి (కృష్ణా జిల్లా)

ప్రశ్న.- నేను 10వ తరగతి చదువుకున్నాను ఐ టి ఐ లో ఫిట్టర్‌గా చదివి ఇక్కడ ఆంధ్రప్రదేశ్ హెవీ మిషనరీ అండ్ ఇంజనీరింగ్ లిమిటెడ్‌లో అప్రెంటిస్‌గా ఉన్నాను. నా సర్టిఫికేట్‌లో షెడ్యూల్డు కులము అని వున్నది. ఇకపై నాకు ఏ విధమైన రిజర్వేషన్స్ అక్కర లేదు నా ట్రాన్స్ఫర్ సర్టిఫికేట్‌లో కులం, మతం తొలగించ వచ్చునా?

జవాబు:- మీకు రిజర్వేషన్ అక్కర లేనప్పుడు మీ కులం గురించి వ్రాయడం మానివెయ్యండి. మీ ట్రాన్స్ఫర్ సర్టిఫికేట్‌లో కులం, మతం తొలగించ మని ముందుగా మీరు చదివిన పాఠశాలకు పిటిషన్ పెట్టండి. నిబంధ నలు ప్రకారం చర్య తీసుకుంటారు.

శ్రీ కొండ నవీన్, గూడూరు

ప్రశ్న - నేను పొందుపర్చిన వాటిని పరిశీలించి నాకు ఎటువంటి మేలు జరుగునో తెలుప వలెను చట్ట ప్రకారం ఇంకెక్కడైనా చేయవలసి వస్తే దయతో తెలపండి.

జవాబు:- మీరు టెలికమ్యూనికేషన్ డిపార్ట్‌మెంట్‌లో లైన్‌మేన్‌గా పని చేసినట్లు, బినామి కేసు క్రింద సర్వీసు నుంచి తొలగింపబడినట్లు తెలియు చున్నది. ఆంధ్రప్రదేశ్ స్టేట్ లీగల్ ఎయిడ్ మరియు సలహా బోర్డు వారు మీకు 6-2-1990 తేదీన వ్రాసిన లేఖలో హైకోర్టువారు మీ పిటీషన్ పరిశీలించి మరల సర్వీసులో చేర్చుకొనుటకు ఉత్తర్వులు చెయ్యనట్లు తెలియ పర్చారు. మరియు ఎడ్వకేట్ శ్రీ లక్ష్మణా చారిని సంప్రదించవలెనని సూచించి యున్నారు. కనుక వారిని ముందుగా సంప్రదించండి. ఇక మీరు హైదరాబాద్ లోని సెంట్రల్ ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటిషన్ పెట్టవచ్చును.

నంద్యాల రామారావు, చేబ్రోలు

ప్రశ్న - నేను ఏలూరులో లియో ఫైనాన్స్‌లో 10 వేల రూపాయలకు చీటీ కట్టియున్నాను ఇంకా 4 నెలలలో చీటీ పూర్తి అవుతుంది అనగా కంపెనీ ఎత్తివేసినారు నేను వాళ్ల చుట్టూ తిరుగగా 5 వేల రూపాయలు విలువగల నోటు నా పేరున ట్రాన్స్ఫర్ చేసి ఇచ్చినారు ఆ వ్యక్తి డబ్బు ఇవ్వక పోవడంతో ఏలూరు కోర్టులో దావా వేసినాను కావున అది విజయవంతము అవునా కాదా తెలియపర్చవలెను

జవాబు:- మీ దావా కోర్టులో పెండింగుగా ఉన్నది. కాబట్టి సమాధానం ఇవ్వకూడదు. తీర్పువచ్చేవరకు ఆగండి.

జి. రామచంద్రన్, కుప్పం

ప్రశ్న - నేను 14-12-1970లో పదివేల రూపాయలకు ఇన్సూరెన్స్ పోలసీ తీసుకొని 14-12-90 వరకు ప్రీమియమ్ డబ్బులంతయు చెల్లించియున్నాను పోలసీ పొందునపుడు వైద్య పరీక్ష చేసి ఆరోగ్యవంతుడనని సర్టిఫికేట్ ఇచ్చియున్నారు ఇప్పుడు నేను పక్షవాత రోగముతో జీవితము గడుపుచున్నాను కడప ఎల్ ఐ సి వారు నా పోలసి డిశ్చార్జి చేసి 5738 రూపాయలకు డ్రాఫ్టు పంపియున్నారు నేను 20 సంవత్సరముల కాలములో 7800 రూపాయలు కట్టియున్నాను నాకు బోనస్ ఇవ్వలేదు ఈ విషయంలో సలహా యివ్వవలెను

జవాబు:- ఎల్.ఐ.సి. వారు నిబంధ నలు ప్రకారం పోలసి మీద మీకు రావలసియున్న డబ్బు చెల్లించి యున్నారు.

ఇక భూసేకరణ కేసులో 1986లోను, మోటారు ప్రమాదాల కేసులో 1987లోను, 12 శాతం వడ్డి చెల్లించ వలెనని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పింది. కాబట్టి వడ్డి లేకపోయినా మీరుకట్టిన డబ్బు మీకు చెల్లించడం న్యాయం. మీరు కట్టిన డబ్బు మీకు చెల్లించమని లాయర్ నోటీస్ పంపండి. ఎల్.ఐ.సి. వారు నిరాకరించిన పక్షంలో కోర్టులో దావా వెయ్యవచ్చును. ○

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..............................................

పేరు: ..............................................

పూర్తి చిరునామా: ..............................................

..............................................

# మఱ్ఱి చెట్టు

## పి. చంద్రశేఖర అజాద

మిత్రా కంఠస్వరం వణుకుతుండగా అన్నాడు.

"మరోసారి ఆలోచించు"

సుందరం నిర్లిప్తంగా నవ్వాడు.

"ఇందులో పట్టుదలలకు పోవాల్సిన పనిలేదు. అయినా ఈ చర్చ ఈ నాటిదా? ప్రపంచం మనుగడతోనే ఆరంభమైంది. బహుశా ఈ ప్రపంచం ఉన్నంతకాలం ఈ చర్చ జరుగుతూనే ఉంటుందేమో?" అన్నాడు మిత్ర.

సుందరం నిశ్శబ్దంగా వింటున్నాడు.

"అయినా ఈ ప్రపంచానికి దేవుడున్నాడా? దెయ్యాలున్నాయా? అనే చర్చను మించి ఇంకేం పనిలేదా? వాళ్ళకు అదోసరదా. అహం కూడా. అందుకే ఎలాంటి పందాలకయినా ముందుకొస్తారు. అయినా నీకు ఈ తెగింపు ఏమిటో నాకర్థం కావటం లేదు. రావాలి."

మిత్రా విసురుగా బయటకు వెళ్ళిపోయాడు.

*** *** *** ***

వెల్లటూరు గ్రామం ఎంత పురాతనమైందో... ఆ మఱ్ఱిచెట్టుకు మాత్రమే తెలుసు. ఆ గ్రామంలో తమ ఊరునూ, ఆ చెట్టునూ గురించి తెలిసిన పెద్దలెందరో కాలగర్భంలో కలసిపోయారు. ఎన్నెన్నో ప్రకృతి బీభత్సాలను తట్టుకొని ఆ చెట్టు ఎదుగుతూ వచ్చింది.

దాని ఊడలు దిగి, వ్రేళ్ళు ఎక్కడెక్కడికో విస్తరించి ఉన్నాయి. ఆ చెట్టు గురించి మాట్లాడటం ఆరంభిస్తే వందలాది కథలు పుట్టుకొస్తాయి.

చాలాకాలం ఆ చెట్టు దొంగలకు ఆశ్రయం ఇచ్చిందనుకునే వారు.

పట్టపగలు సైతం వంటరిగా ఆ చెట్టు

ఆ అమ్మాయి ఎవరినో ప్రేమించింది. అతన్నోనే వివాహానికి సిద్ధపడింది. ఇంట్లో ఎవరూ అంగీకరించలేదు. ఆ గ్రామం విడిచి వెళ్ళటానికే ఆ అమ్మాయి నిర్ణయించుకొంది.

ఆ భవనంలోపల ఏం జరిగిందో ఎవరికీ తెలియదు.

ఏ ఆక్రందనలు ఆ గది గోడలకు తగిలి ముక్కలైపోయాయో.... ఆ 'బంగారు తల్లి' ఆ చెట్టు హస్తాల నడుమ వ్రేలాడింది.

అది ఆత్మహత్యని కొందరంటే, కాదు పెద్దింటివారే ఆ పిల్లను చంపి అలా ఉరితీశారు అని మరికొందరి గుండె గొంతుకలు ఘోషించాయి. ఆ శబ్దాలు మాత్రం బయటకు రాలేదు.

అలా ఓ తరం గడిచిపోయింది!

వ్రేలాడిన ఆ శవాన్ని దించి 'మఱ్ఱి' చెట్టు దగ్గర్లోనే దహనం చేశారు.

నిజం చెప్పగల చెట్టుమాత్రం గంభీరంగా ఉండిపోయింది.

ఆ అమ్మాయి భౌతికంగా కాలిపోయింది. కాలక్రమంలో 'దెయ్యమై' జీవించింది.

అంత బలమైన కట్టుబాట్లున్నాయి ఆ ఊరిలో! స్వంత మనుషుల నే సహించలేనంత గొప్పగా!

ఈ నాటికీ పెద్దగా మార్పులేదు. అయితే గతంమీద కొంత నయం.

ఇప్పుడు అక్కడ చర్చలు సాగుతుంటాయి. పందాలు వేసుకుంటారు.

ఎకరాలకు ఎకరాలు ఆ పట్టుదలలో కరిగిపోతుంటాయి.

'మఱ్ఱి' చెట్టుమీద పోటీలు అరుదుగా జరుగుతాయి...

గొప్ప గొప్ప వారెందరో ఆ చెట్టుకు దాసోహం అయ్యారు.

పట్టపగలు కూడా ఆ చెట్టు కడకు వంటరిగా ఎవరూ వెళ్ళరు. అక్కడ ఏదో జరుగుతున్నట్లుంటుంది. ఆ నీడలోకి వెళ్ళగానే సేద తీరిన భావన కలగదు. ఏదోశక్తి తమను ఆకర్షించి, ఆవహించి రక్తాన్ని తోడేస్తున్న అనుభూతి... చీకటి కమ్ముతుండగా ఆ దిక్కుకేసి తల తిప్పాలంటే

దెయ్యాల కథల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ!



అప్పటికీ సుందరం మాట్లాడలేదు.

"ఏమిటి మాట్లాడవు. నువ్వు ఈ పోటీకి అంగీకరిస్తున్నావన్నమాట. అంటే రేపు అర్ధరాత్రి ఆ మఱ్ఱిచెట్టు దగ్గరకు వంటరిగా వెళ్తున్నావన్నమాట..."

అక్కడ నిశ్శబ్దం..........

"వాటే ట్రాష్..... సుందరం నేను దెయ్యాల్ని నమ్మను. అవి లేవనే నా భావన. కానీ చీకట్లో ఏకాంతంగా నేను ఉండలేను. అందులోనూ చిన్నతనం నుండి చీకట్లో చెట్లను చూసి దెయ్యాలుగా భావించే మనం ఈ రోజు ఎంత ఎదిగినా ఆ భావనకు దూరం కాలేం. అందుకే ఈరోజు వంటరిగా అక్కడకు వెళ్ళటం సాహసం అవుతుంది. నువ్వు నీ జీవితాన్ని రిస్క్ చేస్తున్నావు. ఎందుకిలా చేస్తున్నావో నాకు అర్థం కావటం లేదు. సుందరం ఓ ఎకరం పొలం కంటే జీవితం విలువైంది. నీ కంటే ఎంతో ధైర్యవంతులు కూడా ఆ చెట్టు నీడన జంకిన సంఘటనలున్నాయి. అందుకే మిత్రుడిగా నిన్ను అర్థిస్తున్నా... ఈ ప్రయత్నం మానుకో" సుందరం చేతులు పట్టుకొని అడిగాడు మిత్రా.

చాలాసేపు వారిద్దరి మధ్య నిశ్శబ్దం చోటు చేసుకుంది.

ఆ తర్వాత మిత్రానే అన్నాడు......

"నిన్ను మార్చలేననే విషయం నాకు స్పష్టమైంది.

ఏది ఏమైనా నువ్వు సాహసానికి పూనుకుంటున్నావ్. ఈ ప్రపంచంలో జవాబు దొరకని ప్రశ్నలు ఇంకా ఎన్నెన్నో ఉన్నాయి. కానీ వాటి మీద ఎవరూ ఇలా పోటీలు పడటంలేదు. ఏది ఏమైనా నువ్వు తిరిగి రాగలవని ఎదురు చూస్తుంటాను. రాగలవని నేను నమ్ముతున్నాను. నువ్వు తిరిగి రావాలి సుందరం... తిరిగి దగ్గరకు వెళ్ళాలంటే భయపడతారు.....

అప్పట్లో.......

ఆ గ్రామంలోని వ్యక్తి వంటరిగా నడిచి వస్తూ ఎందుకో తలెత్తాడు....



అతని కళ్ళు ఆశ్చర్యంతోనూ, భయంతోనూ, ఇంకా రకరకాల భావాలతోనూ పెద్దవయ్యాయి....

అతని గొంతు నుండి ఒక్కసారిగా వెర్రికేక....

ఆ తర్వాత అతనికెప్పుడూ మాట్లాడే అవకాశమే లభించలేదు.

ఆ చెట్టుకొమ్మకు వ్రేలాడిన ఆ శవాన్ని కొద్ది మంది మాత్రమే చూశారు. అది ఏ సామాన్యులదో కాదు. ఆ ఊరి పెద్దకూతురు శవం.

భయం... అక్కడ గాడాంధకారం....

రాత్రంతా ఆ నల్లటి చీకటిలో మెల్లగా కరుగుతుంటుంది.

అప్పుడా మహావృక్షం ఆకుల కదలికల శబ్దం ఊరినంతా ఆక్రమిస్తుందా అనిపిస్తుంది. ఆ వృక్షం తన చేతులన్నింటినీ సాచి ఆ ఊరిని తన కౌగిట్లోకి తీసుకుంటుందా అనే భావన.

ఆ వ్రేళ్ళు అలా పాకి పాకి, ఊరంతా విస్తరించి ప్రతి ఇంటి అడుగునా తమ ఉనికిని నిక్షిప్తం చేసుకున్నట్లుగా.....

అలాంటి మఱ్ఱి చెంతకు వెళ్ళి, తుది క్షణాల్లో ఏ భయానక దృశ్యమో చూసి గుండెలాగిన వ్యక్తుల కథలు....

ఆ గాలి చెప్పే వింత కథలు.... ఆ గాలిమోసే క్షుద్ర సంగీతం.... దశాబ్దాలు.... శతాబ్దంపైగా.... ఆ గ్రామాన్ని వణికిస్తున్న మఱ్ఱి... దెయ్యాల మఱ్ఱి!

ఆ చెట్టున్నంత కాలం దెయ్యాలు లేవనటానికి ఎవరికీ ధైర్యం చాలదు. ఈ తరం వారికి కూడా ఆ చెట్టుతో రకరకాల అనుభవాలున్నాయి.

ఆ గ్రామం ప్రేమలుగానీ, తగాదాలుగానీ, ఏమైనా గానీ మఱ్ఱిని దాటి బయటకుపోలేదు.

ఆ మహావృక్షపు హస్తాల నడుమో, కడుపు చెంతనో, దగ్గరలోనో.. ప్రక్కనో పరిష్కారం అయిపోతాయి.

అలాంటి మఱ్ఱిచెట్టు చెంతకు అర్ధరాత్రి, అమావాస్య రోజున వెళ్ళిరావటానికి సుందరం ముందుకొచ్చాడు.

## మఱ్ఱిచెట్టు

సుందరం దైవభక్తుడు.

ఎంతటి దైవభక్తుడంటే ఏ మాత్రం నాస్తిక భావనను సహించలేకపోయేవాడు. అలాంటి వ్యక్తుల్ని చూస్తే నిప్పును తొక్కినట్లనిపించేది. ఈ ప్రపంచంలో భిన్నాభిప్రాయాలుంటాయని అంగీకరించేవాడు కాదు. ఆ భావాలు ఈ దేశానికి చెందినవి కాదని తన అభిప్రాయం.

తన చిన్నతనం నుండీ ఆ ఊరిలోని, గుడినీ, అక్కడ దేవతల్ని, అక్కడే దేవతలుగా కొలవబడే చెట్లనీ గాఢంగా ఆరాధిస్తూ వచ్చాడు. అతని గుడ్డి భక్తివల్ల చాలా మందికి చిన్నచూపు కూడా ఉండేది.

వారంతా నాస్తికులు కాదు!

అలా అని చెప్పి భక్తులు కూడా కాదు. ఏదో ఆ సమయం వచ్చినప్పుడు మాత్రం మొక్కుబడిగా ఆయా కార్యక్రమాలు నిర్వహించేవారు.

సుందరం తన ఊరి బడిలో చదువు పూర్తయ్యాక పట్నం వెళ్ళాడు.

అయినా తనలో ఎలాంటి మార్పు రాలేదు.

చదువు అయిపోయాక తిరిగి గ్రామంలోనే ఉంటున్నాడు.

తనకంటూ ఏమీలేదు... ఏం చేయాలో కూడా అర్థంకావటంలేదు.



పై ఫోటో చూసి ఎవరెవరు ఏమంటున్నారో రాయండి- బాగున్న డైలాగ్ వీక్లీలో వేస్తాం. ఒక్క డైలాగుకి మాత్రం 3 మాసాలు చందా ఉచితం.

ఎడిటర్

చాలాకాలం గుడిచెంతా... ఊరి పొలాల చెంతా గడిపాడు.

ఒక్కసారిగా ఊరంతా ఆ వార్త గుప్పుమంది.

"సుందరం దేవుడూ-దెయ్యం లేదంటున్నాడు."

ముందు ఈ వార్తను ఎవరూ నమ్మలేదు.

సుందరం ముఖాన బొట్టుమాయం అయింది. అతను గుడికేసి రావటం మానేసాడు. అప్పటికి గాని జనం నమ్మక తప్పలేదు. ఆ ఊరి పెద్దలంతా కంగారు పడ్డారు. ఏదో జరగబోతుందనుకున్నారు.... విశాలమైన ఆ భవనాల్లో దీర్ఘంగా చర్చలు జరిగాయి.

"సుందరం దేవుడు లేడంటున్నాడు. ఇంతకాలం ఈ ఊర్లో ఏం జరుగుతుందో ఈ ప్రపంచానికి తెలియదు. ఇంతటితో ఇది ఆగదేమో అని నా సందేహం. అసలిదంతా జరగటం ఈ ఊరికి మంచిదికాదు. ఇంతకాలం మన సమస్యల్ని తీర్చింది ఆ మఱ్ఱితల్లే. ఈ సమస్యను తేల్చాల్సింది కూడా ఆ మఱ్ఱితల్లి మాత్రమే."

ఆ ఊరి పెద్దతలకాయలన్నీ నిశ్శబ్దంగా గంభీరంగా ఊగాయి.

సుందరం వారి ముందు నిలబడ్డాడు.

"దేవుడూ,దెయ్యం లేరని నేను గాఢంగా నమ్ముతున్నాను" అన్నాడు సుందరం.

"ఎందుకని?"

"నేను చూడలేదు కనుక"

"అయితే నువ్వు చూడందే నమ్మవా?"

"నమ్మను"

"అయితే ఓ పని చెయ్యగలవా? అమావాస్య రోజున, అర్ధరాత్రి మన దెయ్యాల మఱ్ఱి దగ్గరకు వెళ్ళిరాగలవా?"

సుందరం నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావ్? అలా వెళ్ళి తిరిగి రాగలిగితే నీకో ఎకరం ఇస్తాను"

"మీరు మరోసారి ఆలోచించుకోండి."

"మేంకాదు ఆలోచించుకోవాల్సింది నువ్వు. మాకు ఓ ఎకరం అంటే మా ఎద్దులకు ఉలవల ఖర్చంత."

"అయితే మీ ఇష్టం"

"సరే. రాబోయే అమావాస్య రోజున నువ్వు అక్కడకు వెళ్ళి తిరిగి రావాలి"

సుందరం నిశ్శబ్దంగా నవ్వాడు.

*** *** *** ***

మిత్రా సుందరం మిత్రుడు.

తనతోపాటు పట్నంలో చదువుతున్నప్పుడు సుందరాన్ని మార్చాలని ఎంతో

ప్రయత్నం చేశాడు. కానీ ఏ మాత్రం ఉపయోగం లేకపోయింది.

అలాంటిది ఈ వార్త తెలిసి 'మిత్రా' దిగ్భ్రాంతి చెందాడు.

"మిత్రా ఇందులో ఏదో ఉందని నాకనిపిస్తుంది. సహజంగా పల్లెటూళ్లలో ఇలాంటి పోటీలు జరుగుతుంటాయి. దెయ్యాలున్నాయా లేవా అనటానికి ఋజువు ఇలాంటి పోటీలు కాదు. ఇవి ధైర్యానికి చెందినవి. అసలు ఎంత ధైర్యవంతుడైనా ఏదో ఒక సమయంలో, ఏదో ఒక విషయంలో భయపడతారు. భయాన్నే దెయ్యంగా భావిస్తుంటారు మన ప్రజలు. అర్ధరాత్రి.... గాఢాంధకారంలో ఆ చెట్టు దగ్గరకు వెళ్ళటం ఏమంత మంచిదికాదు. అక్కడ పాములే ఉంటాయో, మండ్రగబ్బలే ఉంటాయో తెలియదు.

అన్నింటికి మించి మనిషి సబ్‌కాన్షస్‌లో చిన్నతనం నుండీ పేరుకుపోయిన భావాలుంటాయి. అవన్నీ ఒక్కసారిగా విరుచుకుపడతాయి. ఏ గాలి కదలిక అయినా, ఏ పిట్ట అరుపయినా గుండెను బలహీనం చేయవచ్చు. ఒక్కసారి ఆ భ్రాంతికి లోనయితే కష్టం. మనిషిగానే మిత్రుడు తిరిగిరాడు. మానవ జీవితం అంతా భ్రాంతితో నడుస్తోంది. భ్రాంతి నుండి వాస్తవానికి పయనించటంలో కూడా ఓ ప్రాసెస్ ఉంటుంది. అందుకని ఒకటే మార్గం. ఈ అమానుషమైన పోటీ నుండి నీ మిత్రుడ్ని బయటకు తీసుకురా. అసలు అతన్ని ఒకటి ఆలోచించుకోమని చెప్పు. ఈ ప్రపంచం తన మనుగడనుకొనసాగిస్తూనే ఉంది. ఆ క్రమంలో ఎవరూ దేవుడూ-దెయ్యం గురించి ఆలోచించటం లేదు. ఓ ఎకరంపొలం పోటీగా పెట్టడం వెనక కుతూహలం మాత్రమే ఉందా అనేది గమనించాలి... ఓ వేళ నీ మిత్రుడు నిజంగానే ధైర్యాన్ని ప్రదర్శించినా.... అతను క్షేమంగా తిరిగి రాగలడా?" అన్నారు మిత్రా గురువుగారు.

"అంటే" అన్నాడు మిత్రా అర్థంకాక.

"ఓ ఎకరం పొలం పోగొట్టుకోవటానికి ఎవరూ అంత సులభంగా ముందుకురారు. దారిలో నీ మిత్రుడికి ఏమైనా జరిగితే...." మిత్రా కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

*** *** *** ***

ఊరంతా సందడిగా ఉంది.

ఉదయం నుండి అందరి కళ్ళలోనూ

## 'షా' మార్గంలో దీప్తి

దీప్తినావల్ కూడా నసీరుద్దీన్‌షా అడుగు జాడల్లో నడుస్తోంది. ఘర్ హోతో ఐసా, సౌదాగర్ వంటి చిత్రాలు చూస్తే నసీర్‌లాగా దీప్తి కూడా కమర్షియల్ సినిమా రంగంలోకి ప్రవేశించిందన్న నిజం వెల్లడవుతుంది. మొదట్లో గ్లామర్ లేని పాత్రలు నటించేందుకు అంగీకరించని దీప్తినావల్ మిర్చి మసాలా వున్న పాత్రలను కూడా యిప్పుడు అంగీకరిస్తోంది.

రాజ్‌సిప్పీ, విజయరెడ్డి, ఎ. జి. నదియద్‌వాలా లాంటివాళ్ళు దీప్తినావల్‌ను ఎన్నుకుంటున్నారట.



ఉత్కంఠ. సుందరం మాత్రం ఎవరితోనూ మాట్లాడటం లేదు. అతన్ని గమనిస్తున్న వారందరూ గుసగుసలాడుకుంటున్నారు. కొంతమందికి ఈ పోటీ చివరిదాకా సాగుతుందని నమ్మకం లేదు. చీకటిపడిపోవటంతోనే అంతం అవుతుందని వారి నమ్మకం. సుందరం భక్తిని తెలిసిన కొందరు అతన్ని చూసి జాలిపడుతున్నారు.

రాతకోతలన్నీ పూర్తవుతున్నాయి.

సాయంకాలం నాలుగు గంటల ప్రాంతానికి అందరూ మఱ్ఱిచెట్టు దగ్గరకు చేరారు.

ఓ వ్యక్తి చెట్టుమీదకు ఎక్కాడు. ఎర్రటి ఓ గుడ్డను కొమ్మకు ఆనించి దాని మీద ఓ మేకును కొట్టారు.

రాత్రికి సుందరం వచ్చి..... ఆ మేకుతోపాటు ఆ ఎర్రటి గుడ్డ తీసుకురావాలి!

ఏర్పాట్లను సంతృప్తిగా పరిశీలించాక పెద్ద తలలన్నీ వెనక్కి తిరిగాయి.

కొద్దిదూరం నడిచాక అందరూ వెనక్కి తిరిగారు.

మఱ్ఱిచెట్టు కొమ్మల్లో ఎర్రగా మెరుస్తోంది.

కొంతమందికి అది దెయ్యంలా కనిపిస్తే....

మరి కొందరికి అది "మృత్యువు"లా కనిపించింది.

*** *** *** ***

చీకట్లు ముసురుకుంటున్నాయి.

సుందరం మామూలుగానే స్నానం చేశాడు.

మిత్రా అప్పటికే వెళ్ళిపోయాడు. తన అనుమానాలన్నింటినీ సుందరం ముందుంచాడు. అయితే వాటన్నింటినీ సుందరం కొట్టిపారవేశాడు. తను అక్కడకు వెళ్ళి తిరిగి రావాలే గానీ మానవ పరంగా తనకు ఎలాంటి ఇబ్బందులు ఎదురుకావని చెప్పాడు. ఓ రకంగా మిత్రా కోపంతో వెళ్ళిపోయాడు.......

కోట్లాది సంవత్సరాలుగా మానవజాతిని పట్టిపీడిస్తూ, ఎప్పటికప్పుడు నిత్య నూతనమైన ఈ సమస్యను ఆ గ్రామ ప్రజలు ఈ కోణం నుండి సరిచూసుకోవాలనుకుంటున్నారు.

సుందరం భోజనం చేశాడు... అమావాస్య కావటంతో ఎటు చూసినా నల్లటి చీకటి.... ఆకాశంలో ఓ రాక్షస మేఘం ఈ దృశ్యాన్ని చూడటానికి వచ్చినట్లుగా ఉంది.

మరి కొద్దిసేపట్లో సుందరం బయలుదేరుతాడనగా ఎవరో అడిగారు.

"నాయనా సుందరం... ఎందుకిదంతా... దేవుడున్నాడనీ.... దెయ్యాలున్నాయనీ ఒప్పేసుకోబాబూ"

సుందరం రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

అతని పెదవులమీద చిరునవ్వు ఆ చీకట్లో మెరిసింది.

సరిగ్గా రెండురోజుల క్రితమే ఆ మఱ్ఱి దగ్గరగా ఎవరినో దహనం చేశారు. ఆ బూడిద మరకలింకా తొలగిపోనే లేదు....

అక్కడున్న వారందరి గుండెల్లో గుబులుగా ఉంది....

వారందరికీ ఏ క్షణం అక్కడ నుండి బయటపడి ఇళ్ళకి వెళ్ళాలా అని ఉంది...

సుందరం అడుగు ముందుకు వేశాడు..

అతను చీకట్లో కలిసి పోనున్నాడా అనిపించింది.

పెద్ద తలలు మాత్రం తీక్షణంగా చూశాయి....

మరి కొద్దిసేపట్లో వెర్రికేకల్తో సుందరం వారి దగ్గరకు పరిగెత్తుకు రాగలడనే వారి నమ్మకం.

*** *** *** ***

మిత్రా స్కూటర్ వేగంగా పరిగెడుతూంది.... అతని మొఖం నిండా చెమటలు... తను పొరపాటు చేశాడు... తను అక్కడే ఉండాల్సింది.... తన సుందరాన్ని దక్కించుకోవాల్సింది... తన మాటవినలేదనే అహానికి తను బానిస అయ్యాడు... ఇప్పుడేమై ఉంటుంది? సుందరం మఱ్ఱి చెట్టు దగ్గరకు వెళ్ళాడా? తిరిగి వచ్చాడా? ఆ చీకటిలో ఏ విషపు పురుగుకాటుకు బలికాలేదు గదా? ఆ చీకటి రాత్రి ఏ ఏ భయానక దృశ్యాలు చూసి మతి చలించలేదు కదా? ఇంతకూ ఏం జరిగి ఉంటుంది? తను తన మిత్రుడ్ని సజీవంగా చూడగలడా?

గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి...

## మఱ్ఱిచెట్టు

స్కూటర్ గ్రామంలోకి ప్రవేశించింది.....

ఊరంతా నిర్మానుష్యంగా ఉంది? ఎందుకని? ఏమైంది? అందరూ ఇళ్ళలోనే ఎందుకు ఉండిపోయారు? సుందరం....

ఒరేయ్ సుందరం నువ్వేమైపోయావ్ అకస్మాత్తుగా స్కూటర్ ఆగిపోయింది.....

రెండుసార్లు తిరిగి కిక్ కొట్టాడు.....

కదలలేదు.....

స్టాండువేసి పరిగెత్తటం ఆరంభించాడు.....

పరిగెత్తి.... పరిగెత్తి...

ఆ పూరింటి తలుపుల్ని ఒక్కసారిగా నెట్టాడు.

తన గుండెలు ఆగిపోతాయన్నంత ఉద్వేగం....

తన కళ్ళనిండా నీళ్ళు....

ఆ దృశ్యాన్ని చూసి తట్టుకోలేక భోరున ఏడ్చాడు......

అదే చిరునవ్వుతో

సుందరం ఋషిలా నిలబడి ఉన్నాడు.

*** **** ****

"నిజం మిత్రా.... ఇప్పటికీ నాకు నమ్మకం కలగటం లేదు. నేను ఆ మఱ్ఱిచెట్టు దగ్గరకు వెళ్ళివచ్చానా అనేది. కానీ ఈ కాయితాలు మాత్రం వాస్తవం అని చెబుతున్నాయి. నేను నా చిన్నతనం నుండీ దేవుడ్ని ప్రగాఢంగా నమ్మాను. దేవుడ్ని నమ్మని వ్యక్తుల పట్ల అత్యంత కఠినంగా ఉన్నాను. ఈ ఊరి వారందరితోపాటు నేనూ ఆ మఱ్ఱిచెట్టును చూసి భయపడ్డాను.. నీకు మాత్రం నేను చెప్పాల్సింది ఉంది. నేను విజయం సాధించాననుకోవటం లేదు.... ఇప్పటికీ దేవుడూ- దెయ్యం ఉన్నారా లేదా అనేది నేను చెప్పలేను.

ఎందుకో తెలుసా? నాకు జీవితం మీద మమకారంపోయింది. నేను చదివిన చదువు నాకో మార్గం చూపించలేకపోయింది.ఈ ఊరిలో ఏ పెద్దలూ నాకు సహాయపడలేకపోయారు. ఈ ప్రపంచపు తత్వం నాకు అర్థం కాలేదు. సాటి మనిషి మరణిస్తుంటే సహాయం చెయ్యనివారు ఇలాంటి సమస్యలు వచ్చినప్పుడు ఎంతైనా ఖర్చుపెడతారు. నా నవ్వుకు కారణం అదే. నేను ఈ జీవితంమీద పూర్తిగా ఆశ కోల్పోయిన క్షణం మృత్యు



## 'మహాభారత్' తర్వాత...

టి. వి. ప్రేక్షకులను గత కొన్ని నెలలుగా విపరీతంగా ఆకర్షించిన 'మహాభారత్' సీరియల్‌లో కురుక్షేత్ర సంగ్రామం క్లైమాక్స్‌కు చేరుకుంటున్నందున దీని స్థానే ప్రేక్షకులను ఆకట్టుకునే తరువాతి సీరియల్ ఏమై వుంటుందా అన్న ప్రశ్న అందరిలో ఉదయిస్తోంది.

చంద్రగుప్త మౌర్యుడికి చేదోడు వాదోడుగా వుండి ఆయనకిసహకరించిన 'చాణక్య' సీరియల్ 'మహాభారత్' స్థానంలో చోటు చేసుకుంటోంది.

ఒక్కొక్క భాగం 45 నిముషాలసేపు ప్రసారమయ్యే ఈ సీరియల్ 26 భాగాలు ప్రసారం చేసేందుకు అనుమతి లభించింది. ప్రేక్షకుల నుంచి వచ్చే ప్రతిస్పందనని బట్టి 52 భాగాలకు పొడిగిస్తారట.

మహాభారత్‌ను సమర్పించిన చోప్రా సోదరులు ఈ ప్రాజెక్టు మీద ఉత్సాహం చూపారు కాని అది వారి చేతులు దాటిపోయి ప్రకాష్‌ద్వివేది చేతుల్లో పడింది. దీనికి చంద్రప్రకాష్ దర్శకత్వం వహిస్తున్నారు.

తొమ్మిది సంవత్సరాలు ఈ సబ్జెక్టు మీద పరిశోధన చేసి చంద్రప్రకాష్ 1986 ఏప్రిల్‌లో స్క్రిప్టు అందజేశాడు కాని డిసెంబరు 88 లో అనుమతి లభించింది.

మహాభారత్‌లో నటించిన తారాగణం యిందులో ప్రేక్షకులకు కనిపించక పోవచ్చు. సుబ్రతో బస్, రాగిణిషా, అరుణ్ బాలి, ప్రమోద్ మాథుర్, విమల్‌వర్మ మొదలైన వారు నటిస్తున్నారట.

ప్రముఖ దర్శకులు శ్యాంబెనగల్, గోవింద్ నిహలాని వంటివారు చంద్రప్రకాష్‌కు సహకరిస్తున్న ఈ 'చాణక్య' సీరియల్ ప్రేక్షకులను ఎలా ఆకట్టుకుంటుందో వేచి చూడాల్సిందే!

# మరిచి పోయారా వీరిని?

## అద్దంకి



ఈ ఛాయా చిత్రంలో కనిపిస్తున్న నటుడు అద్దంకి శ్రీరామమూర్తి సుమారు అర్ధ శతాబ్దం గతించిన కాలంలో అద్దంకి రంగస్థల నటుడిగా, సినీమా నటుడిగా అఖండ యశస్సు గాంచాడు. ఈయన గానం మధురాతి మధురంగా వుండేది. సంగీత విద్వాన్, గాన గంధర్వగా కీర్తి బడసారు.

టాకీలు ఆవిర్భావంతో నాటకరంగం నుంచి సినీమారంగంలో ప్రవేశించిన వారిలో అద్దంకి ఒకరు.

1935 సం.లో విడుదలయిన స్టార్ కంబైన్స్ వారి "హరిశ్చంద్ర"లో నాయక పాత్రను సమర్ధతతో పోషించి సినీమా ప్రేక్షకుల అభిమానం చూరగొన్నారు.

1937 సం.లో 'సారంగధర'లో రాజరాజ నరేంద్రుడిగా నటించారు. మీరు చూస్తున్న ఛాయాచిత్రం ఈ చిత్రంలోదే.

1940 సం.లో "భోజకాళిదాసు"లో శ్రీ అద్దంకి కాళిదాసుగా నటించి రాణించాడు. ఆ తర్వాత భక్తి మాల (41) కృష్ణప్రేమ (43) పాదుకా పట్టాభిషేకం (45) భక్త తులసీదాసు (46) బ్రహ్మరథం (47) సాయిబాబా (50) మొదలగు చిత్రాలలో ప్రధాన పాత్రలు ధరించి నాటి సినీమా ప్రేక్షకుల హారతులందు కున్నాడు.

1950 సం. తర్వాత చిత్రాలలో నటించక పోయినప్పటికీ, నాటక రంగాన్ని విడిచి పెట్టలేదు. ధర్మరాజు, దశరధుడు పాత్రల పోషణలో అద్దంకికి ప్రత్యేక గుర్తింపు వుంది.

వృద్ధాప్యంలో కూడా రాష్ట్రమంతటా నాటకాలు వేస్తుండేవాడు. తను నటించిన సినీమా లన్నింటిలోనూ పాటలు, పద్యాలు తను స్వంతంగా పాడి శ్రోతల మన్ననల నందుకున్నారాయన.

—సేకరణ: ఆరిపాక సూరిబాబు

---

పయినా, జీవితమైనా ఒకటే. అందుకే నేను ఇక్కడి నుండి బయలుదేరాక ఇంకే మాత్రం సుందరాన్నికాదు. బోధిచెట్టు క్రిందకు పయనించిన బుద్ధుడిలా వెళ్ళాను. నాకు ఎలాంటి శబ్దాలు వినిపించలేదు. నా దారిలో ఏమున్నాయో నేను గమనించ లేదు. అలా మౌనంగా నడుచుకుంటూ వెళ్ళాను.... చూస్తుండగానే ఆ మఱ్ఱి చెంతకు వెళ్ళాను. అది నా తల్లిలా అనిపించింది.నాకు భయం కలగలేదు.. నా తల్లి కడుపులో దిగబడ్డ మేకు... రక్తంలా ఎర్రటిగుడ్డ.... నేను మేకును బయటకు లాగాను. ఇంతకాలం ఆ చెట్టు తల్లికి తగులుతున్న గాయాలు నాకు అర్థం అయ్యాయి... ఆ నిశ్శబ్దంలో నా తల్లి నన్ను పొదివిపట్టుకొని రోదించింది. తరతరాలుగా ఎన్నెన్నో భయానక బాధాపూరిత సంఘటనలకు తను సాక్ష్యం అయినందుకు తల్లడిల్లింది. తనకు నీడనివ్వటమే తెలుసు... ప్రాణం పోయటమే తెలుసు.. మరి నన్నెందుకు దెయ్యంగా భావిస్తున్నారంది. ఆ కన్నతల్లి కన్నీరు తుడిచాను. అవును చెట్టు మనకు నేస్తం.... అది దెయ్యం కాదు. శతాబ్దాలుగా మానవుడితోపాటు ఎదిగి వచ్చిందది... అలా ఎంత సేపున్నానో తెలియదు. తూరుపు దిక్కున వెలుగురేకలు విచ్చుకుంటున్నప్పుడు నేను నా తల్లిని విడువలేక విడువలేక వచ్చాను.

రక్తసిక్తమైన ఆ గుడ్డను..... గుండెల్ని చీల్చే ఆ మేకును వారి కందించి చెప్పాను...

ఈ మఱ్ఱి మనందరి నేస్తం....
ఈ చెట్టు మన కన్నతల్లి....

దేవుడూ- దెయ్యం వాస్తవమో కాదో నేను చెప్పలేను....

కానీ ఈ చెట్టుతల్లి మాత్రం వాస్తవం....

అవి మానవజాతికి నేస్తాలనేది నగ్న సత్యం.....

సుందరం చెప్పుకుపోతున్నాడు....

మిత్రా దిగ్భ్రాంతి చెంది వింటున్నాడు.....

## ముగింపు

మిత్రా బయలుదేరుతూ అన్నాడు..

"సుందరం..... మరలా ఎప్పుడైనా ఆ మఱ్ఱి చెంతకు వెళ్ళగలవా?"

సుందరం కళ్ళలో భయం తొంగిచూసింది....

తను మెల్లగా అన్నాడు....

"మిత్రా నేను నిన్నటి సుందరాన్ని కాదు. ఇప్పుడు నాకూ ఓ ఎకరం ఉంది. ఇప్పుడు తిరిగి జీవితం మీద మమకారం ఉంది. నాకింకా బాగా సంపాదించాలనుంది. నాలాంటి వారికి మఱ్ఱి చెట్టు ఎప్పుడూ భయాన్నే కలిగిస్తుంది.

ఏ రోజునైతే నేను ఈ ఆస్తి సంబంధాలను.... ప్రాపంచిక సుఖాలను వదిలించుకుంటానో ... ఆ రోజే ఆ మఱ్ఱి నన్ను కన్నతల్లిలా హృదయానికి హత్తుకుంటుంది.....

అందుకే చెబుతున్నాను. జీవితంలో ఇంకెప్పుడూ ఒంటరిగా ఆ మఱ్ఱి దగ్గరకు వెళ్ళనే వెళ్ళను."

మిత్రా దిగ్భ్రాంతి చెంది చూస్తూనే ఉన్నాడు.

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

(గత సంచిక తరువాయి)

"ఖచ్చితంగా చెప్పాలంటే 407.48 కేరెట్లు. 1984లో ఇద్దరు వజ్రాల వర్తకులూ ఓ అమెరికన్ ఇండస్ట్రియల్ గ్రూప్ దీన్ని కొనుగోలు చేసేదాకా దాని గురించి బయటి ప్రపంచానికేంతెలీదు. ముడి వజ్రంగా దొరికినప్పుడది 890 కేరెట్లుండేదట. దాన్ని రెండుసార్లు సానబెట్టి ప్రస్తుతం వున్న షేపుకి తెచ్చారు. ఆ వజ్రం ప్రతి రూపం కూడా ఇక్కడే వుంది. రా చూపిస్తాను."

పింకీ మంత్రానికి కట్టుబడిపోయినట్టు అనుసరించిందతన్ని.

అవును, అటువంటి వజ్రం ఒకటి హఠాత్తుగా బయటపడిందని తను చదివింది. సమయానికా మాట ఆమెకి గుర్తురాలేదు. శక్తిధర్ హఠాత్తుగా జూబ్లీ స్థానం పడిపోయిందనగానే ఆమెకు వెంటనే మనసులో కదిలిన వజ్రం 'సూర్యనేత్రం'. అందుకే అతనామాటెత్తగానే వులిక్కిపడింది. 'గోల్డెన్ ట్రయోలెట్' పేరు చెప్పేంత వరకూ ఆమె తేలిగ్గా వూపిరి తీసుకో లేకపోయింది.

అతనో షోకేసు ముందాగాడు.

"ఇదే గోల్డెన్ ట్రయోలెట్," వేలు పెట్టి చూపిస్తూ అన్నాడు.

పింకీ మహోత్సాహంతో చూసిందా వైపు. ఆమె కళ్ళెదుట ఇటీవలే చరిత్ర సృష్టించిన మహా వ్రజం ప్రతిరూపం కళ్ళు మిరుమిట్లు గొలిపే వెల్తురుతో మెరిసిపోతోంది.

"దాని రంగు చూశావా? పసుప్పచ్చ రంగులో వుండడం వల్లనే దానికి గోల్డెన్ ట్రయోలెట్ అనే పేరొచ్చింది. ఈ మధ్యనే-అంటే, 1988 అక్టోబర్లో దాన్ని అమ్మకానికి పెట్టారు. ఆ విధంగా ఇప్పటి వరకూ అమ్మకానికొచ్చిన అతి పెద్ద వజ్రం ఇదే. అంతే కాదు రంగున్న వజ్రాల్లో ప్రపంచంలో కెల్లా అతి పెద్దది ఇదే. ఇది బయటపడినప్పట్నుంచీ దీని ముందు కల్లినాన్-2 కూడ మూడోస్థానంలో పడిపోయింది," చెప్పాడు శక్తిధర్.

'కాదు! మూడో స్థానంలోకి కాదు. నాలుగో స్థానంలోకి పడిపోతుంది. సూర్యనేత్రం గురించి బయటి ప్రపంచానికి తెలిసిన మరుక్షణం కల్లినాన్-1 కూడా రెండోస్థానంలో కొచ్చేస్తుంది,' మనసులోనే అనుకుంది పింకీ.

శక్తిధర్ ఆమెకు మరికొన్ని వజ్రాలు చూపించాడు.

"ఇది డ్రెస్డెన్ గ్రీన్. ప్రపంచంలోని చిలకపచ్చ రంగు వజ్రాల్లో ఇదే పెద్దది. దీని బరువు 41 కేరెట్లు"

"ఇది ఆర్లాఫ్ డైమండ్. దీని బరువు 189.60 కేరెట్లు. 1789లో మాయమైపోయిన 'షాజహాన్' వజ్రం ఇదేనని కొందరంటారుగానీ 1750లో శ్రీరంగంలో శ్రీరంగడి విగ్రహం కంటి నుంచి ఈ వజ్రం దోపిడీకి గురైందనడానికి దాఖలాలున్నాయి. కర్నాటక యుద్ధం జరుగుతున్న కాలంలో ఓ ఫ్రెంచి సైనికుడు దీన్ని శ్రీరంగడి కంటి నుంచి దొంగిలించి ఓ నదికి అడ్డంగా ఈది మద్రాసు చేరుకుని అక్కడో ఇంగ్లీషు ఓడ కెప్టెన్‌కి అమ్మేశాడట. , ఆ కెప్టెన్ దగ్గర్నుంచీ ఓ పర్షియన్ వర్తకుడు దాన్ని కొనుక్కున్నాడు. 1775లో గ్రెగరీ ఆర్లాఫ్ అనే రాజకుమారుడు దాన్ని కొనుక్కుని రష్యన్ మహారాణి కేథరిన్ ది గ్రేట్ ప్రేమ పొందడానికి ఆమెకు కానుకగా సమర్పించుకున్నాడు. ప్రియుళ్ళనీ వజ్రాల్నీ కలెక్ట్ చెయ్యడంలో కేథరిన్ పేరు మోసిన రాణి. ఆమె ఆర్లాఫ్ సమర్పించిన వజ్రాన్నైతే స్వీకరించింది గానీ ఆర్లాఫ్‌ని మాత్రం స్వీకరించలేదు. ఈ వజ్రం ఇప్పటికీ రష్యాలోనే వుంది.

"ఇది 'షా' వజ్రం. ఇది నూటికి నూరు పాళ్లూ భారతీయ వజ్రం. అందులోనూ మన గోల్కొండలోనే దొరికింది. 1739 లో నాదిర్షా పర్షియాకు దోచుకుపోయిన వజ్రాల్లో ఇదికూడా వుంది. ఇరాన్-రష్యాల మధ్య యుద్ధం ఆపిన వజ్రంగా దీనికి పేరుంది. 1829 లో అలెగ్జాండర్ గ్రిబోమెడాఫ్ అనే రష్యన్ రాయబారి టెహెరాన్లో హత్యకు గురయ్యాడు. ఇరాన్ రాజు యుద్ధం నివారించడానికి నష్టపరిహారంగా ఈ వజ్రాన్ని రష్యాకు సమర్పించుకున్నాడు. దీని బరువు 88.7 కేరెట్లు.

"ఇది శాన్సీ డైమెండ్, చరిత్రకారుల్ని ఇంతగా కన్‌ఫ్యూజ్ చేసిన వజ్రం మరొకటి లేదు. శాన్సీ అనే పేరున్న మరో వజ్రం ఆ అయోమయానికి కారణం. నిపుణులు ప్రస్తుతం ఇదే అసలైన శాన్సీ అని నమ్ముతున్నారు. దీని బరువు 53.75 కేరెట్లు."

ఇది 'రీజెంట్' డైమండ్. దీనివెనుక అల్లకల్లోలమైన చరిత్ర దాగివుంది. ఇది భారతదేశంలో దొరికిందే. ఓ బానిస దీన్ని సంపాయించి తన వొంటి మీద గాయం చేసుకొని ఆ గాయంలో దీన్ని దాచేసి కోస్తాప్రాంతానికి పరారీ అయ్యాడు. అక్కడో ఇంగ్లీషు ఓడ కెప్టెన్ అతన్ని హత్యచేసి వజ్రంతో సహా పారిపోయాడు. అక్కడ్నించి చేతులు మారి ఇది ఫ్రెంచ్ ఖజానాకి చేరుకుంది. 1789లో జరిగిన ఫ్రెంచి విప్లవంలో రాజకుటుంబం సభ్యులందర్నీ గిలోటిన్ కింద నరికేసి విప్లవకారులు 1792 లో ఫ్రెంచి రాజరికపు ఆభరణాలన్నీ దోచుకుపోయారు. అయితే ఒక్క రీజెంట్ మాత్రం మళ్లీ దొరికింది. 1804లో నెపోలియన్ దీన్ని తన ఖడ్గం పిడిలో పొదిగించుకున్నాడు. నెపోలియన్ పతనమైపోయాక ఇది కొంతకాలంపాటు ఆస్ట్రియాలో వుంది

**ఇంతవరకూ సాగినకథ -: 28** విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో దొరికిన అపురూప వజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. వజ్రపాణిని దెబ్బతీసేందుకు విశ్వధరవర్మ ఎదురు చూస్తుంటాడు. మణిపురం కొండల్లో వున్న వజ్రపాణి హవేలీకి పయనమై వెళ్తున్న పింకీకి క్యూబిక్ జిర్కోనియా ఇండస్ట్రీస్ అధినేత శక్తిధర్ పరిచయమవుతాడు. అతని దగ్గర వున్న అపురూపమైన వజ్రాలను పింకీ చూస్తుంది.

గానీ ఆస్ట్రియన్ చక్రవర్తి దీన్ని ఫ్రాన్స్ కి ముక్కలు చేయించేశాడు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఓ పాలరాతిపలక కింద దాచేశారు. ఇప్పటికీ ఇది ఫ్రాన్స్ లోనే వుంది. దీని బరువు 140.5 కేరెట్లు.

ఇది 'స్పూన్ మేకర్' వజ్రం. దీని వెనక్కూడా అద్భుతమైన చరిత్ర వుంది. టర్కీలో ఓ బెస్తవానికి ఈ వజ్రం చెత్త కుప్పలో దొరికిందట. అతను దీన్నిచూసి ముచ్చటపడి ఇంటికి తీసుకెళ్లాడు. ఓ చెంచాలు తయారుచేసేవాడు మూడు చెంచాలు ఇచ్చి దీన్ని కొన్నాడట. అందుకే దీనికి 'స్పూన్ మేకర్' అనే పేరొచ్చింది. 1882లో అదృశ్యమైన రెండో టర్కీ వజ్రం ఇదేకావచ్చు. ఆ కథేమిటంటే అలి పాషా అనే క్రూరుడైన నియంత టర్కీ సుల్తాన్ చేతిలో ఓడిపోయాక చివరికోరికగా తన సింహాసనం మీదే మరణించాలని కోరుకున్నాడు. సింహాసనం ఎక్కుతూనే అతను తనకెంతో ప్రియమైన భార్యతోపాటు ఈ వజ్రాన్ని కూడా శత్రువుల చేతుల్లో పడకుండా నాశనం చేయవలసిందిగా తన చిట్టచివరి ఆజ్ఞ జారీచేశాడు. అలెగ్జాండర్ డ్యూమా రాసిన 'కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో' నవలలో ఈ సంఘటన గురించిన వర్ణన వుంది. అయితే అలీపాషా ఆ వజ్రాన్ని చూర్ణం చేసినట్టుగా ఆ నవల్లో వుంది. కానీ, ఆనాటి ఆ వజ్రం నాశనమైపోలేదనీ అదే ఈ స్పూన్ మేకరనీ నిపుణుల అభిప్రాయం. దీని బరువు 85.8 కేరెట్లు."

"అబ్బ, ఇక చాలు! ఈ వజ్రాలన్నీ ఒకేసారి చూస్తుంటే నాకు కళ్ళు తిరుగుతున్నట్టుగా వుంది" అంది పింకీ.

నిజంగా ఆ కాంతిపుంజాల్ని చూస్తుంటే ఆమెకు కళ్లు తిరుగుతున్నట్టుగా అనిపిస్తోంది.

శక్తిధర్ చిన్నగా నవ్వాడు.

"వజ్రాల్లో వున్న శక్తి అదే. ఓ వజ్రాన్ని చూస్తూనే మనకేదో అవుతుంది. మొదట కళ్ళు జిగేలుమంటాయి. ఆ తర్వాత మనసు ట్రాన్స్ లోకి వెళ్ళిపోయినట్టుగా అవుతుంది. ఇన్ని మహా వజ్రాల్ని ఒకేసారి చూస్తే కళ్ళు తిరగడంలో తప్పులేదు అన్నాడు."

"కళ్ళు చెదిరిపోతున్నా నాకిక్కడ్నించి కదలాలనిపించడం లేదు," చిన్న పిల్లలా అంది పింకీ."



# ఎర్షాద్ పై రెండవ భార్య దావా?

బంగ్లాదేశ్ అధ్యక్షుడు జనరల్ ఎర్షాద్ పైన వారి రెండవభార్య కోర్టులో కేసు పెట్టిందని అమెరికాలోని న్యూయార్క్ పోస్ట్ పత్రిక తెలియజేసింది. ఎర్షాద్ పెద్ద అక్రమార్జన పరుడని కూడా ఆమె ఆ కేసులో పేర్కొన్నది.

అభివృద్ధి ప్రాజెక్టులకు కేటాయించిన నిధులను ఈయన ప్రైవేటు వ్యక్తులకు బదలాయించి కోట్లాది డాలర్లను వెనకేసుకున్నాడని ఆ పత్రిక వివరించింది.

ఎర్షాద్‌కు సంబంధించిన వ్యాపార లావాదేవీల తాలూకు డాక్యుమెంట్లను అందజేయవలసిందిగా మాన్‌హాటన్ సుప్రీం కోర్టు న్యూయార్క్‌లోని పరపతి, వాణిజ్య అంతర్జాతీయ బ్యాంకు (బి.సి.సి.ఐ.)కి నోటీసు కూడా పంపించింది.

బి.సి.సి.ఐ. బ్యాంకుకు-ఎర్షాద్‌కు మధ్య గల లావాదేవీలను దర్యాప్తు జరిపేందుకు ఫెయిర్‌ఫాక్స్‌కు చెందిన మైకేల్ హెర్షమన్‌ను నియమించారు. బి.సి.సి.ఐ. ద్వారా లక్షలాది డాలర్లను ప్రైవేటు బ్యాంకు ఖాతాలకు మళ్లించారని, అదే సమయంలో బంగ్లాదేశ్‌లోని కాంట్రాక్టర్లనుండి ముడుపులు కూడా అందుకున్నారని ఫెయిర్ ఫాక్స్ అధ్యక్షుడు తెలియజేశారు.

ఇది యిలా వుండగా 1982 ఆగష్టులో నన్ను పెళ్లి చేసుకున్నాడంటూ ఒక మహిళ- ఎర్షాద్ సంపదలో తనకు చట్టబద్ధమైన వాటా యిప్పించాలని కోరుతూ



కోర్టులో కేసు పెట్టింది. మరియం ముంతాజ్ అనే ఈమె ఎర్షాద్ అవినీతిపరుడని తనకొక్కదానికే కాదు దేశమంతా తెలుసునని అంటోంది.

ఇటీవల అమెరికా పర్యటనకు వెళ్లగానే అక్కడ ఎర్షాద్‌కు సమన్లు అందాయట. తన గురించి ఏడేళ్ళుగా పెదవి విప్పక పోవటానికిగల కారణం- ఈ విషయమై ఆయన తనను సవాలు చేసిన మరుక్షణమే యిరకాటంలో పడగలడని భావించినందువల్లేనని ముంతాజ్ అన్నదట.

తాను ఎర్షాద్ రెండవభార్యనని, 30 సంవత్సరాల క్రితం పెండ్లిచేసుకున్న మొదటి భార్యకు పిల్లలు లేకపోవటంతో తనను పెళ్లి చేసుకున్నాడని, తమ వివాహ విషయం బహిరంగం చేసే వారం రోజుల ముందు ఎర్షాద్ మొదటిభార్య పిల్లవాడిని ప్రసవించిందని వార్తరాగా అనంతరం తాను బంగ్లాదేశ్ నుంచి బహిష్కృతురాలనైనానని ఆమె అన్నదని ఆ పత్రిక వివరించింది.

ఆయన సంపదలో తనకు కూడా వాటావుందని యిప్పుడామె కోర్టుకెక్కిందట.

---

అతను మళ్లీ నవ్వాడు.

"అలాగని ఇక్కడే వుండి పోతానంటే ఎలా? రా వెళ్దాం!" అన్నాడు.

వాళ్ళిద్దరూ ఆ గదిలోంచి బయటికొచ్చారు.

అక్కడ్నించి బయటికొస్తూనే ఆకాశం మీద నుంచి నేలమీదికి కుంగిపోయిన అనుభూతి కలిగింది పింకీకి.

"మంచినీళ్ళు తాగు," అన్నాడతను గ్లాసులో చల్లని మంచినీళ్ళు అందిస్తూ. పింకీ గబగబా మంచినీళ్ళు తాగేసింది.

"థాంక్స్!" అంది గ్లాసు టేబుల్ మీద పెట్టేస్తూ.

అప్పటికి కానీ ఆ మహా వజ్రాలన్నీ ఒక్కసారిగా కళ్ళ జూసిన విభ్రాంతిలోంచి తేరుకోలేక పోయిందామె.

"ఈ రోజు నా జీవితంలో మరచిపోలేనిది," నిజాయితీగా అంది.

"అప్పుడేనా! ఇంకా నాతో డిన్నర్‌కు రాందే!"

"డిన్నర్‌తోనే సరిపెట్టేస్తారేమిటి?"

"మరి?"

"డిన్నరైపోయిం తర్వాత నేను మిమ్మల్నో కోరిక కోరతాను. కాదనకూడదుసుమా!"

అతని కళ్ళు మెరిశాయి.

"ఏమిటా కోరిక?" క్యూరియస్‌గాఅడిగాడు.

"ఊహు ! ఇప్పుడే చెప్పను. డిన్నరైం తర్వాత."

"ఆల్‌రైట్!"

"తీరుస్తానని మాటివ్వండి!"

"నువ్వే కోరిక కోరినా తీరుస్తాను. ఓకే?"

"ప్రామిస్?"

"ప్రామిస్!" చేతిలో చెయ్యి వేశాడతను.

హఠాత్తుగా పింకీ కళ్ళలో చిత్రమైన వెలుగు తళుక్కున మెరిసింది.

ఆ వెంటనే ఆమె పెదవుల మీద విజయగర్వంతో కూడుకున్న చిరునవ్వు వెల్లివిరిసింది.

అతను చేతిలో చెయ్యి వెయ్యగానే గుండె తీవ్రంగా ప్రతిస్పందిస్తూ వేగంగా కొట్టుకో సాగింది.

## 17

వాళ్ళిద్దరూ బిల్డింగ్‌లోంచి బైటికి రాగానే ఓ పొడవాటి కాంటెస్సా కారొచ్చి వాళ్ళ ముందాగింది. డ్రైవింగ్ సీట్లోంచి యూనిఫాంలో వున్న డ్రైవర్ బయటికొచ్చి శక్తిధర్‌కి సెల్యూట్ చేసి బాక్‌డోర్ తెరిచి పట్టుకున్నాడు.

"ఈ పూట నువ్వు సెలవు తీస్కోవచ్చు. కారు నేనే డ్రైవ్ చేస్తాను" అన్నాడు శక్తిధర్. డ్రైవర్ సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

"ముందు సీట్లో కూచుంటారా వెనకసీట్లో కూచుంటారా మేడం?" అడిగాడు శక్తిధర్.

"నేను వెనకసీట్లో కూచుంటే మీరు నాకు డ్రైవరైపోతారు. వద్దులెండి, ముందు సీట్లోనే కూచుంటాను," నవ్వింది పింకీ.

"ఆల్‌రైట్! ముందు సీట్లోకే రా మరి," అన్నాడతను డ్రైవింగ్ సీట్లోకి ఎగబాకుతూ. పింకీ వచ్చి ముందు సీట్లో కూచుంది.

"మరి నా కారు?" అడిగిందామె.

"రేపు తెల్లవారుజామునే వచ్చి మీ యింటిముందుంటుంది. ఓకే?"

"థాంక్స్!"

"ఆ మాత్రానికే?"

"ఈ వుదయం నేను యాక్సిడెంట్ చేసిన కారిది కాదు."

"అవును. అది టొయొటో. దాని ఫెండర్ విరగ్గొట్టి పెట్టావుగా. అందుకే ఈ కారొచ్చింది."

"మీకెన్ని కార్లున్నాయి?"

"నాకే తెలీదు. మా కంపెనీ బ్రాంచా

# వజ్రసంకల్పం

ఫీసులు ప్రపంచం మొత్తం మీద పధ్నాలుగున్నాయి. ప్రతి ఆఫీసు దగ్గరా నాకు చాలా కార్లున్నాయి. మా క్యూబిక్ జిర్కోనియా సేల్సెంతో తెలుసా? ఏడాదికి 800 మిలియన్ కేరెట్లు. గ్లోబ్‌లో మూడు వంతుల డైమండ్ మార్కెట్ మా చేతుల్లోనే వుంది. సేల్సుద్వారా మాకొచ్చే ఆదాయం ఏడాదికి 300 మిలియన్ డాలర్లు. టోటల్ టర్నోవర్ ఇంకా చాలా ఎక్కువే వుంటుంది."

"వండ్రఫుల్. కానీ, నాకొకటి అర్థం కావడంలేదు. క్యూబిక్ జిర్కోనియా అంటే కృత్రిమ వజ్రం అన్నారు....."

"కృత్రిమ వజ్రం కాదు- మానవనిర్మిత వజ్రం!" ఆమె మాటకు అడ్డొస్తూ అన్నాడతను.

"ఏం, రెంటికీ తేడా వుందా?"

"చాలా తేడా వుంది. కృత్రిమ వజ్రమంటే డూప్లికేట్ వజ్రం. మానవనిర్మిత వజ్రం అలాకాదు. అది అసలు సిసలైన వజ్రం. ప్రకృతి సిద్ధంగా పుట్టిన వజ్రం కాకపోవడం ఒకటే అందులో లోపం. ప్రకృతి సిద్ధంగా పుట్టిన వజ్రంలోని ప్రతి క్వాలిటీ ఇందులో కూడా వుంటుంది. ఎంత గొప్ప నిపుణుడైనా, ఇది ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన వజ్రం కాదని కనుక్కోలేడు. ప్రకృతి మానవజాతికి అరుదుగా ప్రసాదించిన అద్భుతాన్ని మేము విరివిగా అందుబాటులోకి తెస్తున్నాం. క్యూబిక్ జిర్కోనియా అనే మూలపదార్థంతో ఈ వజ్రం తయారౌతుంది. ఇప్పటివరకూ వజ్రాలు ధనవంతులకు మాత్రమే అందుబాటులో వున్నాయి. క్యూబిక్ జిర్కోనియా మార్కెట్లోకొచ్చాక సామాన్యుడు కూడా వజ్రాన్ని కొనగలిగే స్థితి వచ్చేసింది. ఇది డూప్లికేట్ డైమండ్ కాదు. ఆ మాట గుర్తుంచుకో.

"ఆల్ రైట్. ఇది డూప్లికేట్ డైమండ్ కాదు. కానీ, అసలు వజ్రం కూడా కాదు."

"అసలు వజ్రమే!"

"ఎలా? గుండె చెడిపోతే కృత్రిమంగా గుండె ఏర్పాటు చేసినంతమాత్రాన అసలైన గుండె అయిపోతుందా? ఇదీ అంతే!"

"కాదు. గుండె సంగతి వేరు. గుండె సజీవ పదార్థం. వజ్రం నిర్జీవపదార్థం. ప్రకృతి సిద్ధంగా పుట్టనంతమాత్రాన వజ్రం వజ్రం కాకుండా పోదు."

"కనీసం ఖరీదులో అయినా తేడా వుండదా?"

"ఉంటుంది! చాలా వుంటుంది! సరిగ్గా అక్కడే ప్రకృతిసిద్ధమైన వజ్రం క్యూబిక్ జిర్కోనియా మీద దెబ్బతీస్తోంది. ప్యూరిటన్లు చాలా మంది ఆ మాట చెప్పే క్యూబిక్ జిర్కోనియాని కొట్టి పారేస్తున్నారు. వాళ్ళకు నా సమాధానం ఒకటే. ప్రకృతి సిద్ధంగా వజ్రాలు చాలా తక్కువ దొరుకుతున్నాయి. కాబట్టి వాటికంత విలువ. అదే ప్రకృతిలో విరివిగా అవి దొరికి వుంటే అంత విలువ వాటికుండేదా?"

"లేదు."

"అంతే !"

పింకీ ఒక్క క్షణం ఆలోచించింది.

"క్యూబిక్ జిర్కోనియా డూప్లికేట్ డైమండ్ కాదన్నారు. కానీ, డూప్లికేట్ కోహినూర్లు తయారుచేసి పెట్టారెందుకు?"

"క్యూబిక్ జిర్కోనియాతో వున్న ఇబ్బంది అదే. ప్రకృతిలో దొరికే వజ్రాలు లిమిటెడ్‌గా దొరుకుతాయి. కాబట్టి అవి ఏ రూపంలో దొరికాయో ఆ రూపంలోనే వాటిని స్వీకరించాలి. క్యూబిక్ జిర్కోనియా అలా కాదు. మనకిష్టం వచ్చిన ఫాంలో వజ్రాలు తయారు చేసుకోవచ్చు. దాని మూలంగా ప్రపంచ ప్రఖ్యాతి చెందిన వజ్రాల మోడల్‌లోనే కస్టమర్లు వాటిని కోరుకుంటారు. ఓ కోహినూర్, లేదా ఓ జూబ్లీ తమ ఇంట్లో వుండాలని కోరుకోని మనిషి వుంటాడా? కానీ, క్యూబిక్ జిర్కోనియాతో వంద కోహినూర్లు వెయ్యి జూబ్లీలు తయారుచెయ్యొచ్చు; సృష్టికి ప్రతి సృష్టి చెయ్యొచ్చు. అదే క్యూబిక్ జిర్కోనియా ప్రత్యేకత"

"ఈ వజ్రం నిజంగానే సామాన్యుడికి అందుబాటులో వుంటుందా?"

"ఎందుకుండదు? ఉదాహరణకు ఓ ప్రకృతిసిద్ధమైన వజ్రం యాభై వేల డాలర్లు చేస్తుందనుకో- క్యూబిక్ జిర్కోనియాలో అదే వజ్రం అయిదువందల డాలర్లకే కొనుక్కోవచ్చు. ఎవరూ అది యాభై వేల డాలర్లు చేసే వజ్రం కాదన్లేరు. కానీ ఇక్కడో చిన్న తిరకాసుంది. మొదట్లో మా ప్రొడక్టు కేవలం ధనవంతులు మాత్రమే కొనుక్కున్నారు. ఉదాహరణకు ఎలిజబెత్ టేలర్. ఎలిజబెత్ టేలర్ దగ్గర అమూల్యమైన వజ్రాలు చాలా వున్నాయి. అదే షేపులో ఆవిడ క్యూబిక్ జిర్కోనియా వజ్రాలు తయారుచేయించుకుంది. పార్టీల్లో ఆమె క్యూబిక్ జిర్కోనియా ధరిస్తే ఆ విషయం ఎవరూ కనుక్కోలేదు. ఖరీదైన ప్రకృతిసిద్ధమైన వజ్రాలు ఎవరైనా దొంగిలిస్తారేమోననే భయంతో కోటీశ్వరు




బంజారా హాస్పటల్ (హైదరాబాద్), ఇండియన్ మెడికల్ అసోసియేషన సంయుక్త ఆధ్వర్యంలో "అందరికి ఆరోగ్య విజ్ఞానం" అనే సదస్సులో పాల్గొన్న!
శ్రీ కె. చెన్నారెడ్డి (ప్రసంగిస్తున్నవారు) ఐ. ఎం. ఎ. కార్యదర్శి డాక్టర్ గుప్తా, డాక్టర్ ద్వారకానాథ్‌రెడ్డి, డాక్టర్ నాగేశ్వరరెడ్డి, డాక్టర్ మల్లేశ్వరరావు.

లంతా తమ వజ్రాలు సేఫ్టీలాకర్లలో దాచేసి వాటి స్థానంలో క్యూబిక్ జిర్కోనియా బయటికి తెస్తున్నారు. ప్రకృతి సిద్ధమైన వజ్రాల్తో అక్కడే క్యూబిక్ జిర్కోనియా పోటీ పడలేకపోతోంది. ఇప్పుడిప్పుడే సామాన్యులు కూడా ఇది అసలు వజ్రమే అని తెలుసుకుని కొనడానికి ముందుకొస్తున్నారు. వచ్చే నాలుగైదేళ్ళలో మా కంపెనీ ఆదాయం వెయ్యి మిలియన్ డాలర్లు దాటుతుందని అంచనా."

"మైగాడ్"

శక్తిధర్ నవ్వాడు.

"వజ్రమంటే మనిషికెంత మక్కువో చూశావా?" అన్నాడు.

"ఓహ్! క్యూబిక్ జిర్కోనియా గురించి ఇప్పుడు నా అనుమానాలన్నీ తీరిపోయాయి," అంది పింకీ.

"ఆల్‌రైట్ వజ్రాల గురించి కాసేపు మర్చిపోదాం. డిన్నర్ గురించి ఆలోచిద్దాం" అన్నాడు శక్తిధర్.

ట్రాఫిక్ మధ్యలోంచి కాంటెస్సా హుందాగా ముందుకు సాగిపోతోంది. రెండువైపులా స్ట్రీట్‌లైట్స్ వేగంగా వెనక్కెళ్ళి పోతున్నాయి. అతని పక్కన కూర్చుని కార్లో ప్రయాణం చేస్తుంటే సిటీ ఎన్నడూ లేనంత అందంగా కనిపిస్తోంది.

శక్తిధర్ ఓ ఫైవ్‌స్టార్ హోటల్ ఆవరణలోకి కారుపోనిచ్చాడు. పార్కింగ్ స్పేస్‌లో కారాపి పింకీ చెయ్యిపట్టుకొని ముందుకు నడిచాడు.

"ఈ హోటల్ ఎప్పుడూ బిజీగా వుంటుంది," అంది పింకీ.

"పర్వాలేదు. నా కోసం ఇక్కడ ఎప్పుడూ ఓ టేబుల్ రిజర్వ్ చేసే వుంచుతారు," అన్నాడతను. "నువ్వెప్పుడైనా ఈ హోటల్ కొచ్చావా?"

"లేదు. కానీ, ఈ హోటల్ గురించి చాలా విన్నాను. ఎప్పుడైనా విజిట్ చేద్దామనుకుంటుండగానే అనుకోకుండా ఇలా వచ్చేశాను."

అతన్ని చూస్తూనే హెడ్‌వెయిటర్ చకచకా ముందుకొచ్చి వినయంగా నమస్కరించాడు.

"బాల్‌రూంలో ఓ టేబుల్ కావాలి. బెస్ట్ సర్వీస్ కూడా!" అన్నాడు శక్తిధర్.

"ప్లీజ్ కమ్!" అన్నాడు హెడ్‌వెయిటర్.

వాళ్ళిద్దరూ అతన్తోపాటు ముందుకు నడిచారు.

హెడ్‌వెయిటర్ వాళ్ళిద్దర్నీ ఓ ప్రత్యేకమైన టేబుల్ దగ్గరికి పిల్చుకెళ్ళాడు. అదే పనిగా చూస్తే తప్ప ఎవరి దృష్టీ అటువైపు పడదు. జంటగా వచ్చే అతిధులకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన టేబులది.

విండోలోంచి మెర్క్యూరీలైట్లు వెలుతురులో బయట లాన్లోని దృశ్యాలు ఆహ్లాదకరంగా కనిపిస్తున్నాయి.

"బ్యూటిఫుల్" అంది పింకీ.

"మా బెస్ట్ వెయిటర్ని పంపిస్తాను సర్! మేక్ యువర్ సెల్ఫ్ కంఫర్టబుల్" అంటూ వెళ్ళిపోయాడు హెడ్ వెయిటర్.

శక్తిధర్ మెనూ చేతిలోకి తీసుకున్నాడు.

"ఏం తీసుకుంటావ్?"

"ఏదైనా ఫర్వాలేదు. బరువు పెరుగుతానన్న భయం నాకు లేదు" నవ్వింది పింకీ.

"గుడ్! బాగా తిని సన్నబడమన్నారు."

ఇంతలో యూనిఫాంలో వున్న వెయిటర్ వచ్చి వాళ్ళ ఎదురుగా నిలబడ్డాడు. శక్తిధర్ అడిగిన ప్రశ్నలకు వినయంగా సమాధానం చెప్పి ఆర్డర్ నోట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

"కాస్త ఆలస్యమైనా ఏం ఫర్వాలేదు," అతను వెళ్తుండగా వెనకనుంచి అన్నాడు శక్తిధర్. తర్వాత పింకీ వైపు తిరిగాడు.

"వెరీగుడ్!"

"ఏమిటి వెరీగుడ్?" అడిగింది పింకీ.

"నువ్వు కట్టుకున్న చీర. నువ్వు గమనించావో లేదో-మనిద్దరి డ్రెసెస్ మేచవుతున్నాయి. ఇది కాకతాళీయమేనంటావా?"

"కాక? మీరే సూట్ వేసుకుంటారో వూహించే వచ్చాననంటారా?"

"ఒక్కోసారి కాకతాళీయంగా జరిగే విషయాలు కూడా చాలా అందంగా వుంటాయి కదూ?"

ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి.

"బ్యూటిఫుల్," అన్నాడతను.

"యూ సిల్లీ!" నవ్వేసిందామె.

అతను చెయ్యి ముందుకు చాచి ఆమె చెయ్యందుకున్నాడు. అతని ప్రవర్తనలోగానీ అతని మాటల్లోగానీ ఎక్కడా కోపగించుకోవలసిందేమీ కనిపించడంలేదు. చనువుగా వుంటూనే మర్యాదగా ప్రవర్తించ గలగడం ఓ కళ. ముఖ్యంగా అమ్మాయిల విషయంలో అతని ప్రవర్తనలో ఏకోశానా అతిశయం లేదు.

లేక....తనలా భావిస్తోందా?

అతనిపట్ల తనకు కలుగుతున్న ఆకర్షణ అలా భావించేలా చేస్తోందా? అతనుకాక మరొకరెవరైనా తన చెయ్యి పట్టుకుంటే తనేమనుకుంటుంది? చెయ్యి పట్టుకోవడంలో కూడా ఎంత హుందాగా ప్రవర్తిస్తున్నాడితను.

ఆమెకు హఠాత్తుగా ప్రభు గుర్తుకొచ్చాడు.

ఈ సమయంలో ప్రభు తనని చూస్తే ఏమైపోతాడో!

పాపం ప్రభు!

ఆమె వెంటనే ప్రభుని తన ఆలోచనల్లోంచి పక్కకు తోసేసింది.

"ఏమిటి మౌనంగా కూర్చున్నావు?" అడిగాడతను.

"ఏమీలేదు."

"నేనేమైనా అనుచితంగా ప్రవర్తిస్తున్నానా?" చెయ్యి వెనక్కి తీసుకున్నాడు. ఆ ప్రశ్న ఆమె వూహించనిది. ఆమె కళ్ళు చేపల్లా చలించాయి.

"నోనో!" తనే చెయ్యి ముందుకు చాచి అతని చెయ్యందుకుంది.

అతను అందంగా నవ్వేడు.

"నీ చెయ్యిలా పట్టుకుని ఎంతసేపైనా కూర్చుండిపోవాలనిపిస్తోంది."

"కూర్చోండి!" చిలిపిగా అందామె.

అతను తల అడ్డంగా వూపేడు.

"అది సాధ్యం కాదు."

"ఏం?"

"రేపు నేనిక్కడ్నించి వెళ్ళి పోతున్నాను."

హఠాత్తుగా ఆమె మనసు వుదాసీనంగా అయిపోయింది.

తమ పరిచయం తాత్కాలికమేనన్న వూహకూడా ఆమెకు తట్టలేదు. అప్పటివరకూ. ఎక్కడికి వెళ్తున్నావని గానీ ఎప్పుడు తిరిగొస్తావనిగానీ అడగలేదు.

ఏమని అడుగుతుంది.

తనూ అదే పరిస్థితిలో వుంది.

మణిపురం వెళ్ళాల్సిన మిషన్ ఆమెకు గుర్తుకొచ్చి గుండె బరువెక్కింది. ఆ మిషన్ లేకపోయి వుంటే బహుశా ఎక్కడికీ వెళ్ళొద్దు. ఇక్కడే వుండిపొమ్మని చెప్పేసి వుండేదేమో కూడా. తనా మాట చెప్పాక అతనేం సమాధానం చెప్పి వుండే వాడనేది వేరే ప్రశ్న.

ఆమె ముఖకవళికలు మారడం గమనించి అతనే అన్నాడు-

"మళ్ళీ ఎప్పుడు తిరిగొస్తానో తెలీదు"

అప్పటికీ ఆమె మాట్లాడలేదు.

అవును, అతను వెళ్ళిపోతాడు. తానూ వెళ్ళిపోతుంది.

అతని జ్ఞాపకాలు మోసుకుంటూ వెళ్ళిపోతుంది. మళ్ళీ కలుసుకోగలరో లేదో కూడా తెలీదు. అతని ప్రపంచం వేరు. తన ప్రపంచం వేరు.

"మళ్ళీ కలుసుకోగలమో లేదో తెలీదు," ఆమె మనసులోని మాటే అతనూ అన్నాడు.

ఆమె చప్పున కళ్ళుపైకెత్తి అతని కళ్ళలోకి చూసింది.

ఏమిటిది?

ఏమిటీ విచిత్రం?

అతన్తో తనకు పరిచయమై ఎంతసేపైంది. ఒక్క రోజు కేవలం ఒక్కరోజు పరిచయంలో ఇద్దరు వ్యక్తులు ఇంత దగ్గర కాగలరా? ఈ అనుభూతి తాత్కాలికం కాబోలు! లేక..... శాశ్వతమా? ఆమె ఇదమిత్థంగా ఏదీ తేల్చుకోలేకపోయింది.

ఆమె కళ్ళలోకి చూస్తూ అతను హఠాత్తుగా వుద్వేగపూరితంగా అన్నాడు-

"మనం కలుస్తాం. మళ్ళీ ఎప్పుడో ఎక్కడో కలుస్తాం. తప్పకుండా కలుస్తాం"

అప్రయత్నంగా అతని చెయ్యి ఆమె చేతిమీద బిగుసుకుంది.

ఆమె సమాధానం చెప్పలేదు.

## ఆరవసారి ముఖ్యమంత్రి

మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ శరద్ పవార్ వరుసగా ఆరవసారి శాసనసభకు ఎన్నికై రికార్డు సృష్టించారు. 88 వేలకు పైగా ఓట్ల తేడాతో విజయం సాధించిన శ్రీ పవార్‌కు 85.8 శాతం ఓట్లు పోలయి, ఆయనతో పాటు పోటీ చేసిన ఎనిమిది మంది అభ్యర్థులు డిపాజిట్లు కోల్పోయారట. తన స్వంత నియోజక వర్గమైన బారామతిలో ఆయనసలు ప్రచారం చేసుకోకపోవటమే చెప్పుకోదగిన విశేషం. శ్రీ పవార్‌పై పోటీ చేసిన తిరుగుబాటు కాంగ్రెస్ (ఐ) అభ్యర్థికి 11.6 శాతం ఓట్లు మాత్రమే పోలయ్యాయట. అంతేగాక తమ ఓటమి ఖాయమనుకున్న జనతాదళ్, శివసేన అభ్యర్థులు ముందుగానే పోటీ నుంచి తప్పుకున్నారంటే శ్రీ పవార్ పరపతి ఏపాటిదో వూహించుకోవచ్చు.



కానీ, ఆమె కళ్ళు సమాధానం చెప్పాయి.

నీమాట నిజం కావాలి.

నీ మాట నిజం కావాలి.

తన రెండో చెయ్యి అతని చేతి మీద వేసి మృదువుగా నొక్కింది. ఏదో చెప్పడానికన్నట్టు ఆమె పెదవులు కదలబోతున్నాయి.

ఇంతలో ఆర్డరిచ్చిన పదార్థాలతో ట్రాలీ తోసుకుంటూ అక్కడికొచ్చాడు వెయిటర్.

వాళ్ళిద్దరూ చేతులు వెనక్కి తీసుకున్నారు.

వెయిటర్ సర్వ్ చేసి వెళ్ళిపోయాడు.

ఆమె మౌనంగా సూప్‌కంటైనర్ పైనుంచి మూత తీసి పక్కన పెట్టి పరధ్యానంగా కూర్చుంది.

"అంతలోకే ఏమైంది?" మళ్ళీ మామూలుగా మారిపోతున్న వాడిలా అన్నాడతను.

"ఏమీలేదు" పరధ్యానంగానే సమాధానం ఇచ్చిందామె.

అతను సూప్ సిప్ చేస్తూ, "కమాన్, హేవిట్!" అన్నాడు.

ఆమె పరధ్యానంగానే సూప్ సిప్ చేయబోయి స్పూన్ కింద పెట్టేసింది.

"ఏమైంది?" అడిగాడతను.

"చాలా వేడిగా వుంది"

"నాకేమీ లేదే"

"ఒక్కొక్కరి అలవాటు," నవ్విందామె.

"పదార్థాలు వేడిగా వుంటే నేనస్సలు ముట్టుకోలేను"

"వేడి పదార్థాలు తిని నోరు కాల్చుకునే వాళ్ళని చూస్తే నాకో కథ గుర్తుకొస్తుంది" అన్నాడతను.

"ఏ కథ?"

"మనిషి మొట్టమొదట వంట చేయడం ఎలా మొదలు పెట్టాడో నీకు తెలుసా?"

"తెలీదు"

"ఆదిమానవుడు మొట్టమొదట అడవుల్లో వుంటూ పచ్చిమాంసం తినేవాడు అవునా?"

ఆమె తలూపింది.

"కొన్నాళ్ళకు అతను జంతువుల్ని మచ్చిక చేసుకుని పెంచుకుంటూ వాటిని కోసుకుతినడం మొదలెట్టాడు. ఒకరోజు ఏదో కారణం చేత ఓ గుడిసె తగలడిపోయింది. గుడిసెతో పాటు కొన్ని పెంపుడు పందులు కూడా కాలిపోయాయి. గుడిసె యజమాని, 'అయ్యో నా పంది' అనుకుంటూ భయపడుతూనే చూపుడు వేలు పెట్టి దాన్ని నొక్కి చూశాడు. వెంటనే చూపుడు వేలు కాలిపోయింది. కాలిన వేలుని చటుక్కున నోట్లో పెట్టుకున్నాడు. వేలికంటుకున్న మాంసంతో నోరు కూడా కాలిపోయింది. నోరు కాల్తే కాలిందిగానీ కాలిన మాంసం రుచి నోటికి కమ్మగా తగిలింది. అప్పట్నుంచీ ఆ అడివిలో రోజుకో గుడిసె కాలిపోవడం మొదలెట్టింది. మనిషి మొట్ట మొదట వంట అలా చెయ్యడం మొదలెట్టాడన్న మాట!"

పింకీ ఆ కథ విని అప్రయత్నంగానే పకపకా నవ్వడం మొదలెట్టింది.

"కథ బావుంది కానీ, పంది మాంసం... వేక్!" అంది వెగటుగా మొహం పెడుతూ.

"ఏం అంత వెగటుగా మొహం పెట్టావ్? కొన్ని ఆదిమజాతుల వాళ్ళు ఇంకా ఏమేం తినేవాళ్ళు చెప్పమంటావా?"

"బాబోయ్, వద్దు! డిన్నర్‌కని పిల్చుకొచ్చి మీరు నన్నిలా ఏడిపించడం అన్యాయం!"

"అయితే కానీ మరి!"

పింకీ హుషారుగా మళ్ళీ స్పూనందుకుంది. అతని మాటల్తో హఠాత్తుగా ఆమె మళ్ళీ మామూలు పింకీ అయిపోయింది. తను



## జాకీ-అనిల్ జంట

ఒక జంట గురించి చెప్పుకొనేప్పుడు రాజు-రాణిని పర్యాయపదాలుగా వాడుకుంటాము. కాని హిందీ చిత్రపరిశ్రమ మాత్రం యిప్పుడు జాకీష్రాఫ్- అనిల్ కపూర్‌లను జంటగా భావిస్తున్నారు. వీళ్లిద్దరూ లేని చిత్రమంటూ లేదు సరి కదా వీళ్లుంటే ఆ చిత్రం తప్పకుండా విజయవంతమవుతుందని గట్టి నమ్మక మేర్పడిపోయింది. వీళ్లు చివరికి బద్ధ శత్రువులవుతారే మోనంటున్నారు పరిశ్రమలోని వాళ్లు.

మాటల్తో ఎదుటివాళ్ళ మనసులో తేలిక పరచగలశక్తి అందరికీ వుండదు. ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ డిన్నర్ ముగించారు.

ఇంతలో బాల్‌రూంలో డాన్స్ ప్రారంభమైంది. యువతీ యువకులు జంటలు జంటలుగా చేరి డాన్స్ చేస్తున్నారు.

అతను హుందాగా లేచి నిలబడి ఆమెకు తన చెయ్యందించాడు.

ఆమె అతని కళ్లలోకి చూసి చిరునవ్వుతో ఆ చెయ్యందుకుంది.

ఇద్దరూ కలిసి డాన్స్ చెయ్యటం మొదలెట్టారు. ఆమె ఓ చెయ్యి అతని భుజంమీద వేసింది. అతనో చెయ్యి ఆమె నడుంమీద వేశాడు. తక్కిన రెండు చేతులూ కలుపుకుని ఒకళ్ల కళ్లలోకి ఒకళ్లు చూచుకుంటూ డాన్స్ చేయడం ప్రారంభించారు.

డయాస్ మీదనుంచి ఆర్కెస్ట్రా మ్యూజిక్ సున్నితంగా వినిపిస్తోంది.

అలవోకగా గాలిలో తేలిపోతున్నట్లుగా మొదట డ్యాన్స్ ప్రారంభించిన ఆ ఇద్దరూ క్రమంగా డాన్స్ వేగం పెంచారు.

వాళ్ల డాన్స్‌తోపాటే ఆర్కెస్ట్రా సంగీతం కూడా క్రమంగా పెరుగుతూ ఉధృతరూపం దాల్చింది.

వాళ్లిద్దరూ బయటి ప్రపంచంతో తమకేమీ సంబంధం లేనట్లుగా శరవేగంగా డాన్స్ చేయడం మొదలెట్టారు.

కొంతసేపటికి ఆ హాల్లో వున్న మిగతా జంటలన్నీ డాన్స్ చెయ్యడం ఆపేసి వాళ్లిద్దరివైపే చూస్తూ నిలబడిపోయారు.

వాళ్లిద్దరి డాన్స్ చరమాంకంలోకి ప్రవేశించగానే ఆర్కెస్ట్రా సంగీతం మరింత ఉధృతమైంది. ప్రతి ఒక్కరూ ఊపిరి బిగపట్టి వాళ్ల డాన్స్ చూస్తున్నారు.

పింకీ బొంగరంలా అతని చుట్టూ గిరగిర తిరుగుతూ కీ ఆగిపోయిన బొమ్మలా చటుక్కున నిలబడిపోయి అతని చేతుల్లో వాలిపోయింది.

అంతే !

ఆ హాలునిండా చప్పట్లు మారుమోగిపోయాయి.

అప్పటిగ్గానీ వాళ్లిద్దరూ మళ్లీ ఈ లోకంలోకి రాలేకపోయారు. తమచుట్టూ నిలబడిపోయి చూస్తున్న జంటల్ని గమనిస్తూనే పింకీ కళ్లు హఠాత్తుగా సిగ్గుతో వాలిపోయాయి. బుగ్గలు ఎర్రగా కందిపోయాయి. చప్పట్లు ఆగకుండా ఇంకా వినిపిస్తూనే వున్నాయి.

ఈ కోలాహలం చూసి బాల్‌రూంలోకొచ్చిన మేనేజర్ ఉత్సాహం పట్టలేక డయాస్‌మీదికెళ్లిపోయి మైక్ తన చేతుల్లోకి తీసేసుకున్నాడు.

"లేడీస్ అండ్ జంటిల్మన్" మా హోటల్లో ఈ బాల్‌రూం ప్రారంభించినప్పటినుంచి ఇంత అద్భుతమైన డాన్స్ ఏ జంటా ప్రదర్శించడం నేను చూడలేదు. త్రీ ఛీర్స్ టు ది వండ్రపుల్ పెయిర్."

మరోసారి చప్పట్లతో ఆ బాల్‌రూమ్ మార్మోగిపోయింది.

మేనేజర్ చెప్పడం ఆపలేదు.

"ఈరోజు మా బాల్‌రూమ్‌లో వాతావరణాన్ని ఎలెక్ట్రిఫై చేయగలిగిన ఈ జంటకు మా హోటల్ తరపున ఓ షాంపేన్ బాటిల్ ప్రజెంట్ చేస్తున్నాం! సో, గివ్ దెమ్ ఎ బిగ్ హేండ్ !"

ఈసారి కురిసిన చప్పట్ల వర్షానికి అంతే లేకుండా పోయింది.

మేనేజర్ డయాస్ దిగుతూనే హెడ్ వెయిటర్ ఓ పెద్ద షాంపేన్ బాటిల్ తెచ్చి అతని చేతికిచ్చాడు. మేనేజర్ మహోత్సాహంగా ఆ బాటిలందుకుని శక్తిధర్‌కి ప్రజెంట్ చేశాడు. మళ్లీ చప్పట్లు.

"వుయ్ ఆర్ రియల్లీ ప్రౌడాఫ్ యూ మిస్టర్ శక్తిధర్. ఎప్పట్లాగే మీరు మా హోటల్ని రెగ్యులర్‌గా విజిట్ చెయ్యాలని మా కోరిక. విజిట్ చేసిన ప్రతిసారీ ఈ వండ్రపుల్ లేడీనికూడా వెంట తీసుకురావాలి సుమా !"

శక్తిధర్ కళ్లు అద్భుతమైన తేజస్సుతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాయి.

"తప్పకుండా ! మేమొచ్చిన ప్రతిసారీ ఓ షాంపేన్ బాటిల్ రెడీగా ఉంచండి" అన్నాడతను.

మేనేజర్ పళ్లు కదిలిపోయేట్టు బిగ్గరగా నవ్వాడు.

"ష్యూర్, ష్యూర్ ! వైనాట్ ? మీలాంటి విజిటర్స్‌తో మా హోటల్ హోదా పెరుగుతుంది మిస్టర్ శక్తిధర్"

శక్తిధర్ పైకప్పనంటుతున్న చప్పట్ల మధ్యన పింకీ నడుంమీద చెయ్యివేసి హోటల్లోంచి బయటికి నడిపించుకుంటూ వచ్చాడు.

పింకీకి నేలమీద నడుస్తున్నట్లుగా లేదు. మేఘాలమీద తేలిపోతున్నట్లుగా వుంది. వాలిపోతున్న కళ్లతో అతని భుజంమీద తలవాల్చి అతనివెంట నడిచింది.

అతను మృదువుగా ఆమె చెయ్యి పట్టుకుని కారుదాకా నడిపించుకొని వెళ్లి ఫ్రంట్‌డోర్ తెరిచి పట్టుకున్నాడు. ఆమె అతని కళ్లలో ఏదో వెతుకుతున్నట్లుగా చూసి కారెక్కి కూచుంది. అతను గంభీరంగా నడుచుకుంటూ వెళ్లి డ్రైవింగ్ సీట్లో కూచుని కారు స్టార్ట్‌చేసి రివర్స్‌గేర్‌లో రివ్వున పార్కింగ్‌లోంచి వెనక్కు తీసుకొచ్చి చకచకా గేరు మార్చి ముందుకు పోనిచ్చాడు. క్షణాలమీద హోటల్ ఆవరణ దాటి రోడ్డుమీద కొచ్చేసింది కాంటెస్సా.

"ఆ మేనేజర్‌తో అబద్ధమెందుకు చెప్పారు?" నెమ్మదిగా అడిగింది పింకీ

"అబద్ధమా ?"

ఆమె మౌనంగా తలూపింది.

"అంటే ?"

"మనిద్దరం తిరిగి ఆ హోటల్ విజిట్ చేస్తామని !"

ఆ మాట వింటూనే హఠాత్తుగా అతని మొహం మరింత గంభీరంగా మారిపోయింది. చూపులు ముందుకు తిప్పేసుకుని మౌనంగా డ్రైవ్ చేయనారంభించాడు. అతని ముఖ కవళికలు గమనిస్తే అతనేదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడనిపించింది. పింకీ మళ్లీ మాట్లాడలేదు. మౌనంగా కూర్చుండిపోయి అతని ముఖ కవళికలు గమనిస్తూ ఉండిపోయింది.

కాసేపటి తర్వాత అతను నెమ్మదిగా ఆమెవైపు మొహం తిప్పాడు.

"మీ ఇల్లెక్కడ ?"

పింకీ చెప్పింది.

అతను మళ్లీ మౌనంగా డ్రైవ్ చేయసాగాడు.

పింకీ చెప్పిన అపార్ట్‌మెంట్స్ బిల్డింగ్ చేరుకునేదాకా వాళ్లిద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు.

శక్తిధర్ కారాపేసి కిందికి దిగి మౌనంగా ఆమెవేపు డోరు తెరిచి పట్టుకున్నాడు. పింకీ కారు దిగి అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది. ఆమె కళ్ళల్లో శతకోటి భావాలు మెదులుతున్నాయి. ఆమె అలా చూస్తుండగానే అతను ఆమె చెయ్యందుకుని మృదువుగా నొక్కి వదిలాడు.

"గుడ్‌బై పింకీ!"

అంతే!

అతనా మాటనగానే ఆమె చేతులు అతని మెడచుట్టూ లతల్లా పెనవేసుకుపోయాయి.

ఆమె పెదవులు ఆత్రంగా ఆర్ద్రంగా అతని పెదవుల వైపు సాగిపోయాయి. అతని చేతులు అప్రయత్నంగా ఆమె చుట్టూ బిగుసుకున్నాయి.

కొద్ది క్షణాల సేపు అలాగే వుండిపోయి ఆమె అతని చేతుల్లోంచి చప్పున వెనక్కి జరిగింది.

"గుడ్ బై!" ఆ మాటంటూనే రివ్వున వెనక్కి తిరిగి తన అపార్ట్‌మెంట్ వైపు ఒక్క పరుగుతీసింది.

ఆమె కళ్ళ నుంచి అప్రయత్నంగా కన్నీళ్ళు జారిపోతున్నాయి.

అతను స్థాణువులా వున్న చోటే నిలబడిపోయి ఆమె వెళ్ళిపోతున్న వైపే కళ్ళప్పగించి చూస్తూండిపోయాడు. భారంగా కొట్టుకుంటున్న గుండె అరచేత్తో రాసుకుంటూ వుండిపోయాడు,

గాలీ ఓ గాలీ,

ఇదేలాటి సమయం?

రాత్రీ ఓ రాత్రీ,

ఇదేలాటి పరిచయం?
పెదవులిచ్చిన ముద్దు గుండెలో దిగుతోంది!
గుండె కదిలిన సద్దు అరచేయి వింటోంది!
పెదవిపై ఈ ముద్దు రగిలిపోయే పొద్దు,
అరచేత ఈ గుండె నలిగిపోయే పొద్దు,
గాలీ ఓ గాలీ,
తన్నంటి వచ్చి నన్నంటి మళ్ళు,
రాత్రీ ఓ రాత్రీ,
ఈ పరిచయం కొనసాగిరచి వెళ్ళు.
కానీ, అతనికి తెలుసు-
ఇది తిరిగిరాని రేయి.
అది చెరిగిపోని ముద్దు.
అతను భారంగా నిట్టూర్చి నెమ్మదిగా వెనక్కి తిరిగాడు.
అంతే!
ఒక్కసారిగా అదిరిపడ్డాడు.
అతని కెదురుగా గేటు దగ్గర ఓ వృద్ధుడు నిలబడి వున్నాడు. గాలిలో అతని బారాటి గడ్డం రెపరెపలాడుతోంది. తీక్షణంగా తన వైపే చూస్తు న్నాడు.
కళ్ళలో కళ్ళు కలిపి ఆ ఇద్దరూ కొద్ది క్షణాలు ఒకర్నొకరు చూసుకుంటూ అలాగే నిలబడి పోయారు.

## 18

కనుదోయి నిదుర కరువైన వేళ
మధుపాయి కెదుట పువులేని వేళ
నిట్టూర్పు సెగకు మితిలేని వేళ
ప్రాణాలు తుదకు పోతున్న వేళ.

నీ కరస్పర్శ కలిగినప్పుడు నా ఇంద్రియాలు పనిచేయలేదు. నా చైతన్యాన్ని భ్రమింపజేస్తూ మూర్ఛలో ముంచుతున్న ఈ వికారం- సుఖమా? దుఃఖమా? మోహమా- నిద్రావస్థా? విషప్రసారమా? మృత్యువా? నేను చెప్పలేక పోతున్నాను.

ఆమె కనురెప్పలు తెరిచి పెట్టుకుని పైకప్పుకేసి చూస్తూ పడుకుంది. సూర్యోదయమై చాలాసేపైనా పక్కమీద నుంచి లేవాలనిపించడం లేదు.

## వజ్రసంకల్పం

ఎంతలో ఎంతమార్పు తనలో!

ఒక్కరోజులో ఇంతమార్పు మనిషిలో కలుగుతుందా?

ఒక్కరోజులో ఒక్క మనిషి ఇంతమార్పు కలిగించగలడా?

నిన్నటిదాకా ఏమిటితను?

నిన్నటిదాకా ఏమిటి తన మనసు?

నిన్నటిదాకా ఏమిటి తన ఆలోచన?

నిన్నటిదాకా ఏమిటి తన విలువలు?

ఇప్పుడేమిటి తను?

ఇప్పుడేమిటి తన మనసు?

ఇప్పుడేమిటి తన ఆలోచన?

ఇప్పుడేమిటి తన విలువలు?

ఆమె ఇదమిత్థంగా ఏదీ తేల్చుకోలేక పోతోంది.

ఇలాంటి వూహలు కలగడం అబద్ధం అనుకుంది.

ఇలాంటి వూహలు కలగడం బలహీనత అనుకుంది.

ఇలాంటి వూహలకు తను అతీతమనుకుంది.

ఇలాంటి వూహల్లోనే ఇప్పుడు గుండెదాకా మునిగిపోతోంది.

క్రితంరోజు జరిగిన సంఘటనలన్నీ వరసగా గుర్తుచేసుకో సాగింది.

అతనికారుకి తను యాక్సిడెంట్ చేయడం, రెండుకార్ల ఫండర్లూ విరిగిపోయి ఒకదాంట్లో ఒకటి ఇరుక్కుపోవడం, ఆ కార్లోంచి అతను హుందాగా దిగడం, తనకారు అవలీలగా పైకెత్తి ఇరుక్కుపోయిన ఫెండర్లు విడదీయడం (ఆ పని సామాన్యుడు చెయ్యగలడా?), అతని విజిటింగ్ కార్డుచూసి తను సాయంత్రం అతన్ని కలుసుకోవాలని నిర్ణయించుకోవడం, సాయంత్రం అతన్ని కలుసుకున్నాక జరిగిన అనుభవాలూ ఒకదాని తర్వాత ఒకటి సినిమారీలులా ఆమె మస్తిష్కంలో తిరుగుతున్నాయి. అతనికి వీడుకోలు చెప్పేటప్పుడు మోహావేశంలో తను అతనికి ముద్దివ్వడం కూడా గుర్తొచ్చింది. వెంటనే ఆమె తనలో తనే సిగ్గుపడిపోయింది. బుగ్గలు వెంటనే కందిపోయాయి.

అదే... అదే తనలో వచ్చిన మార్పు.

ఆమె అలా ఆలోచిస్తూనే క్రితంరోజు సాయంత్రం అతన్నెందుకు కలవాలనుకుందో జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నించింది.

క్యూబిక్ జిర్కోనియా!

ఆ మాట గుర్తుకురాగానే ఆమె చివాలున మంచంమీద లేచి కూచుండి పోయింది.

ఎంత పొరపాటు చేసిందితను!

అతనిపట్ల ఆకర్షణలో మునిగిపోయి అసలతన్ని తను కలుసుకున్న పనే మర్చిపోయింది.

క్యూబిక్ జిర్కోనియా!

అవును, క్యూబిక్ జిర్కోనియా!

నిన్న డిన్నర్ ముగిసిం తర్వాత అతన్నో కోరిక కోరతాననడం వెంటనే గుర్తుకొచ్చింది. ఆ కోరిక కోరకుండానే తను తన అపార్ట్‌మెంటుకి తిరిగొచ్చేసింది.

ఆ విషయం గుర్తుకురాగానే ఆమె నావరించిన మోహావేశపు మత్తు వదిలిపోయింది.

ఆ కోరిక కోరాలి.

ఇప్పుడే ఆ కోరిక కోరాలి.

ఆమె చప్పున మంచంమీదనుంచి టెలిఫోన్ దగ్గరికిపరిగెత్తింది. రిసీవర్ చేతిలోకి తీసుకుంది. నెంబర్ డయల్ చేయబోతూ

ఆగిపోయింది.

నెంబర్!

ఏ నెంబర్ డయల్ చేయాలి తను?

ఆమె గుర్తుకు తెచ్చుకోడానికి ప్రయత్నించింది.

అతని విజిటింగ్ కార్డుమీద నిన్న చూసిందతని టెలిఫోన్ నెంబర్.

డామిట్ !

ఇప్పుడా విజిటింగ్ కార్డెక్కడ పెట్టేసిందో కూడా గుర్తురావటంలేదు.

రిసీవర్ ధనామని క్రెడిల్‌మీద పడేసి గదిలో పచార్లుచేస్తూ వేగంగా ఆలోచించడం మొదలెట్టింది.

అతనీ రోజు వెళ్లిపోతానన్నాడు. అతను వెళ్లేలోపలే అతన్ని కాంటాక్ట్ చెయ్యగలగాలి.

లాభంలేదు.

ఇలా టెన్షన్ ఫీలైతే లాభం లేదు.

కూల్‌గా కూర్చుని జ్ఞాపకం తెచ్చుకోవాలి.

ఆమె కుర్చీలో కూర్చుండిపోయి ఆ నెంబర్ మననం చేసుకోసాగింది. నిదానంగా కూర్చుని ఆలోచించడంతో వర్సగా కొన్ని నెంబర్లు మస్తిష్కంలో తిరగసాగాయి. ఆ నెంబర్లన్నీ ట్రైచేస్తే?

పింకీ మరోసారి రిసీవరందుకొని చకచకా ఓ నెంబర్ డయల్ చేసింది.

"హలో! దిసీస్ కృష్ణాఫర్టిలైజర్స్!" వినిపించింది.

"సారీ, రాంగ్ నెంబర్!"

లైన్ డిస్కనెక్ట్‌చేసి మరో నెంబర్ ట్రైచేసింది.

ఈసారికూడా రాంగ్‌నెంబర్.

ఎలా?

ఇప్పుడెలా?

ఎలాగైనా అతన్ని కాంటాక్ట్ చెయ్యగలగాలి.

మరో నెంబర్...!

మరో నెంబర్....!

మరో నెంబర్....!

ఊ హు, లాభం లేకపోయింది.

ఫ్రస్ట్రేషన్‌తో కుర్చీలో వెనక్కివాలి కూర్చుండిపోయింది.

హఠాత్తుగా ఆమె దృష్టి ఎదురుగా టేబుల్‌మీదున్న ఓ వస్తువుమీద పడింది.

టెలిఫోన్ డైరెక్టరీ!

ఆమె తనని తనే నమ్మలేకపోయింది.

తన సమస్యకు ఎంత సింపుల్ పరిష్కారం!

కొన్ని వేలసార్లు ఆ డైరెక్టరీ ఉపయోగించి వుంటుంది. అయినా, ఇప్పుడెందుకు తనకది గుర్తుకురాలేదు?

ఆమె చటుక్కున డైరెక్టరీ అందుకుని పేజీలు తిరగేయనారంభించింది.

వర్మ క్యూబిక్ జిర్కోనియా....

వర్మ క్యూబిక్ జిర్కోనియా.....

కొద్ది క్షణాల్లోనే ఆమెకు కావల్సిన నెంబర్ దొరికింది.

వెంటనే టెలిఫోన్ డైరెక్టరీ పక్కన పడేసి పకపకా నవ్వుకోనారంభించిందామె.

ప్రేమించడం మొదలుపెడితే ఇలాంటి మతిమరుపే కలుగుతుందని కవులు కావ్యాల్లో వర్ణిస్తుంటారు.

అతనిపట్ల తనకు కలిగిన అనుభూతి ప్రేమా?

భ్రాంతా?

ఏమో!

మళ్లీ ఆలోచనలు!

ఇలాగే ఆలోచిస్తూ కూచుంటే మళ్లీ పరధ్యానంలో కెళ్లిపోతుంది. అతని ధ్యానంలో కెళ్లిపోతుంది.

ఆమె బలవంతంగా తనని తాను అదుపులో పెట్టుకుని ఆ నెంబర్ డయల్ చేసింది.

వెంటనే అవతల్నుంచి రికార్డింగ్‌లో తియ్యని గొంతు వినిపించింది.

"హలో! ఇది శ్రీ శక్తిధర్ పర్సనల్ నెంబర్, శ్రీ శక్తిధర్ మీకిప్పుడు దొరకరు. ఎన్నాళ్ల తర్వాత తిరిగొస్తారో తెలీదు. మీరు మాట్లాడదలిస్తే వారి సెక్రటరీతో మాట్లాడొచ్చు." ఆ మాటతో రికార్డింగ్ ఆగిపోయింది.

ఆమె హతాశురాలై కూచుండిపోయింది.

యాంత్రికంగా వినిపించిన ఆ గొంతు కూడా అనుకోకుండా ఆ చేదునిజం తనకు గుర్తుచేస్తున్నట్టుగా వుంది.

"శ్రీ శక్తిధర్ మీకిప్పుడు దొరకరు!"

"శ్రీ శక్తిధర్ మీకిప్పుడు దొరకరు!"

అవును!

శక్తిధర్ తనకిప్పుడు దొరకడు.

అంతా అయిపోయింది.

ఒక్కనాటితో ఆ తియ్యనికల ముగిసిపోయింది.

హఠాత్తుగా ఆమె గుండెనెవరో పిండేసినట్టుగా అనిపించింది. రిసీవర్ క్రెడిల్ చేయడంకూడా మర్చిపోయి ఆమె అలాగే కూర్చుండిపోయింది. గుండెలో ఏదో ఖాళీ ఏర్పడినట్టుగా అనుభూతి.

అంతలోనే ఆ రికార్డింగ్ తిరిగి వినిపించసాగింది.

"హలో! ఇది శ్రీ శక్తిధర్ పర్సనల్ నెంబర్. శ్రీ శక్తిధర్ మీకిప్పుడు దొరకరు.

**సి.హెచ్.ఎల్.ఎన్. రావు, గరిడేపల్లి**

మనిషి పెళ్లి చేసుకుంటే మంచిదా? బ్రహ్మచారిగా వుంటే మంచిదా అని మిత్రుడిని అడిగితే సోక్రెటిస్ 'ఈ రెండింటిలో ఏ దారిన వెళ్ళినా దానిబదులు రెండోదారి బాగుండేదనిపిస్తుందన్నాట్ట' మీరేమంటారు ?

*సోక్రెటిస్ చెప్పక్కరలేదు-యీ విషయం అక్షరైపచ్చ అన్నది మానవస్వభావం, అయినా సోక్రెటిస్ నాకిష్టం-పెళ్లాం విషం యిచ్చినా హాయిగా త్రాగాడు!

**నీలం నర్సింగరావు, అలమండసంత**

ఎదుటివారి తప్పులు వేలెత్తి చూపడంగాని తమ తప్పులు తెలుసుకోని వారిని ఏమనాలి?

* 'ఆ మన తప్పులు ఎవరో చూపిస్తూనే వుంటారు' అని నిశ్చింతగా వుండే - తెలివైనవాళ్లు.

రాజకీయం అంటే మీ ఉద్దేశ్యం?

* అదో రకం చేతబడిలా తోస్తూంది! (అంటే ఏమిటి అని అడక్కండి-)

**న్యాయపతి రమేష్‌బాబు, హైదరాబాదు**

మంచివాళ్లు ఈ భూమ్మీద ఎక్కువ రోజులు ఎందుకు వుండరు?

* ఎవరు చెప్పారలా? ఉన్న వాళ్లలో చాలామంది మంచివాళ్లున్నారు!



## ప్రశ్నావళి
### - కె. రామలక్ష్మి

అన్యాయాలు అక్రమాలు దగాలు మోసాలు చేసేవారి పక్షాన్నే ఆ భగవంతుడు వుంటున్నాడు.

* లేకపోతే వాటి గురించి ఎలా తెలుస్తుంది? తెలియకపోతే ఎలా అరికడతాడు?! మన హీరోలు రౌడీలయినంత మాత్రాన జనకళ్యాణం కోరుకుంటున్నామని చివరికి నిరూపించడంలేదు - (అప్పటిదాకా జరిగిన హింసాకాండ, మీరు మరిచిపోయి - ఆనందించరూ?!)

తమ్ముడు ఇంకో నాలుగు గంటలలో చనిపోతాడని తెలిసీ యింటికి వచ్చి హాయిగా నిద్రపోయే అన్నను ఏమంటారు మేడమ్?

* దాయాదిలాగా ప్రాణం పోయేదాకా నిలబడి చూసేకంటే యిది మంచిపనే. పడుకుని నిద్రపోవడం హాయికి చిహ్నం కాదు. అలనటకి కూడ చిహ్నం ప్రతి చిన్న విషయాలకీ బ్లడ్ రిలేషన్స్‌ని ఆడిపోసుకుని అనుబంధాలు చంపుకోవడం - మనకి అలవాటైపోయింది!

**డి. హరనాథ్, వరంగల్**

యింటి ముందు కొబ్బరికాయలు, గుమ్మడికాయలు కడతారెందుకు? ఏదైనా లాభం చేకూరుతుందా?

* తెలియదు. బహుశా చూడగానే యింటికేసి కాకా వీటికేసి చూస్తారనేమో...

**వి.కె. మూర్తి, కటక్**

ముసలితనం సుఖంగా గడవాలంటే?

* వయసుతనం సక్రమంగా గడిపివుండాలి!

జ్ఞాపకశక్తి గొప్పదా? మరుపు గొప్పదా?

* జ్ఞాపకశక్తి గొప్పదే - కాని అప్పుడప్పుడు - మరిచిపోవడం యింకా గొప్ప విషయం.

మాట్లాడేవాళ్లు తీసుకోవలసిన జాగ్రత్త ఏమిటి?

* బి-బ్రీఫ్ - డేన్ బి - టేడియస్!!

'నోరా వీపుకు తేకే' అంటే?

* నరంలేని నాలుక కంఠానికి ముప్పని!!

మనిషి ఎప్పుడు మాట్లాడకూడదు?

* 'మాట్లాడేది నీ గురించి అయితే - నోరు మూసుకు విను!' అనేవాడు మా పెదమామయ్య. నిజమే పొగిడేస్తూ వుంటే నిజం అనుకుని ఈగో విజృంభించకుండా వుండాలంటే - మనం కూడా మన గురించి - విజృంభించి చెప్పకోకూడదు కద. నోటిని అదుపులో పెట్టుకోడం అలవాటు చేసుకోవాలి.

**ఆకొండి మురళి, రవి, బొబ్బిలి.**

* ఒకప్పుడు ఆరుద్రగారు రాసిన పాటలకు, నేడు చలన చిత్రాలకు పాటలు రాస్తున్న వారి పాటలకు మీకేమైనా తేడా కన్పిస్తోందా? (ఆరుద్ర మీ భర్తగారని విమర్శించడం మానకండి.)

ఆ రోజుల్లో కవి పాటకో సబవు సందర్భం వుండేవి చిత్రాల్లో. ఇప్పుడా బాధ లేదు. అంచేత- అప్పటి ఇప్పటి పాటలకీ ఆ తేడా తప్పదుకదా. ఆ రోజుల్లో క్లబ్బు పాట క్లబ్బుపాట లాగా వుండేది. ఇప్పుడు ప్రేమ పాట దానికి మించి వుంటోంది. అయినా ప్రేమంటే సెక్సేనా? ఇంకేం కాదా-

**పైల సత్యనారాయణ, కాశీబుగ్గ.**

* నిజానికి ఏ తప్పులు ఎరుగని వ్యక్తిని సమాజం నిందిస్తే ఏంచెయ్యాలి?

వ్యక్తులు నిందిస్తారు. సమాజం కాదు. ఒకవేళ ఏం తప్పులు చేయని వ్యక్తి వున్నా ఎవరూ నమ్మరు. నమ్మించడానికి ప్రయత్నించడం కూడా వృధా ప్రయాస.

* మనుషులందరూ ఒకేలాగ ప్రవర్తించరెందుకు?

అప్పుడు వాళ్లు మనుషులవరు. మిషన్లవుతారు.

---

## వజ్రసంకల్పం

ఎన్నాళ్ల తర్వాత....."

డామిట్!

ఆమె విసురుగా రిసీవర్ క్రెడిల్ చేసింది. అప్రయత్నంగా ఆమె కళ్లవెంబడి కన్నీళ్లు ధారాపాతంగా జారిపోసాగాయి.

"శ్రీ శక్తిధర్ మీకిప్పుడు దొరకరు!"

"శ్రీ శక్తిధర్ మీకిప్పుడు దొరకరు!"

మాటిమాటికీ ఆమెకు ఆ మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి.

ఆమె వున్నట్టుండి వులిక్కిపడింది.

ఇదేమిటి!

తనకు ఏడవడంకూడా వచ్చా! లేకపోతే ఈ కన్నీళ్లెందుకిలా జారిపోతున్నాయి. ఛా, ఇంత సెంటిమెంటల్‌గా - ఇంత బేలగా మారిపోతోందేమిటి తను!

ఆమె చటుక్కున లేచినిలబడి కిటికీ దగ్గరికి వెళ్లి కర్టెన్స్ తొలగించి ముభావంగా కిటికీమంచి బైటికి చూస్తూ నిలబడింది.

శక్తిధర్ ద్వారా తను సాధించదల్చుకున్న పని తన మూర్ఖత్వంవల్ల వాయిదా పడింది. మరోమార్గం ఏదైనా ఆలోచించాలి.

ఆమె అలా ఆలోచిస్తుండగానే మ్యూజికల్ కాలింగ్ బెల్ చెవులకు శ్రావ్యంగా వినిపించింది. మొదట్లో ఆమె చెవులకా సంగీతమయ శబ్దం సోకలేదు. రెండోసారి ఆ శబ్దం వినిపించింతర్వాతకానీ ఆమె కదల్లేదు. ఆమె తలుపుదగ్గరికెళ్లి తెరిచేవేళకు మూడోసారి కాలింగ్ బెల్ నిర్విరామంగా మోగసాగింది.

ఆమె తలుపు తెరిచి ఎదురుగా నిలబడున్న వ్యక్తికేసి చూసింది.

మొదట కాలింగ్ బెల్ మోగుతున్నప్పుడు ఆ వ్యక్తి బహుశా ప్రభు అయివుంటాడని వూహించిందామె. కానీ కాదు. ఎవరో అపరిచితుడు.

"యస్?" ప్రశ్నార్థకంగా చూసింది.

"మా బాస్ మీకీ ప్యాకెట్ అందజేయమన్నారు." అన్నాడతను.

"ఎవరు మీ బాస్?"

"శక్తిధర్!"

ఆ పేరు వింటూనే ఆమె గుండె హఠాత్తుగా లయతప్పి స్పందించసాగింది.

"లోపలికి రండి!" మర్యాదగా పిలిచింది.

"సారీ మిస్! నేను వెంటనే తిరిగి వెళ్లిపోవాలి. ఈ ప్యాకెట్ మీకందించి వెంటనే తిరిగొచ్చేయమని ఆర్డర్స్!"

"సరే ఇవ్వండి!"

అతను నీట్‌గా ప్యాక్ చేసివున్న ఆ ప్యాకెట్ ఆమెచేతికందించాడు.

"థాంక్స్!"

"ప్యాకెట్‌తోపాటు ఇదికూడా మీకందించమన్నారు!"

"ఏమిటి?"

"మీ కారు తాళం చెవులు. మీకారుకింద సెల్లార్లో పెట్టాను."

అప్పుడుగానీ గుర్తుకురాలేదామెకు. క్రితం రోజు తన కారు శక్తిధర్ ఆఫీసు ఆవరణలోనే వుంచి అతని కార్లో డిన్నర్ కెళ్లింది తను.

"రేపు దయమే మీ కారు మీ యింటి ముందుంటుంది - సరేనా?" అతని గొంతు మళ్లీ ఆమె చెవుల్లో వినిపించినట్టయ్యింది.

యాంత్రికంగా తాళంచెవులందుకుంది.

"గుడ్ డే మిస్!" మెసెంజర్ గిరుక్కున వెనక్కి తిరిగి చక చకా అక్కడ్నించి వెళ్లిపోయాడు.

పింక్ కారుతాళం చెవులు ఓ టీపాయ్ మీద పడేసి చేతిలో ప్యాకెట్‌తో అదురుతున్న గుండెను అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నిస్తూ బెడ్‌రూంలోకి వెళ్లింది.

(ఇంకా వుంది)



# జీనాలల్లో బ్రిజీదా

మదర్ థెరెసాతో జీనాలల్లో బ్రిజీదా

"పెళ్లిళ్లల్లో ఏముంది ఆనందం... నిస్సహాయులైన వారికి చేయూత నందివ్వటంలోనే వుంది మధురానందం".

ఈ మాటలన్నది ఎవరోకాదు... ఫొటోగ్రఫీకే తన జీవితాన్ని అంకితం చేసి, యిప్పటికీ వన్నెతరగని తన అందంతో జనాల్ని మైమరపిస్తున్న అలనాటి మేటితార 'కమ్ సెప్టెంబర్' ఫేమ్ జీనాలల్లో బ్రిజీదానే! అంటే నమ్ముతారా! ముమ్మాటికి నమ్మితీరాల్సిందే.

65 సంవత్సరాల వయసులో పెళ్లి పెటాకులు అంత ముఖ్యమని భావించటం లేదంటోంది ఈ ఇటలీనటి బ్రిజీదా.

ప్రపంచంలోని నిస్సహాయులైనవారికి చేయూత నందివ్వాలన్నదే తన కోరికని అంటోంది. ఇప్పుడెవరైనా మీ జీవితంలోకి ప్రవేశించారా అన్న ప్రశ్నకు రపీమని మూడు జవాబులిచ్చింది- దీన్నిగురించి మీరు సమగ్రంగా తెలుసుకోవాలను కుంటున్నారా! నా గురించి చెడుగా వ్రాసిన దానికి అదనంగా నేనేమీ చెప్పాలనుకోవటం లేదు! కొంచెం ఓపిక పట్టండి!- అని సమాధానాలిచ్చిందే తప్ప నా జీవితంలోకి ఎవరూ ప్రవేశించలేదని మాత్రం చెప్పటంలేదు.

ఈ మధ్య కలకత్తా వెళ్లినప్పుడు మదర్ థెరెసాను కలుసుకుని ఆశీర్వచనం పొందిందట. బాలలను, జంతువులను వర్ణిస్తూ, థెరెసా వ్రాస్తున్న ఒక పుస్తకంలో బ్రిజీదా గురించి కొన్నిమాటలు వున్నాయట. థెరెసాతో సమావేశం తనకెంతో అనుభవాన్ని సంపాదించి పెట్టినట్లుందని, ఆమె ఆశీస్సులతో తాను ఏదైనా చేయగలనన్న దృఢ సంకల్పం కల్గిందని జీనాలల్లో బ్రిజీదా చెప్తోంది.

వయసు ఆమె అందాన్ని ఏమాత్రం తగ్గించలేక పోయింది సరికదా నాటి 'కమ్ సెప్టెంబర్' రోజుల్ని గుర్తుకు తెస్తోంది.

తన పెండ్లి అంత ఆనందదాయకం కాదని పెండ్లిపై తనకున్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ, అందరు ఆడవాళ్లకు ఒంటరిగా జీవితం గడపటమనేది సాధ్యంకాదని, సంసారం, పిల్లలకోసమే కొంతమంది జన్మిస్తారని జీనాలల్లో బ్రిజీదా నిర్మొహమాటంగా చెప్పింది.

ప్రేమ శాశ్వతం కాదని, ఎప్పుడో ఒకప్పుడు అది విఫలం కాకపోదని, జీవితంతోను, ప్రజలతోను పెంచుకున్న ప్రేమానుబంధం తృప్తినిస్తుందని, థెరెసా మాదిరి నిస్సహాయులకు సహాయపడటంలో వున్న ఆనందమే సంతృప్తి కలుగ చేస్తుందని, యిప్పుడు తన జీవితం ఆ దారిలోనే నడుస్తోందని బ్రిజీదా తెలియజేసింది.

అలనాటి 'కమ్ సెప్టెంబర్' రోజుల ఊహాలోకాల్లోకి వెళ్లాలన్న కాంక్ష లేదంటున్న బ్రిజీదా- జీవితంనేర్పిన పాఠాలతో ముందుకు పోతానని ఉత్సాహం చూపుతోంది. అయినప్పటికీ, 'కమ్ సెప్టెంబర్'లో తనతోపాటు నటించిన రాక్‌హడ్‌సన్ జ్ఞాపకాలను నెమరు వేసుకుంటోంది.

గతంలో నటీనటుల ఎంపిక విషయంలో నిర్మాతలు తన ఆమోదం తీసుకొనే వారని ఆనాటి రోజులను గుర్తు తెచ్చుకుంటూ తానెన్నో అనుభవాలను, ఒడిదుడుకులను చవి చూశానంటోంది. జీవితం సాఫీగా సాగితే మనం అభివృద్ధి చెందలేం అంటున్న బ్రిజీదా మంచి అనుభవాలకంటే చెడు అనుభవాల నుంచే తాను చాలా గుణపాఠం నేర్చుకున్నదట. ఫైడల్ కాస్ట్రోపై తాను తీసిన డాక్యుమెంటరీ బ్రిజీదాకు సంతృప్తి నిచ్చిందట. కారణం తనకు ప్రియాతి ప్రియమైన ఫొటోగ్రఫీని ఆరాధించే వ్యక్తిగా ఆయనపై ఈ డాక్యుమెంటరీ తీసానంటోంది. గ్రేస్‌కెల్లీని ఫొటో తీసిందట కాని ఆమె కొద్ది కాలానికే మరణించటంతో మొనాకోరాజు అయిన కెల్లీభర్తకు ఆ ఫొటోలు యిచ్చేసింది.

ముఖ్యంగా చెప్పకోదగిన విశేషం ఆమె ఫొటోగ్రఫీలో భారత్ ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించు కోవటమే. పారిస్‌లో జరిగిన ఆమె ఫొటో ప్రదర్శనలో భారతదేశ విభాగం ఒక మచ్చుతునకగా పేర్కొనబడింది. ఢిల్లీ, బెనారస్‌లలోని పిల్లల్ని ఫొటోలు తీసిందట. ఆ ఫొటోల్లోని పిల్లలదృష్టి కెమెరాపైవున్నా వారి మనసుమాత్రం ఎక్కడో పయనిస్తున్నట్లు ఆ ఫొటోలద్వారా ఆమె గ్రహించింది.

కలకత్తాలో తొలిసారిగా తాను పర్యటించిన సందర్భంగా అక్కడినగరంలో నిస్సహాయులైన ప్రజలు చాలా మంది వున్నట్లు బ్రిజీదా కనుగొన్నదట.

\- తిలక్




## – నీ గుండెల్లో నిద్దుర పోతా!

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలే గాని బాధించకూడదు. రసభరితంగా వుండాలే గాని అశ్లీలం కొట్టవచ్చి నట్లుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదేతుది నిర్ణయం.

**13-4-'90లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!**

## టిట్ ఫర్ టాట్ - (46) ఫలితాలు

"హనీమూన్‌కి కాశ్మీర్‌కి వెళ్తామంటావేమయ్యా! అల్లుడూ!"

* రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"మీ అమ్మాయికి బ్రతుకు మీద విరక్తిపుట్టిందిట స్వామీ!"

- పి. శంకరరావు (అమలాపురం)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"యాపిల్ పండులాంటి మనుమడుకావాలంటిరేమరి?!"

- ఎస్. శ్రీనివాసరావు (పొదిలి)

### మరికొన్ని వాగ్బాణాలు

"ఎన్నెల్లో 'తాజమగలు' సూట్టానికి మాంగోరూ!"

- దువ్వూరి ప్రసాదు (విశాఖపట్నం)

"అది 'స్వదేశం'గా వుండగానే దాని సౌందర్యం తిలకిద్దామని!"

- సాహితి (మద్రాసు)

మీ అమ్మాయిని అక్కడ ఒగ్గేద్దామనుంది.

- విశ్వపతి (వెనిగళ్ల)

"అయితే 'పంజాబ్'కు పోవాలంటావా మామా!"

- వి.ఎం. రవిచంద్రారెడ్డి (ప్రొద్దుటూరు)

-ఎం.సీతన్నాయుడు (మచిలీపట్నం)

-పి. అరుణ్ కుమార్ (ఇచ్ఛాపురం)

-గాదె వీరభద్రరావు (తణుకు)

"నాకు చిన్నప్పటి నుండి సాహసాలు చేయడం అంటే బలే సరదా మామయ్యా!"

-జి. విజయలక్ష్మి (హిల్ కాలని)

### లక్కీ పేర్లు

టి. రమణ (కాశీబుగ్గ), టి. రవిందర్ రెడ్డి (వరంగల్), షేక్ బాజీ (మార్టేరు), ఎ. గణేష్ (రాజంపేట), ఎం. సురేష్‌బాబు (వీరన్నపాలెం), బి. నారాయణరావు (బుచ్చిరెడ్డి పాలెం), డి. నాగలక్ష్మి (మణుగూరు), బి. ప్రసన్నరాణి (రాజమండ్రి), ఆర్. వి. పద్మజ (పలాసా), టి. అచ్చమాంబ (తణుకు), కె. స్వరాజ్యం (విశాఖపట్నం).



# అమాత్యుల ఆస్తిపాస్తులు

ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి, ఆయన మంత్రివర్గ సహచరులు తమ తమ ఆస్తులను వెల్లడించారు. ఇలా బహిరంగంగా ముఖ్యమంత్రి, మంత్రులు తమ తమ ఆస్తులను వెల్లడించటం రాష్ట్రంలో ఇదే మొదటిసారి.

## శ్రీ చెన్నారెడ్డి

నగదు మరియు బ్యాంక్ బ్యాలెన్స్ రు. 65 వేలు, బ్యాంకుల్లో డిపాజిట్లు రు. 1.40 లక్షలు, యూనిట్ ట్రస్టు, నేషనల్ సేవింగ్స్‌లో డిపాజిట్లు రు. 3.60 లక్షలు, అడ్వాన్సులు మొదలైనవి రు. 2.70 లక్షలు, బంగారం, వెండి ఆభరణాల నిలువ రు. 2.12 లక్షలు.



సికింద్రాబాద్‌లో లాలాగూడాలోని ఇంట్లో ఒక భాగం, మార్పల్లి గ్రామంలోని పదెకరాల వ్యవసాయ భూమిలో 1/3 వంతు భాగస్వామ్యం, న్యూఢిల్లీలో 542 చదరపు అడుగుల వాణిజ్య ప్లాటు, షంషాబాద్‌లో కౌలుకు తీసుకున్న 17 ఎకరాల వ్యవసాయ భూమి వున్నాయి. వీటితో పాటు రు. 1.44 లక్షల బ్యాంక్ ఋణం కూడా వుంది.

## శ్రీ ఆర్. చెంగారెడ్డి

కొప్పేడులోని ఒక లక్ష రూపాయల విలువ చేసే 3.54 ఎకరాల భూమి, కొప్పే



డులో ఒక మిల్లు, లక్షా 20 వేల పెట్టుబడితో శ్రీరామచంద్రపురంలోని రైస్ మిల్లులో భాగస్వామ్యం, రు. 2.50 లక్షలు విలువ చేసే రెండు ప్లాట్లు నగరి, హైదరాబాద్‌లలో వున్నాయి. వీటితో పాటు లక్ష రూపాయల ఋణం కూడా వుంది.

## శ్రీ జె.సి. దివాకరరెడ్డి

వజ్రాల చెవిరింగులు, వజ్రాల గాజులు, వజ్రాల నెక్లెస్, 53.2 తులాల బంగారం,



బ్యాంక్ బ్యాలెన్స్, బంధువులకు ఇచ్చిన ఋణాలు సుమారు రు. 1.75 లక్షల దాకా వుంటుంది. ఒక కారు, బస్సు వున్నాయి. 40 ఎకరాల భూమి, అనంతపురంలో రెండున్నర ఎకరాల స్థలం, హైదరాబాదులో ఒక నివాసస్థలం వున్నాయి.

## శ్రీ ముద్రగడ

రెండు కార్లు, శ్రీ పద్మనాభ బ్రిక్ అండ్ టైల్స్ వర్క్స్, కిర్లంపూడిలో శ్రీ



పద్మనాభ టాకీస్, కిర్లంపూడిలో ఒక ఇల్లు, కిర్లంపూడి ఇంద్రపాలెంలో 630 చదరపు అడుగుల స్థలాలు, 8.25 ఎకరాల వ్యవసాయ భూములు ఉన్నాయి. వీటన్నింటిలో ఆయన సోదరుడికి వాటా ఉంది. సినిమా హాలు, టైల్స్ ఫ్యాక్టరీల ఖర్చులు పన్నులు రు. 13 లక్షలు కాగా ప్రయివేట్ వ్యక్తుల నుండి భూములపై తీసుకున్న రుణం ఆరు లక్షల రూపాయల దాకా ఉంది.

## శ్రీ వి. హనుమంతరావు



ఒక కారు, రు. 25 వేలు విలువ చేసే బంగారు నగలు, అంబర్‌పేటలో ఒక ఇల్లు వున్నాయి.

## శ్రీ డి. సమరసింహారెడ్డి

వివిధ కంపెనీలలో రు. 20 వేలు విలువ చేసే షేర్లు, ఒక కారు, రు. 35 వేల నగదు, ఒక రివాల్వర్, ఒక రైఫిల్, లక్ష రూపాయల ఎల్.ఐ.సి. పాలసీలు, వీటితోపాటు మహబూబ్‌నగర్ జిల్లా ధర్మపక్షం, గద్వాల్‌లో 40 ఎకరాల వ్యవసాయ భూమి, గద్వాలలోని భవంతిలో 1/3 వంతు భాగం, రాయచూరులోని భవంతిలో 1/3 వంతు భాగం, హైదరాబాదులోని అంబర్‌పేట భవంతిలో 1/2 వంతు భాగం, హైదరాబాద్‌లోని జూబ్లీహిల్స్‌లో 600 చదరపు యార్డుల స్థలం వున్నాయి.

## శ్రీ మాగంటి రవీంద్రనాథ్ చౌదరి

రు. 15 వేలు విలువ చేసే 2.4 కిలోల వెండి సామాను, ప్రయివేట్ కంపెనీల నుండి రావలసిన మొత్తం రు. 2,21,400 దాకా ఉంది. రు. 4.54 లక్షల విలువ చేసే పొగాకు స్టాకు, రావలసిన ఇతర మొత్తాలు రు. 73 వేలు, బ్యాంకు బ్యాలెన్స్ రు. 8.66 లక్షలు, పొగాకు కంపెనీల్లో రు. 70 వేల షేర్లు, రు. 4.35 లక్షల విలువ చేసే బంగారం, కారు, వివిధ కంపెనీల్లో షేర్లు ఉన్నాయి. ఏలూరులో రు. 10 లక్షలు విలువ చేసే 1763 చదరపు యార్డుల స్థలం, రెండు లక్షలు విలువ చేసే 7.08 ఎకరాల భూమిలో పెట్టుబడి, రు.

# లెక్కలు!

79 లక్షలు విలువ చేసే 13.16 ఎకరాల వ్యవసాయ భూమి, హైదరాబాద్‌లో రు. 8 లక్షలు విలువ చేసే 800 చదరపు యార్డుల భూమితో పాటు రు. 18 లక్షల ఖర్చు ఉంది.

## శ్రీ ఎం. వెంకటేశ్వరరావు

ఒక కారు.

స్థిరాస్తి: నందిగామ మండలంలో కేత వీర్నపాడు గ్రామంలో 12.66 ఎకరాల మెరక భూమి, 3500 చదరపు గజాల ఇల్లు, హైదరాబాద్ ఎం.ఎల్.ఏ.ల కాలనీలో 600 చదరపు మీటర్ల ఇంటి స్థలం.

## శ్రీ ఎస్. వెంకటరెడ్డి

చరాస్తులు: ఒక కారు, రెండు స్కూటర్లు, నగదు లక్ష రూపాయలు, 600 బస్తాల ధాన్యం, 71 తులాల బంగారం.

స్థిరాస్తులు: తూర్పుగోదావరి జిల్లాలో 14.66 ఎకరాల భూమి, ఒక ఇల్లు, ఒక పాత భవంతి, రెండు గిడ్డంగులు, ఒక భవనం ఆవరణ కలిపి అరెకరం, హైదరాబాద్‌లో 600 చదరపు గజముల స్థలం.

## శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి



వివిధ కంపెనీలలో పది రూపాయిలు విలువ చేసే 25,333 సమాన వాటాలు, ఒక కాంటెస్సా కారు, రు. 93,606 బ్యాంక్ బ్యాలెన్స్, నెల్లూరులో 8.86 ఎకరాల వ్యవసాయ భూమి, వాకాడలో ఒక ఇల్లు వున్నాయి. రు. 5 వేల బ్యాంక్ ఋణం వుంది.

## శ్రీ కె.రోశయ్య

రు. 50 వేలు విలువ చేసే నేషనల్



సేవింగ్స్ సర్టిఫికెట్లు, ఒక కారు, రు. 80 వేలు విలువ చేసే ఎల్.ఐ.సి. పాలసీలు ఉన్నాయి.

వేమూరు గ్రామంలో నాలుగు సెంట్ల భూమిలో ఒక పాక, తెనాలిలో ఒక భవంతి, హైదరాబాద్ బాల్కంపేటలో ఒక భవంతి, వేమూరులో అర్ధ ఎకరం భూమి, రంగారెడ్డి జిల్లాలోని హఫీజ్ పేటలో 1.24 ఎకరాల భూమి ఉన్నాయి.

## శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులు రెడ్డి



నెల్లూరు, కోటలలో రెండు ఇళ్లు, కోటలో రెండెకరాల పొలం, హైదరాబాద్‌లో ఒక నివాస స్థలం వుంది.

## శ్రీ జి.వి. సుధాకరరావు

ఒక కారు, ఫార్మాసూటికల్స్‌లో రు. 4.67 లక్షల షేర్లు, రు. 1.5 లక్షల బంగారు, వెండి ఆభరణాలు, లక్సెట్ పేటలో మూడు లక్షల రూపాయల విలువగల థియేటర్, ఆదిలాబాద్ జిల్లా రాజంపేటలో 56 ఎకరాల భూమిలో సగభాగం, రు. 50 వేల విలువ చేసే పాడి సంపద, రు. 25 వేలు విలువ చేసే వ్యవసాయ సాధనాలు, రాజంపేటలో రు. 50 వేలు విలువ చేసే ఇల్లు వున్నాయి. వీటితోపాటు రు. 1,40,000 ఋణం వుంది.



## శ్రీ మహ్మద్ జానీ

లక్షా ఎనభై ఆరువేల బాంకు డిపాజిట్లు.

స్థిరాస్తి: తాడికొండలో 2.5 ఎకరాల మెట్టభూమి, గుంటూరులో 550 చదరపు గజాల స్థలం, మరో 226 చదరపు గజాల స్థలం. శ్రీ జానీ 60 వేల రూపాయల ఋణాన్ని ప్రభుత్వం నుండి పొందారు.

## పి. శమంతకమణి

19.6 తులాల బంగారు నగలు, 58 వేల రూపాయల మేరకు నగదు, వసూలు కావలసిన ఋణాలు.



స్థిరాస్తి : పమిడిగూడలో 9.30 ఎకరాల సాగుభూమి, అనంతపురం, గూటి, కడపలలో 14 సెంట్ల ఖాళీ స్థలాలు, అనంతపురంలో ఒక ఇల్లు.

## శ్రీ జె. చిత్తరంజన్ దాస్

చరాస్తులు: 85 తులాల బంగారం (సమిష్టి కుటుంబ ఆస్తి)

మాజీ మంత్రి శ్రీ కోనేరు రంగారావుకు ఆస్తులుకానీ, బాకీలు కానీ లేవు.

○

సీరియల్

# హాట్ లిప్స్

## జి.వి. అమరేశ్వరరావు



(గత సంచిక తరువాయి)

శివాజీ అంబర్‌పేట్‌లో తన తండ్రి, తల్లి, పది సంవత్సరాల వయస్సున్న చెల్లెలుతో కలిసి ఉంటున్నాడు. శివాజీకి అతడి చెల్లెలికీ పదిహేను సంవత్సరాల తేడా. శివాజీ పుట్టిన చాలా కాలానికి ఆమె పుట్టింది.

శివాజీ తండ్రి సాంబయ్య ఒక బిస్కెట్ ఫ్యాక్టరీలో రోజు కూలీగా పనిచేసి రిటైర్ అయాడు ఇంటర్ వరకూ చదివిన శివాజీ తండ్రి రిటైర్ అవ్వగానే ఇంటి బాధ్యతలు చేపట్టాడు చిన్న చిన్న ఉద్యోగాలు అనేకం చేసిన శివాజీ చివరికి విసుగుపుట్టి పిక్‌పాకెటింగ్ అలవాటు చేసుకున్నాడు మొదటిసారి శివాజీ జైల్లో పడ్డప్పుడు సాంబయ్య బెయిలు మీద శివాజీని విడిపించి నయానా భయానా చెప్పి చూశాడు అయినా శివాజీ మారలేదు. దాంతో సాంబయ్య చెప్పడం మానేశాడు

తండ్రి నుంచి ప్రతిఘటన ఆగిపోవడంతో శివాజీకి పట్టపగ్గాలు లేకుండా పోయాయి ఒకసారి ఎగ్జిబిషన్‌లో తన పర్సునే కొట్టబోయిన రజనిని శివాజీ రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నాడు ఆమె కూడా తన జాతికి చెందినదే అని తెలియడంతో ఆమెను పోలీసులకు అప్పచెప్పకుండా వదిలేసాడు అయితే వాళ్ళిద్దరి మధ్యా పరిచయం మాత్రం రోజు రోజుకూ పెరిగి పెద్దదయి ఒకర్నొకరు ప్రేమించుకొనే స్థాయికి చేరుకుంది.

రజని మల్కాజ్‌గిరిలో తన బామ్మతో కలిసి ఉంటుంది తల్లి తండ్రి చనిపోయిన తర్వాత రజని తన బామ్మ దగ్గరే ఉండసాగింది

శివాజీ ఇంటికి చేరిన సమయానికి తల్లి, తండ్రి, చెల్లెలు గాఢ నిద్రలోకి ఒరిగిపోయి ఉన్నారు.

శివాజీ అన్నం పెట్టుకుని తినేసి ఆరుబయట మంచం వేసుకుని చంద్రుడి వంక చూస్తూ ఆలోచిస్తూ పడుకున్నాడు

అలా ఒంటరిగా పడుకున్నప్పుడు శివాజీకి తన తాతయ్య గుర్తుకు వచ్చాడు వెంటనే అతడి కళ్ళు చమర్చాయి

తనకు పదేళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడు తాతయ్య తనను ఒళ్ళో కూర్చోపెట్టుకుని చెపుతుండేవాడు.

"ఒరే శివా! . నువ్వు పెద్దాడివి అయిన తర్వాత బాగా సంపాదించాలిరా న్యాయాన్ని ధర్మాన్ని నిర్ణయించేది డబ్బేరా కేవలం మన దాయాదులు సృష్టించిన అబద్ధపు సాక్ష్యం వల్ల మనం వంద ఎకరాల పొలం పోగొట్టుకున్నాంరా . మళ్ళీ నువ్వు అంత డబ్బు సంపాదించాలిరా"

"వందెకరాలు . మళ్ళీ మనం కొనుక్కోవచ్చుగా"

శివాజీ అడిగిన అమాయకపు ప్రశ్నకు వేదాంతిలా నవ్వి అనేవాడాయన

"వందెకరాలు అంటే మాటలు కాదురా.. కనీసం ఇరవై లక్షల రూపాయలవుతుందిరా కన్నా"

అలా మొదలు పెట్టిన శివాజీ తాత డబ్బు గురించి చెపుతూనే ఉరడేవాడు. పదేళ్ళ క్రితం శివాజీ తాత మరణించాడు కాని ఆయన మాటల్ని మాత్రం శివాజీ మర్చిపోలేకపోయాడు ఇరవై లక్షల రూపాయలు అంత డబ్బు తను సంపాదించగలడా?

"ఏమో?"

ఆలోచిస్తున్న శివాజీ మెల్లిగా నిద్రలోకి జారుకున్నాడు

* * * *

కోటేశ్వరరావు బి కాం ప్యాసయ్యాడు. అందరిలా ఉద్యోగం కోసం ప్రయత్నించకుండా ఎల్. ఐ. సి. ఏజెంట్‌గా డబ్బులు సంపాదించడం మొదలుపెట్టాడు ఇపుడు అతడు నగరంలో నెంబర్ ఒన్ ఏజెంట్‌గా పేరు పొందాడు నెల రోజుల క్రితం కాశీప్రసాద్ తన భార్య పేరన అయిదు లక్షల రూపాయలకు ఎల్. ఐ. సి. పాలసీ తీసుకున్నాడు. ఇపుడు పాలసీ తాలూకు కాగితాలు తీసుకుని వచ్చి కాశీప్రసాద్‌ను కలిశాడు కోటేశ్వర్రావు.

కోటేశ్వర్రావు తెచ్చిన కాగితాల్ని జాగ్రత్తగా పరిశీలించిన తర్వాత అడిగాడు కాశీప్రసాద్.

"అంతా సక్రమంగానే ఉంది కదా"

"అవును సర్ . మీరు కూడా ఒక పాలసీ తీసుకుంటే బావుంటుంది"

"నాక్కూడా ఇదే ఆలోచన వచ్చింది..."

"మీరు ఊఁ! అంటే ఫామ్స్ ఇపుడే పూర్తి చేస్తాన్సార్"

కాశీప్రసాద్ తల ఊపాడు.

కోటేశ్వర్రావు తన దగ్గిరున్న జిప్ ఫైలు తెరిచి ఎల్. ఐ. సి. పాలసీకి సంబంధించిన కాగితాలు బయటకు తీశాడు. కాశీప్రసాద్ వయస్సు, ఎత్తు అవీ నోట్ చేసుకున్న తర్వాత చెప్పాడు–

"మా ఎల్. ఐ. సి. డాక్టరు మిమ్మల్ని పరిశీలించి ఫిట్‌నెస్ సర్టిఫికెట్ ఇస్తాడు .. ఒక రోజు డాక్టరుగార్ని వెంట పెట్టుకు వస్తాను".

కాశీప్రసాద్ సరే అన్నట్టు తల ఊపాడు.

కోటేశ్వరరావు బయటకు అడుగు పెట్టగానే ఆ గదిలోకి ప్రవేశించాడు కురియన్.

అతడిని చూస్తూనే అడిగాడు కాశీప్రసాద్.

"ఏదయినా మంచి పథకం ఆలోచించావా?"

కురియన్ తల ఊపి కాశీప్రసాద్ భార్యను పకడ్బందీగా చంపడానికి తను వేసిన ప్లాన్ వివరించసాగాడు.

చెప్పడం పూర్తయిన తర్వాత మెచ్చుకుంటున్నట్టుగా కాశీప్రసాద్ కురియన్ భుజం మీద మెల్లిగా తట్టాడు

* * * *

మధ్యాహ్నపు సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు.

పొద్దుట్నించీ ఎంత ప్రయత్నించినా శివాజీగాని,

**ఇంతవరకూ సాగినకథ -: 1** మూడు పేర్లతో మోసాలకు అలవాటుపడి వచ్చినదాంట్లో సమానంగా పంచుకుంటూ కాలం గడుపుతుంటారు శివాజీ- రజని. మొదటి భార్యను స్వర్గానికి పంపి తనను భార్యగా స్వీకరిస్తావని బిజినెస్ మాగ్నెట్ కాశీప్రసాద్ ఉంపుడుకత్తె అయిన మోహినికి మాట యిస్తాడు.

రజనిగాని ఒక్క పర్సు కూడా సంపాదించలేకపోయారు. వచ్చేటపుడు రజని తీసుకు వచ్చిన అయిదు రూపాయలతో వచ్చిన రెండు ప్లేట్లు ఇడ్లీ, రెండు చాయ్ వాళ్ళ ఆకలి తీర్చలేకపోయాయి రజని కోపంగా అన్నది

"ఓ వంద రూపాయలు కళ్ళబడితే చాలు అయ్యగారికి ఒళ్ళు తెలియదు ఇపుడు చూడు ఆకలి కరకరలాడుతున్నా చేతిలో ఒక్క పైసా లేకుండా పోయింది"

"అసలు నిన్ను అయిదు రూపాయలే ఎవడు తెమ్మన్నాడు మరో యాభై తెస్తే నీ సొమ్మేం పోయింది?"

"నా దగ్గిరున్న డబ్బుల గురించి మాట్లాడడానికి నీకు హక్కులేదు అలాంటి హక్కు కావాలంటే నువ్వు నన్ను పెళ్ళి చేసుకోవాలి"

"ఈ కోతి ముఖానికి పెళ్ళి కూడా ఒకటి"

"నాది కోతి ముఖమా నీదె కోతి ముఖం"

"కాదు నీదే"

"కాదు నీదే. "

శివాజీ రజని వైపు కోపంగా చూశాడు ఆమెతో పోట్లాడి గెలవడం కష్టం

"చూడు డాళింగ్ "

"ఎస్ డియర్"

"మనం ఇపుడు అర్జంటుగా ఆకలి తీర్చుకోవాలి అవునా?"

"ఈ డైలాగు అదేదో తెలుగు సిన్మాలో హీరో హీరోయిన్‌కి చెప్పిన డబుల్ మీనింగ్ డైలాగును గుర్తుకు తెప్పిస్తోంది"

రజని మాటకు శివాజీ కోపంగా ఆమె వంక చూసి చెప్పాడు

"ఇది తెలుగు సినిమా డైలాగు కాదు నిజం డైలాగు మనం స్పెషల్ ఇడ్లీ, ఎమ్మెల్లే దోశ, వెజిటబుల్ బిరియానీ, టమోటా ఆమ్లెట్, మసాలావడ, గులాబ్‌జాం మొదలయినవి ఇపుడు తినబోతున్నాం"

"నువ్వు అసలు విషయం మర్చిపోయావ్"

"ఏంటది?"

"చికెన్ సిక్స్టీ ఫైవ్"

"ఓకే వాటికి చికెన్ సిక్స్టీ ఫైవ్ కూడా కలుపు"

"ఇవన్నీ కావాలంటే కనీసం వంద రూపాయలు కావాలి. ఒక్క చాయ్ తాగడానికి డబ్బుల్లేవు గాని పెద్ద హీరోలాగా చెప్తున్నాడు."

"నువ్వన్నట్టు మనం ఇపుడు ఇవన్నీ తినగలిగినా చాయ్ మాత్రం తాగలేం"

"ఏం?" రజనికి ఆశ్చర్యం వేసింది

శివాజీ తన పథకం వివరించసాగాడు అంతా విన్న తర్వాత రజని ఉత్సాహంగా తల ఊపి చెప్పింది

"అయితే నేను ఇపుడే సుబ్రహ్మణ్యం విలాస్‌లో ఎమ్మెల్లే దోశ, వెజిటబుల్ బిరియానీ . ఇంకా"

"మరీ చీపుగా ఆలోచించకు. సుబ్రహ్మణ్యం విలాస్‌లో అయితే చికెన్ సిక్స్టీ ఫైవ్ దొరకదు. అది వెజిటేరియన్ హోటల్ బ్లూ డైమండ్‌లో అయితే చికెన్‌లో రక రకాల వెరైటీలు దొరుకుతై పైగా అది స్టార్ హోటల్ "



"కానీ అక్కడ స్పెషల్ ఇడ్లీ, వెజిటబుల్ బిరియానీ, టమోటా ఆమ్లెట్ ఉండవుగా".

"అవి కూడా దొరుకుతై.... వాటి సంగతి సాయంత్రం మరో చోట చూసుకుందాం. ముందు నువ్వు బ్లూ డైమండ్ విషయం చూడు. అక్కడ చికెన్ ఐటమ్స్ భలేగా ఉంటైట".

రజని సరేనన్నట్లు తల ఊపి రోడ్‌ను క్రాస్ చేస్తూ బ్లూ డైమండ్ వైపు నడిచింది. శివాజీ ఆమె వంక పరీక్షగా చూశాడు.

ఖరీదయిన చీర, ఎడమ చేతికి క్వార్ట్జ గడియారం, భుజాన హ్యాండ్ బ్యాగ్, హైహిల్స్ చెప్పులతో రజని ముఖం కాన్ఫిడెంట్‌గా కనపడుతోంది. ఆమె ఒక పిక్‌పాకెటర్ అంటే ఎవరూ నమ్మరు.

బ్లూ డైమండ్ హోటల్ రెస్టారెంట్ ముఖ ద్వారం దగ్గిరున్న దర్వాన్ వినయంగా తలుపు తీశాడు. రజని లోపలికి ప్రవేశించింది. అక్కడ డిమ్ లైటింగ్‌లో వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. టేబుల్స్ ఆక్యుపై చేసిన జనం మెల్లిగా కబుర్లు చెప్పుకుంటున్నారు. అక్కడ వాతావరణం చూస్తే ఆ హోటల్ అంతా కేవలం హైక్లాస్ పీపుల్ కోసం ఉన్నదని అర్థం అవుతుంది.

రజని తనకు అనువుగా ఉన్న ఒక టేబుల్ దగ్గిరికి వెళ్ళి కూర్చుంది. అయిదు నిమిషాల తర్వాత వచ్చిన సప్లయర్ మెనూ కార్డు అందించాడు.

ఇంటర్ మీడియేట్ ఫస్ట్ ఇయర్ వరకూ చదివిన ఆమె చదువు ఇలాంటి సందర్భాల్లో పనికి వస్తుంటుంది.

"ఒక చికెన్ ఫ్రైడ్ రైస్, ఒక మటన్ ఫ్రైడ్ రైస్, తందూరీ చికెన్, ఒక చికెన్ ఫ్రై, చికెన్ కర్రీ, రెండు ప్లేట్లు చికెన్ నూడిల్స్, ఒక లార్జి ప్లేటు జింజర్ చికెన్, ప్రాన్స్ ఫ్రై, చికెన్ సూపూ పత్రా..."

అవన్నీ నోట్ చేసుకున్న బేరర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఇవన్నీ మీకే...."

"అవును... అర్జంట్... అవతల ఫ్లైట్‌కు టైం అయిపోతోంది. మీ హోటల్లో పార్సెల్ సర్వీస్

# హాట్ లిస్ట్!

ఉందా?"

బేరర్ తల ఊపాడు.

"నేను తినేలోపు... ఒక చికెన్ ఫ్రైడ్ రైస్, చికెన్ నూడిల్స్, తందూరీ చికెన్, జింజర్ చికెన్, చికెన్ స్పెషల్ కర్రీ, చికెన్ ఫ్రై, ప్రాన్స్ ఫ్రై, చికెన్ సిక్స్టీ ఫైవ్, అరడజను రోటీ ఒక్కొక్క ప్లేటు చొప్పున పార్సిల్ చేయించు".

"ఇవన్నీ మీకే".... బేరర్ ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

"అవును... ప్రయాణం చేసేటప్పుడు విమానంలో తినడానికి.... క్విక్.... త్వరగా పార్సెల్ పని పూర్తి చెయ్. అవతల ఫ్లైట్ టైం అయిపోతుంది".

బేరర్ అక్కడ్నించి కదిలాడు.

పావు గంట తర్వాత రజని టేబుల్ మీదకు ఆమె అడిగినవన్నీ సప్లయ్ అయాయి. మరో పది నిమిషాలకు బేరర్ పాలిథీన్ బ్యాగ్‌లో ఒక పెద్ద పార్శిల్ తెచ్చి రజని ముందు పెట్టాడు.

మూడు రోటీ, ఒక చికెన్ ఫ్రైడ్ రైస్, చికెన్ కర్రీ, జింజర్ చికెన్ తినేసరికే రజని పని అయిపోయింది.

కనుకొనల గుండా తనను ఎవరూ చూడడం లేదని గ్రహించగానే చికెన్ ఫ్రై, మూడు రోటీ, చికెన్ సిక్స్టీ ఫైవ్, ప్రాన్స్ ఫ్రై మొదలయినవన్నీ హ్యాండ్ బ్యాగ్‌లోకి సర్దింది.

బేరర్ ఆమె టేబుల్ వద్దకు వచ్చి ఇంకా ఏమన్నా కావాలా అని అడిగాడు.

రజని వద్దన్నట్టు తల ఊపి ఒక కాఫీ అని చెప్పింది.

బేరర్ కాఫీతో పాటుగా బిల్లు తెచ్చి టేబుల్ మీద ఉంచాడు. రజని బిల్లు వైపు చూసింది.

ఎనిమిది వందల యాభై రూపాయలు.

రజనికి ఒక్కసారిగా గుండె ఝల్లుమంది.

సరిగ్గా ఆ సమయంలో శివాజీ రెస్టారెంట్‌లోకి ప్రవేశించాడు. ఎదురుగ్గా కాఫీ సిప్ చేస్తున్న రజని కనపడింది. వెంటనే అటు వైపు వేగంగా అడుగులు వేసి టేబుల్ మీద ఉన్న రజని హ్యాండ్ బ్యాగ్‌నూ, పార్శిల్‌నూ దొరకపుచ్చుకుని వేగంగా గుమ్మం వైపు పరుగు తీశాడు.

రెస్టారెంట్‌లోని జనం తేరుకునే లోపే అతడు రోడ్డు మీదకు పరుగెత్తి ట్రాఫిక్‌లో అదృశ్యం అయిపోయాడు.

శివాజీ పరుగెత్తి వెళ్ళిపోగానే రజని అప్పుడే చలనం వచ్చిన దానిలా-

"దొంగ... దొంగ... నా హ్యాండ్ బ్యాగ్ తీసుకు పారిపోతున్నాడు పట్టుకోండి" అంటూ అరవసాగింది.

ఆమె అరుపుతో హోటల్లో పనిచేసే బేరర్లు, సూపర్‌వైజర్లు, రెస్టారెంట్‌లోని కస్టమర్లూ ఒక్కసారిగా లేచి గుమ్మం వైపు పరుగు తీశారు.

అందమైన మెరుపు తీగలాంటి అమ్మాయి. అందులోనూ హ్యాండ్ బ్యాగ్ పోగొట్టుకుంది. దాంతో ఆమెకు సహాయం చెయడానికి అందరూ ఒక్కసారిగా పోటీ పడ్డారు. అయితే రెస్టారెంట్ ద్వారం చాలా చిన్నది.

ఆ తొక్కిసలాటలో పావుగంట సేపు గింజాకుంటే కేవలం ఒకే ఒక వ్యక్తి ఆ ద్వారం నుంచి బయటకు రావడం సాధ్యమయింది.

ఆ వ్యక్తి రజని.

గుమ్మం గుండా ఎలాగో బయటపడిన హోటల్ మేనేజర్ వంక చూసి పెద్దగా అరిచింది.

"ఛీ ఛీ.... స్టార్ హోటళ్ళలో కూడా సెక్యూరిటీ లేకుండా పోతోంది. మీ హోటల్ పరిస్థితి ఇంత అధ్వాన్నంగా ఉన్నదని తెలిస్తే నేనసలు వచ్చేదాన్ని కాదు.... అవతల ఫ్లైట్‌కు టైం అయిపోతోంది. ఈ లోపు నా హ్యాండ్ బ్యాగ్ కాస్తా ఎవడో కొట్టేశాడు."

ఆ పాటికే అక్కడకి చేరిన కస్టమర్స్ లోంచి ఒకడు అడిగాడు.

"ఆ బ్యాగ్‌లో ఎంత ఉంటుంది మేడం?"

"ఫిఫ్టీన్ హండ్రెడ్స్... 15 వందలు."

"ఈ రోజు ఈ మేడంకు అయ్యింది... రేపు మనకు అవుతుంది. ఆమె చెప్పినట్టు ఈ హోటల్లో మనకు సెక్యూరిటీ లేకుండా పోయింది. అపుడెపుడో నా ఫ్రెండ్ జశ్వంతరావు సూట్ కేస్ కూడా ఇదే హోటల్లో పోయిందిట." జనంలోంచి ఎవరో కామెంట్ చేశారు.

ఇక తన హోటల్ పరువు దెబ్బతీసే పరిస్థితి ఉత్పన్నం అయిందని గ్రహించిన మేనేజర్ ఛటుక్కున జేబులో నుంచి డబ్బు తీసి రజని చేతిలో పెట్టి అన్నాడు.

"మా పాలిట కస్టమర్లే దేవుళ్ళు. వాళ్ళ శ్రేయస్సే మాకు ముఖ్యం. మీకు ఈ హోటల్లో జరిగిన దానికి బాధపడుతూ, ఆ నష్టానికి బాధ్యత మేమే స్వీకరిస్తున్నాం."

రజని మేనేజరు వంక ఓ సారి కోపంగా చూసి పోర్టికోలో ఆగి ఉన్న టాక్సీ వైపు చెయ్యి ఊపింది.

టాక్సీ దగ్గరకు రాగానే డ్రయివర్‌తో ఎయిర్ పోర్ట్ అని చెప్పింది. అతడు తల ఊపాడు. హోటల్ మేనేజర్ వినయంగా డోర్ తెరిచాడు. రజని ఎక్క

## మీ జి. కె. ఎంత? జవాబులు

(1) 'ఖైరపార' అసెంబ్లీ నియోజక వర్గానికి "ఛాంబర్లీన్ మారక్" (2) నిఖిల్ చక్రవర్తి (3) శ్రీయుతులు సర్వేపల్లి రాధాకృష్ణ, వి. వి. గిరి, నీలం సంజీవరెడ్డి (4) సైమర్ హెర్ష్- ఈ గ్రంథంలో నే మాజీ ప్రధాని మొరార్జీ దేశాయిని సి. ఐ. ఎ. ఏజెంట్‌గా నిందించబడింది. (5) ఎమెక అన్యాఒకు (నైజీరియన్) (6) శ్రీమతి మీరా-సాహెబ్ ఫాతిమా బీబీ (7) 1989 నోబెల్ సాహిత్య పురస్కార విజేత (8) ఉత్తరప్రదేశ్ (9) తెలుగు (10) డిఫెన్స్ రీసెర్చ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్.

కూర్చుంది.

టాక్సీ కొద్ది దూరం వెళ్ళిన తర్వాత ఒక పార్క్ పక్కగా ఆపమని ఓ వంద రూపాయల నోటు అందించి చెప్పింది–

"ఇక్కడ మా ఫ్రెండ్‌ని కలవాల్సిన పనిఉంది. సారీ..."

"మరేం పర్లేదు మేడం" అంటూ డ్రైవర్ మినిమమ్ ఛార్జీ ఉంచుకుని మిగిలిన డబ్బులు రజనికి అందించాడు.

టాక్సీ వెళ్ళి పోయిన తర్వాత రజని పార్కులోకి నడిచింది.. అక్కడ మంచి నీటి పంపు ప్రక్కగా కూర్చుని ఫైవ్‌స్టార్ ఫుడ్ తింటున్న శివాజీ కనిపించాడు. అతడి ప్రక్కనే ఆమె హ్యాండ్ బ్యాగ్ కూడా పడిఉంది.

*　　*　　*

జంటనగరాల్లోని ఆడిటోరియంలలో కల్లా సెవెన్ హిల్స్ ఆడిటోరియం అతి పెద్దది. ఖరీదయిన ప్రోగ్రాములన్నీ పూర్తిగా ఎయిర్ కండిషన్‌డ్ అయిన ఆ ఆడిటోరియంలోనే జరుగుతాయి.

ఆలివ్ గ్రీన్ కలర్‌లో ఉన్న పాత జీపు ఒకటి విమానంలా దూసుకు వచ్చి సెవెన్‌హిల్స్ ఆడిటోరియం పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది. ముందుగా డ్రైవింగ్ సీట్‌లో ఉన్న కురియన్ క్రిందికి దిగాడు. అతడిని ఎర్రతేలు, నల్లముత్తు అనుసరించారు. ఎర్రతేలు భుజాన్నుంచి చిన్న బ్యాగ్ వేలాడుతోంది సెవెన్ హిల్స్ ఆడిటోరియం నిర్మాణానికి పెద్ద ఎత్తున విరాళం ఇచ్చిన కాశీప్రసాద్‌ను ఆడిటోరియం లైఫ్ మెంబర్లు సెక్రటరీగా ఎన్నుకున్నారు.

కురియన్, ఎర్రతేలు, నల్లముత్తు, సెక్యూరిటీ మనుషుల అభివాదాన్ని స్వీకరిస్తూ ఆడిటోరియం లోకి అడుగు పెట్టారు.

అది దాదాపు రెండు వేల మంది పట్టే ఆడిటోరియం, విశాలమైన స్టేజి – ఫాల్స్ రూఫ్ నుండి వేలాడుతున్న అతి పెద్ద షాండిలియర్– దాని బరువు కనీసం అరటన్నుకు తక్కువ ఉండదు.

కురియన్ షాండిలియర్‌ను పరిశీలనగా చూశాడు. నిజానికి ఆ ఆడిటోరియం పైకప్పు మామూలు సినిమాహాల్సు మోస్తరుగా ఇనప రేకులతో నిర్మింప బడింది. అయితే ఫాల్స్ రూఫ్ ఉండటం వల్ల చాలా మందికి ఆ విషయం తెలియదు. షాండిలియర్‌కు కట్టిన ఇనుపతీగ ఫాల్స్ రూఫ్ గుండా లోపలికి వెళ్ళి ఒక ఇనుప దూలానికి కట్టబడి ఉంది. కురియన్ సైగను అర్థం చేసుకున్న ఎర్రతేలు చకచకా స్టేజి వైపు నడిచాడు. స్టేజి మీద ఒక మూలగా ఉన్న నిచ్చెన అతడి దృష్టిని ఆకర్షించింది. ఆ నిచ్చెన ఉన్న ప్రదేశంలో ఫాల్స్ రూఫ్ తాలూకు కార్డుబోర్డు షీట్స్ తొలిగించి ఉన్నాయి. దాంతో అక్కడ ఒక మనిషి దూరగలిగే సందు ఏర్పడింది. సాధారణంగా ఆడిటోరియం వైరింగ్‌లో ఏవన్నా లోపాలు ఏర్పడినపుడు ఎలక్ట్రీషియన్లు ఆ సందు గుండా లోపలికి వెళ్ళి సరిచేస్తారు. ఇపుడు ఎర్రతేలు కూడా అదే మార్గాన్ని ఎన్నుకున్నాడు అతడు నిచ్చెన మీదగా లోపలికి వెళ్ళి పోయాడు ఆడిటోరియంపై కప్పుకున్న ఇనప రాడ్లను పట్టుకుంటూ ముందుకు నడిచాడు.

కొద్ది గజాల దూరం వెళ్ళగానే అతడు షాండిలియర్‌కు కట్టిన ఇనుప తీగను గుర్తించ గలిగాడు. నిజానికి అది ఒక తీగకాదు. సన్నటి ఇనుప తీగలను తాడుగా పేని ఒకే దానిగా తయారు చేశారు ఎర్రతేలు ఇనుపతాడు మందాన్ని పరిశీలించాడు దాన్ని కట్ చేయడానికి కనీసం అరగంట సమయం పడుతుంది అతడు తన భుజాన వేలాడుతున్న బ్యాగ్ తడుముకున్నాడు "ఇంపోర్టెడ్ ఆటోమాటిక్ ఎలక్ట్రిక్ సా" చేతికి తగిలింది

ఎర్రతేలు బ్యాగ్ ఎక్కడ ఉంచాలా అని సాలోచనగా తనున్న ప్రదేశాన్ని పరిశీలించాడు. ఆడిటోరియం గోడ అంతమయి, అక్కడ రేకులు అమర్చడానికి ఇనుప పైపుల స్ట్రక్చర్ ప్రారంభం అయే చోట కాస్తంత ఖాళీ ఉంది ఆ ఖాళీ ప్రదేశంలో బ్యాగ్ ఉంచి నిచ్చెన మీదగా క్రిందికి దిగాడు. తనవైపే చూస్తున్న కురియన్ వైపు అంతా సక్రమంగా ఉన్నట్లు తల పరికించాడు

ముగ్గురూ బయటకు నడిచారు. బయట స్టూలు మీద కూర్చుని ఉన్న సెక్యూరిటీ మనిషితో చెప్పాడు కురియన్.

"వైరింగ్ అంతా బాగానే ఉంది...."

సెక్యూరిటీ మనిషి తల పంకించి అన్నాడు–

"ఎల్లుండి సెక్రటరీ గారు స్పాన్సర్ చేస్తున్న ప్రోగ్రాం ఉంది కదూ!"

కురియన్ అవునన్నట్టు తల ఊపుతూ జీప్ వైపు నడిచాడు. ఎర్రతేలు, నల్లముత్తు అతడిని అనుసరించారు.

*　*　*　*　*　*　*

కాశీప్రసాద్ ఇంటి గేటుముందు నిలబడి ఉన్న గూర్ఖా దగ్గిరికి ముగ్గురు యువకులు వచ్చారు. వాళ్ళు కాశీప్రసాద్ గురించి అడిగారు

"అయ్యగారు లోపలే ఉన్నారు ఏదన్నా అపాయింట్‌మెంట్ ఉందా?"

ఆ యువకుల్లో ఒకడు లేదన్నట్లు తల ఊపాడు

"అయితే లోపల హాల్లోకి వెళ్ళిన తర్వాత కుడిప్రక్క చిన్న గది ఉంటుంది. ఆ గదిలో అయ్యగారి సెక్రటరీ ఉంటాడు ముందుగా ఆయన్ని కలవండి

గూర్ఖా చెప్పిన ప్రకారం ఆ ముగ్గురు యువకులూ కాశీప్రసాద్ సెక్రటరీని కలిశారు ఇందాక గూర్ఖాతో మాట్లాడిన యువకుడే సెక్రటరీతో కూడా మాట్లాడాడు.

"మేం కరుణ హృదయ అనాధ శరణాలయం నుంచి వస్తున్నాం ఎల్లుండి ప్రోగ్రాంకి కాశీప్రసాద్ గారికి ఇన్విటేషన్ ఇద్దామని వచ్చాం ..."

"అవును కాశీప్రసాద్‌గారు మీ గురించి చెప్పారు .. మీ శరణాలయం ఫండ్స్ కోసం సురభి వాళ్ల కంపెనీ వారి మాయాబజార్ డ్రామా వేయిస్తున్నారు కదూ!"

"అవును కాశీప్రసాద్‌గారు ఆడిటోరియం ఫ్రీగా ఇప్పించి మాకు ఎంతో మేలు చేశారు. మొన్న మేం ఫ్యాక్టరీలో కలిసినపుడు తమ లక్కీ నెంబర్ పంతొమ్మిది అని కాశీప్రసాద్‌గారు చెప్పారు. అందుకని పంతొమ్మిది, ఇరవై నెంబర్లు వారికి, వారి భార్యగారికి కేటాయించాం.."

ఆ యువకుడు ఒక ఇన్విటేషన్ కార్డు తీసి కాశీప్రసాద్ సెక్రటరీకి అందించాడు దానిమీద 'వి. ఐ పి ఎడ్మిట్ 2' అనే స్టాంపు వేసిఉంది

కాశీప్రసాద్ సెక్రటరీ తన స్నేహితులకు



## నటుడు ఓంపురికి కళ్యాణఘడియ!

ఎవరో లక్షకొకరు తప్ప మిగతా అందరు జీవితాంతం వరకూ పెళ్ళి లేకుండా వుండరు అనడానికి నిదర్శనం హిందీచలన చిత్ర నటుడు ఓంపురి. ఏకైక ఆజన్మబ్రహ్మచారిగా పేరుపొందిన ఓంపురి జీవితంలో కళ్యాణ ఘడియలు వచ్చాయి. రాజస్థాన్ నాటక రంగంలో పేరెన్నిక గన్న నటి, నటుడు అమృతకపూర్ సోదరి సీమాకపూర్‌ను పెళ్లాడబోతున్నట్లు ఓంపురి ఈ మధ్య ప్రకటించాడు. ఇటీవల ఢిల్లీలో నాటకాలు ప్రదర్శించిన సందర్భంగా వీరిద్దరు ఒకరి నొకరు చూడటం తటస్థ పడిందట. అంతే మొదటి చూపులోనే ప్రేమలో పడి మనసులు యిచ్చి పుచ్చుకున్నారట. సీమాకపూర్ తల్లి తండ్రుల అనుమతి కూడా యిందుకు లభించింది. అయితే వీరి పెళ్ళి ఢిల్లీలో జరుగుతుందా? రాజస్థాన్‌లో జరుగుతుందా అనేది యింకా ప్రశ్నార్థకంగా వుందట.

పంచుకునేందుకు మరి కొన్ని ఇన్విటేషన్ కార్డులు తీసుకున్నాడు. ఇకవాళ్ళు కాశీప్రసాద్‌ను కలవ వలసిన అవసరం లేదనీ... ఆహ్వాన పత్రాల్ని తానే అందచేస్తాననీ చెప్పడంతో ఆ ముగ్గురు యువకులూ వెళ్ళిపోయారు.

కాశీప్రసాద్ సెక్రటరీ ఒక చిన్న పుస్తకం తీసి పేజీలు తిప్పాడు. అందులో మూడో తేదీ వేసి ఉన్న పేజీలో సెవెన్ హిల్స్ ఆడిటోరియంలో జరిగే ప్రోగ్రాం గురించి నోట్ చేశాడు.

* * * * * * *

మూడో తారీకు–

సాయంత్రం అయిదు గంటల సమయం.....

కాశీప్రసాద్ ఇంటి వెనక ఒక స్విమ్మింగ్‌పూల్ ఉంది. సాయంకాలాల్లో స్విమ్మింగ్‌పూల్ ప్రక్కనే వేసి ఉన్న కుర్చీల్లో కూర్చుని కాలక్షేపం చేయడం కాశీప్రసాద్ అలవాటు. ఈ రోజు అతడి ప్రక్కనే అతడి భార్య పార్వతి కూడా ఉంది.

అసలే చలికాలం. పైగా మబ్బులు పట్టి ఉండడంతో వాతావరణం మరింత చల్లగా మారింది.

"వాన వచ్చేట్టు ఉంది. లోపలికి వెళ్ళాం పదండి."

కాశీప్రసాద్ జవాబు చెప్పకుండా పార్వతి వైపు పరీక్షగా చూశాడు. ముప్పయ్ అయిదు సంవత్సరాల వయస్సున్న పార్వతిలో ఇంకా బిగి తగ్గలేదు. అయినా చూడగానే హోమ్లీగా అనిపించే పార్వతి ఎందుకో తనకు నచ్చలేదు! మగాడికి సుఖాన్ని ఎలా అందివ్వాలో పార్వతికి తెలియదు. కాని మోహినికి ఆ విషయంలో మంచి ప్రావీణ్యం ఉంది. ఆమెతో వున్నప్పుడు బయటి ప్రపంచాన్ని మరిచి పోతాడు. రోజులు గడుస్తున్న కొద్దీ తనకు మోహిని మీద ఆకర్షణ అధికం అవుతోంది. ఆమెలేందే తను ఒక్కక్షణం కూడా బ్రతకలేడు. తనకు మోహినే సర్వస్వం. కొద్ది సేపట్లో తనకు అడ్డుగా ఉన్న పార్వతి చావబోతోంది. ఆ తర్వాత ఓ ఆర్నెల్లకి మోహినిని పెళ్ళి చేసుకుంటాడు. పార్వతి చనిపోతోందని తెలిసిన తనకు బాధ వేయటం లేదు ఎందుకు?"

కాశీప్రసాద్ తనకు తనే ప్రశ్నించుకున్నాడు.

అప్పటి వరకూ అతడివంకే చూస్తున్న పార్వతి అడిగింది.

"ఏంటో శ్రీవారు దీర్ఘంగా ఆలోచిస్తున్నారు."

కాశీప్రసాద్ తల పంకించి "నీ గురించే" అని చెప్పాడు.

సరిగ్గా ఆ సమయంలో కాశీప్రసాద్ సెక్రటరీ అక్కడికి అడుగు పెట్టాడు.

"సర్! ఈ రోజు సెవెన్ హిల్స్‌లో కరుణహృదయ శరణాలయం వాళ్ళ ప్రోగ్రాం వుంది. ప్రోగ్రాం మరో గంటలో ప్రారంభం అవుతుంది."

"కాని ఆరింటికి మనకు మరో ప్రోగ్రాం ఉందికదా?"

"అవును సర్... కేరళ కాయర్ బోర్డు చైర్మన్‌తో మాట్లాడే పని ఉంది."

కాశీప్రసాద్ పార్వతి వైపు తిరిగి చెప్పాడు.

"పోనీ నువ్వు వెళ్ళకూడదూ.... సురభి కంపెనీ వాళ్ళ మాయాబజార్... నీకిష్టం కదా! నేను ఏడింటికల్లా వచ్చేస్తాను..... సరేనా!"

"ఏంటీ సురభి వాళ్ళ మాయాబజార్ నాటకమా?"

నాటకాలంటే పార్వతికి మహా ఇష్టం!

"మీరు ఏడింటికి కరెక్టుగా వస్తారా? మరి."

కాశీప్రసాద్ వస్తా అన్నట్టు తల ఊపాడు. కాని మనస్సులో మాత్రం ఏడింటికల్లా నీ శవాన్ని చూడటానికి రాక తప్పదు అనుకున్నాడు.

"అయితే నేను ఇపుడే రెడీ అవుతాను... మీరు ఏడింటికల్లా ఆడిటోరియంకి వచ్చేయ్యాలిసుమా" హెచ్చరించింది.

## హాట్ లిస్ట్!



### మాధురి-చంద్రల సఖ్యత

మాధురి దీక్షిత్‌కు ఎన్.చంద్రకు మధ్య రగిలిన వివాదం సమసిపోయింది. 'నరసింహ' చిత్రంలో ముందుగా బుక్ చేసుకున్న మాధురీదీక్షిత్‌ను కాదని డింపుల్ కపాడియాను బుక్ చేసుకున్నాడు చంద్ర. పైగా నువ్వు నా దగ్గర పని చేయాల్సిన అవసరంలేదని కూడా ఖండితంగా చెప్పాడట. అలాంటిది తన తరువాతి చిత్రంలో మాధురిని బుక్ చేసుకున్నాడు. ఇద్దరి మధ్య ఏమి 'అవగాహన' కుదిరిందో వివాదం సమసిపోయి ఒకటైపోయారట. ఆ చిదంబర 'రహస్య'మేమిటో!

కాశీప్రసాద్ తల ఊపాడు.

వెంటనే పార్వతి కుర్చీలోంచి లేచి ఇంటి వైపు నడిచింది.

* * * * * * *

సెవెన్ హిల్స్ ఆడిటోరియం సీట్లన్నీ అప్పటికే పూర్తిగా నిండి పోయాయి. ముందు వరసలో వి.ఐ.పిల కోసం కేటాయించిన సీట్లు మాత్రం ఇపుడిపుడే నిండుతున్నాయి.

పోర్టికోలోకి దూసుకు వచ్చిన ఎర్రరంగు మారుతీ కారును చూడగానే కార్యక్రమ నిర్వాహకుల్లో హడావుడి మొదలయింది. వాళ్ళలో కొందరు కారువైపు పరుగు తీసి డోర్ తెరిచారు.

పార్వతి కిందికి దిగింది.

"కాశీప్రసాద్‌గారు రాలేదా?" ఎవరో అడిగారు.

"ఓ గంటాగి వస్తారు" అని చెప్పి పార్వతి ఆడిటోరియంలోకి నడిచింది. ఆవిడ చేతిలోని కార్డు అందుకున్న ఓ వాలంటీర్ దారి చూపగా పార్వతి పంతొమ్మిదో నెంబరు సీట్లో కూర్చుంది. కరెక్టుగా ఆ సీటు పైన షాండిలియర్ వేలాడుతోంది.

దూరంగా నిలబడి ఆమెనే పరిశీలిస్తున్న కురియన్, ఎర్రతేలు, నల్లముత్తులు ఓ మూలకు చేరిపోయారు.

"అంతా సిద్ధంగా ఉంది కదా?"

ఎర్రతేలు తల ఊపి చెప్పాడు.

"ఫాల్స్ రూఫ్ లోపలివైపు కొన్ని ప్లగ్ పాయింట్స్ ఉన్నాయి. వాటిల్లో కనెక్షన్ తీసుకుంటాను. అంతా అరగంటలో పూర్తి అయిపోతుంది. షాండలియర్ సైజు చాలా పెద్దదిగా ఉంది. దానితో పాటు కనీసం మరో ముగ్గురు చావడం ఖాయం."

"ఇక బయల్దేరు."

ఎర్రతేలు తల ఊపి డయాస్ వైపు కదిలాడు. నిచ్చెన ఉన్న ప్రదేశం చీకటిగా ఉంది. తనను ఎవరూ గమనించ లేదని గ్రహించగానే ఎర్రతేలు నిచ్చెన మీదుగా పైకి వెళ్ళిపోయాడు.

రెండు రోజుల క్రితం అతడు ఉంచిన బ్యాగ్ భద్రంగా ఉంది. ఆటోమాటిక్ రంపం బయటకు తీశాడు. దానికి వేలాడుతున్న వైరు చివరున్న ప్లగ్ హోల్డర్‌లో బిగించాడు. స్విచ్ నొక్కగానే 'హిస్' మనే శబ్దాన్ని సృష్టిస్తూ విష్ణుచక్రంలా గుండ్రంగా ఉన్న బ్లేడు వేగంగా తిరగసాగింది.

ఎర్రతేలు రంపాన్ని షాండిలియర్‌కు కట్టిన ఇనుపతాడుకు ఆనించాడు. వెంటనే ఛట్... ఛట్ మంటు నిప్పురవ్వలు వెలువడ్డాయి. ఇనుపతాడు మెల్లిగా తెగసాగింది.

* * * * * * * *

జానీవాకర్ బాటిల్లోని విస్కీ గ్లాసులోకి ఒంపి కాశీప్రసాద్ చేతికి అందించింది మోహిని. కాశీప్రసాద్ మోహిని నడుం ఒంపులో చెయ్యి వేసి తన వైపు లాక్కున్నాడు. అర్ధనగ్నంగా ఉన్న దుస్తులలో మోహిని అతడి ఒళ్ళో గువ్వలా వాలిపోయింది. ఒక చేత్తో విస్కీ సిప్ చేస్తూ మరో చేయి ఆమె గుండెల మీదికి పోనిచ్చాడు కాశీప్రసాద్.

మోహిని మత్తుగా నిట్టూర్చింది. కాశీప్రసాద్ ఖాళీ అయిన విస్కీ గ్లాస్ టీ పాయ్ మీద పెట్టిపూర్తిగా మోహిని మీదికి ఒరిగి పోయాడు. ఆమె అతడి షర్ట్ బటన్స్ మీద చెయ్యి వేసింది.

కాశీప్రసాద్ గుసగుసగా ఆమెతో అన్నాడు.

"మరో కొద్ది నిమిషాల్లో దాని పని అయిపోతుంది డార్లింగ్"

"ఈజిట్!" మోహిని కిలకిల నవ్వింది!

(ఇంకావుంది)

# ఈవారంలో మీ యోగం

**30-3-1990 శుక్రవారం మొదలు 5-4-1990 గురువారం వరకు**

**మేషం:** పత్రికా ప్రకటనదారులకు, పంపిణీదారులకు, పాత్రికేయులకు, చలన చిత్ర రంగానుకూలురకు, దర్శకులకు, దర్శక వృత్తికై తహతహలాడు వారికి అనుకూలాం. రాజకీయంగా మేలైన సమయం. స్త్రీలకు: వృత్తి వికాసం. రాజకీయంగా మేలు.

**వృషభం:** చాలాకాలంగా అయోమయ స్థితిలో ఉన్న ఒకానొక గృహ విషయం సానుకూలం కానున్నది. సంఘంలో పేరు ప్రతిష్ఠలు రానున్నవి. ఆదాయమందు పెంపు చెప్పదగిన సమయం. ఈవారం 'యోగదాయకమే' అని వారాంతాన గ్రహిస్తారు. స్త్రీలకు: నగల సేకరణకు, వస్త్ర సేకరణకు, ఆదాయవృద్ధికి ఆస్కారమైన వారమే ఈవారం.

**మిధునం:** క్రమంగా 'కొంతకాలం' కనీసం కొన్ని నెలలు 'శని' బాధా నివృత్తి కాగలదు. 'గురుని' ఆశీస్సులు లభించలేదని బెంగపడకండి. చాల కాలంగా యిల్లు వదలిన వార్ని భోగట్టా, గ్రహింపగలరు. అయిన వారి సంబంధానికై ప్రాకులాట వ్యర్థం. స్త్రీలకు: కుటుంబానందం, ఆరోగ్యవృద్ధి, యత్నకార్య సిద్ధి, సభామర్యాదాది మేళ్లున్నాయి.

**కర్కాటకం:** సభారంగాన ప్రసిద్ధి, యత్న కార్య సిద్ధి, పత్రికా ముద్రణ, ప్రకటన అందు మేలు. వృత్తి యందు వికాసం. రచయితలకు, గాయకవర్గానికి, కధకులకు, అనుకూలం. బంధుమిత్రులు యింటికి రానున్నారు. స్త్రీలకు: వృత్తి యందు పెంపు, కొందరకు నూతన వృత్తి యందు పెంపు.

**సింహం:** బంధు మిత్ర సమాగమం. వృత్తి యందు అనుకూలం. రాజకీయంగా మేలు. దూరబంధువులు యింటికి రాగలరు. ఒకవేళ విదేశాల నుండి కూడ బంధువుల రాక చెప్పదగిన ముఖ్యాంశం. స్త్రీలకు: వస్తు సేకరణ, ఆదాయవృద్ధి, అనుకూల మిత్ర సమాగమం.

**కన్య:** సాహితీపరులకు మేలు. కళారంగాభివృద్ధి, రాజకీయరంగానుకూలత, ఆరోగ్యవృద్ధి, అపూర్వ వస్తు సేకరణకు ఆస్కారం. అయినవారి సంబంధం నిశ్చయమై, శుభం జరుగవచ్చు. స్త్రీలకు: ఆరోగ్యవృద్ధి 'కోర్టు' వ్యవహారాలుంటే సానుకూలం కాగలవు.

**తుల:** 'గురుడు' వారమంతా లాభదాయకుడు. యోగదాయకుడు. కళాసాహిత్య రంగాలలో చాల మందికి అనుకూలం. వృద్ధులు ఆరోగ్యరీత్యా జాగ్రత్త పడాలి. సుఖ శాంతులు, ముఖ్యరంగాలలో అనుకూలత. స్త్రీలకు: శుభ సమయం, మిత్రానుకూలత.

**వృశ్చికం:** రాజకీయ రంగాన మేలులేదు. చేసిన ఉద్యోగయత్నాలు సానుకూలం కాగల ఆశలేదు. అనవసర ప్రయాసకు గురుకాకండి. వృత్తియందు ప్రగతి చెప్పదగిన ముఖ్యాంశం. స్త్రీలకు: విద్యావేత్తల సహాయం, ధనవసతి, వస్తుసేకరణకు ఆస్కారం. బంధుమిత్ర సమాగం. ఉద్యోగ ప్రగతి.

**ధనుస్సు:** ధన విషయంగా, వస్తు వాహన సేకరణ రీత్యా అనుకూలమే. ఎంతో కాలంగా చిక్కని కళాసాహితీ రంగవిశేషం, ఈ వారం యోగదాయకమయిన గ్రహస్థితి కల్గుటచే మేలుగా పరిణమిస్తుంది. ఆదాయ వృద్ధి అపూర్వ వస్తుసేకరణకు అనుకూలం. స్త్రీలకు: పోరాడిపోరాడి ఒకానొక విషయంలో మేలు పొందుతారు.

**మకరం:** పాత మిత్రుల వలన ఏదో మేలు జరుగుట వార విశేషమే. ఒకానొక వ్యవహారంలో అపవాదురావచ్చు, ఆరోగ్యం భంగం కావచ్చు, గ్రహించి జాగ్రత్త వహించాలి. నూతన వ్యవహారం మాత్రం వారాంతాన అనుకూలం. స్త్రీలకు: సభాగౌరవం, ఆదాయవృద్ధి, ఆరోగ్యవృద్ధి.

**కుంభం:** 'గురు'ని పంచమస్థితి, మీకు సంతానానికి, బంధువర్గానికి యోగం కలిగిస్తాడు. నూతనోద్యోగం ఆశించినవారికి క్షేమం. 'ప్రమోషన్' ఆశించిన వారికి అనుకూలం. సభారంగాన ప్రసిద్ధి. సర్వరంగాలలో మేలే. స్త్రీలకు: అధిక లాభదాయకమైన వారం.

**మీనం:** 'గురుడు' అనుకూలుడు. చతుర్థ స్థితి, సుఖశాంతులకు లోపం లేదు. ఆదాయరీత్యా అనుకూలం. వారమంతా యోగదాయకమే. ఏ విధంగా యిబ్బందిరాదు. నూతన మిత్ర సమాగమం. రాజకీయరంగాన అనుకూలం. స్త్రీలకు: సభామర్యాద, వృత్తియందు పెంపు, కళారంగాన ప్రసిద్ధి, శుభకార్యాలోచనలు.

-విద్వాన్ కోటసత్యరంగయ్య శాస్త్రి

## 'సోను'కు మంచి రోజులు



సోనువాలియాకు మంచి రోజు లొచ్చాయంటున్నారు సినీ రంగంలోని వాళ్ళు కారణం ఏమిటని అడిగితే మిథున్ నటిస్తున్న చిత్రం 'సంబ్రి ఆద్మీ'లో నటిస్తుండటమేనట ఈ చిత్రంలో సోనువాలియా సరసన కునాల్ నటిస్తుండగా, మిథున్ సరసన కిమికాట్కర్ నటిస్తోంది. ఇకముందు సోనువాలియాను మిథున్ బుక్ చేసుకుంటాడేమో ననుకుంటున్నారు ఈ చిత్రం జయాపజయాలనుబట్టి ఇదిట్లావుండగా తను చేసే సంఘ సేవ గురించి ప్రచారం చెయ్యద్దంటున్నాడు ఎందుకనో?

# మందులంటే మాటలా? ప్రాణంతో ఆటలే!



## ఏయే మందులను ఎలా వాడాలి?

(గత సంచిక తరువాయి)



మందులను వాడటంలో ప్రతీ వొక్కరికీ కొంత ప్రాథమిక వైద్య పరిజ్ఞానం వుండటం ఎంతైనా అవసరం. కొన్ని మందులు పరగడుపున వాడవలసి ఉంటే- మరికొన్నింటిని అలా వాడకూడదు. ఇంకొన్నింటిని ప్రత్యేకంగా వాడవలసి ఉంటుంది. కొన్ని మాత్రలు ఒకేసారి రెండు, మూడు రకాలు కలిపి వాడకూడనివి ఉంటే- మరికొన్ని వాడిన తరువాత కొన్ని పదార్థాలను తినకూడనివి ఉంటాయి. ఇలాంటి విషయాలను మనం కూడా తెలుసుకొని గుర్తుంచుకోవాలి. అంతే గాని ప్రతీ విషయానికి డాక్టరుపైనే ఆధారపడకూడదు. ఎందుకంటే కొంతమంది స్పెషలిస్టులు అసలు రోగిని పూర్తిగా పరీక్షించడానికే సమయం లేకపోతే మనతో అన్ని విషయాలను విడమరచి చెప్పటానికి వారికి సమయమెక్కడుంటుంది. అంతా బిజినెస్ పంథాలో జరిగిపోతుంది. ఈ కారణంగా మనం కొంత ప్రాథమిక జ్ఞానంని అలవరచుకుంటే సరైన పద్ధతిలో మందులను వాడవచ్చు.

నొప్పులకు, జ్వరాలకు వాడే రకపు మందులు (ఆస్ప్రిన్, అనాల్జిన్) పరగడుపున వాడకూడదు. ఉదయం-పాలు, కాఫీ, టీ- ఏదో ఒకటి కడుపులో ఉన్నప్పుడే వేసుకోవాలి. ఆంటిబయొటిక్ మందులను కూడా పరగడుపున వేసుకోకూడదు. ఇవి వాడినప్పుడల్లా మల్టీ విటమినులను గాని విటమిను బి-కాంప్లెక్సును గాని వాడాలి.

ఎరిత్రో మైసిన్ గొట్టాలను భోజనం తరువాత వేసుకోవాలి. లేడర్ మైసిన్ వాడిన వెంటనే వెలుతురులోనికి రాకూడదు. సూర్యకాంతిని చూడలేరు. పెన్సిలిన్, దీని సంబంధిత ఇంజెక్షను లను వాడే ముందు టెస్ట్ డోస్ ముందుగా తీసుకొని శరీరానికి పడుతుందని నిర్ధారించుకొన్న తరువాత మాత్రమే ఇంజెక్షన్లను తీసుకోవాలి. టెస్ట్ డోసు తీసుకోకుండా వాడిన కొంతమందిలో రియాక్షను వచ్చి చనిపోవటం కూడా మనం చూస్తున్నాం. డాక్టర్లు తొందరలో ఇంజెక్షను యివ్వటానికి పూనుకుంటే మీరే వారికి టెస్ట్ డోసివ్వమని గుర్తు చేయాలి. బాగుండదని మీరు మొహమాట పడితే బాధ పడవలసింది మీరేను.

## జాగ్రత్తలు

విరేచనాల చికిత్సకు ఉపయోగించే సల్ఫా మందులను పరగడుపున ఎప్పుడూ వాడకూడదు. ఈ మందులను వాడినప్పుడు వీటితో పాటు ఎక్కువగా మంచినీరు త్రాగాలి. నీరు ఎక్కువగా త్రాగకపోతే ఫలితం అంతగా ఉండదు. కడుపులో ఆమ్లత్వం లేక అల్సర్లతో బాధపడే రోగులు ఆస్ప్రిన్‌ను వాడవలసి వస్తే దీంతో పాటు ప్రోటీను ఆహారాన్ని ఎక్కువగా తీసుకోవాలి.

కార్టికో స్టిరాయిడ్ సమూహానికి చెందిన అన్నిరకాల మందులను పాలతో సేవించాలి. రక్తపోటు రోగులు వాడే మందులను ఉదయం ఫలహారం తీసుకున్న తరువాత వాడటం మంచిది. చర్మ వ్యాధులకు సంబంధించిన మందులను వాడేటప్పుడు క్రొవ్వు ఎక్కువగా ఉన్న ఆహారాన్ని తీసుకోవాలి.

ఆకలి కొరకు వాడే మందులను ఆహారం తీసుకోవడానికి ముందు తీసుకోవాలి. వాంతుల నివారణలో వాడే స్టెమిటిల్, ఎవోమిన్, సిక్విల్‌ల వంటి మందులను భోజనానికి అరగంట ముందు వేసుకోవాలి. విటమిను మాత్రలను ఎలా వేసుకున్నా ఎప్పుడు వేసుకున్నా పరవాలేదు. ఎప్పుడైనా రెండు మూడు రకాల మందులను వాడవలసి వస్తే వాటిని ఒకేసారి వేసుకోకుండా మందుల స్వభావాన్ని బట్టి వేసుకోవాలి. మాత్రకు, మాత్రకు మధ్య కొంత కాలవ్యవధి ఉండటం మంచిది.

అన్నిటి కంటే ముఖ్యం, మనందరం అలక్ష్యం చేసేది– మందులను కొనే సమయంలో పేకెట్‌లపై గడువు తేదీని, ఇతర వివరాలను చూడక పోవటం. గడువు దాటిన మందుల వినియోగం హానికరం, ప్రాణాంతకం కాబట్టి. ప్రతీసారి పేకెట్‌లపై నున్న సమాచారాన్ని శ్రద్ధగా చదవాలి.

– డాక్టర్ బి. జి. వి. నరసింహారావు

సీరియల్

# ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగినకథ -: 33** పాండవులు జూదంలో ఓడిపోయి అరణ్య, అజ్ఞాతవాసాలనంతరం అర్ధరాజ్యం కొరకు కృష్ణుడిని ధృతరాష్ట్రుడి వద్దకు పంపగా సంధియత్నం విఫలమై యుద్ధం అనివార్యమవుతుంది. కౌరవ, పాండవుల మధ్య జరిగిన భీకరయుద్ధంలో కౌరవుల వైపు అందరూ మరణిస్తారు. తన తండ్రిని చంపిన వారిపై పగతీర్చుకుంటానని ప్రతినపూనిన అశ్వత్థామ నిద్రిస్తున్న పాండవులను హతమారుస్తాడు. అతనిపై ప్రతీకారం తీర్చుకోకపోతే ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడుస్తానని ద్రౌపది అనటంతో భీముడు పయనమవుతాడు.

క్షణంలో రథం రావడం, ఆయుధాలతో సహా భీముడు అధిరోహించడం జరిగిపోయాయి.

అశ్వత్థామను వెతుక్కుంటూ వెళ్లాడు భీముడు. అతని వెనకాలే అన్నదమ్ములందరూ కూడా వెళ్లారు. కృష్ణుడు వాళ్ల వెంటే వున్నాడు.

భాగీరధీ తీరంలో మునుల మధ్య ఒంటినిండా విభూతి పూసుకుని తపస్సుకు కూర్చున్న అశ్వత్థామను చూశారు వాళ్లు.

'ఓరి బాలఘాతి! నిన్న రాత్రి మారణ హోమం చేసి అప్పుడే ఎంత త్వరగా తపసివైపోయావు' అని భీముడు అశ్వత్థామవైపు విల్లు ఎక్కుపెట్టాడు.

అశ్వత్థామ చప్పున బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అందుకుని 'అపాండవమగుగాక' అని ప్రయోగించాడు.

అది మంటలు కక్కుతూ బయలుదేరేసరికి దాన్ని నివారించేందుకు అర్జునుడు కూడా అదే అస్త్రం ప్రయోగించాడు.

అదీ ఎర్రటి నిప్పులు చిమ్మింది.

అక్కడే ఆ నది ఒడ్డున తపస్సు చేసుకుంటున్న వ్యాసుడు చూశాడది.

గబగబ అశ్వత్థామ దగ్గరకు వెళ్లి 'తపోదాన సత్య బ్రహ్మ చర్యలను ఆచరించే అర్జునుడు తప్ప ఈ అస్త్రాన్ని ప్రయోగించి ఉపసంహరించ లేడు. పైగా దీన్ని మనుషుల మీద వేస్తే వేసినవాడికి అశుభం కలుగుతుంది. ఒకడిచేత ప్రయోగింపబడి మరొకడి అస్త్రంచేత దాన్ని ఉపశమింపచేస్తే ఆ దేశానికి పన్నెండేళ్లు అనావృష్టి సంభవిస్తుంది. తెలీకుండా ఇలాంటి పనులెందుకు చేస్తావో తెలీదు. నిన్నూ, ఈ పాండవులనూ, ఈ దేశాన్నీ రక్షించాలనే ఉద్దేశంతో చెబుతున్నాను. నువ్వెలాగో తపస్సు చేసుకోదలిచావు కనుక ఇకనైనా కోపతాపాలు విడిచిపెట్టి బ్రతుకు. నిన్ను చంపకుండా విడిచి పెడ్తున్నందుకు కృతజ్ఞతగా నీ దగ్గరున్న శిరోమణిని నువ్వు పాండవులకిచ్చెయ్యి' అన్నాడు వ్యాసుడు.

అప్పటికే అర్జునుడు తన అస్త్రాన్ని వెనక్కి తీసుకున్నాడు. అశ్వత్థామ కూడా తన అస్త్రాన్ని ఉపశమింపచేసేందుకు ప్రయత్నించాడు కాని చేత కాలేదు. 'పాండవేయ ప్రియ గర్భాలకు హాని కలిగించి నా అస్త్రం శాంతించు గాక' అంటూ శిరోమణి తీసి వ్యాసుడికిచ్చాడు అశ్వత్థామ.

'పాండవేయులంటే పాండవులయిదుగురే. వాళ్ల కోడళ్ల గర్భాలకు నీ అస్త్రం హాని కలిగించడానికి వీల్లేదు' అన్నాడు వ్యాసుడు.



'లేదు సకల పాండవ వధూ గర్భాలనే ఉద్దేశ్యంతోనే నే నంటున్నాను' అన్నాడు అశ్వత్థామ మొండిగా.

'పాండవుల కొడుకులందర్నీ చంపావు. ఇప్పుడు పాండవేయ భార్యల గర్భాల్లోని పసికందులందర్నీ దారుణంగా హత్య చెయ్యాలనుకుంటున్నావు. ఇది అన్యాయం, ఒక్కళ్లనైనా నువ్వు విడిచిపెట్టాలి, ఆ కడుపున పుట్టే వాడు పాండవ వంశాన్ని నిలబెట్టాలి. వాడు దానాలూ క్రతువులూ చేస్తూ ప్రజాదరాన్ని చూరగొనాలి' అన్నాడు కృష్ణుడు.

'ఉత్తర గర్భాన్ని రక్షించాలని చూస్తున్నావు నువ్వు. అది నీవల్ల కాదు. అందరూ నా అస్త్రానికి ఆహుతి కావాల్సిందే' అన్నాడు అశ్వత్థామ.

'నీకు తపస్సెందుకు? క్రౌర్యంధ్యంతో నీ అంతరంగమంతా మూసుకుపోయింది. నీ మనస్సులో చీకటి ఘనీభవించింది. నీతో నాకు మాటలనవసరం. మహావీరుడైన అభిమన్యుడి తేజం ఉత్తర గర్భంలో వుంది. నువ్వు చంపినవాణ్ణి నేను బతికిస్తాను. వాడికి దీర్ఘాయువిస్తాను' అన్నాడు కృష్ణుడు.

అశ్వత్థామ హేళనగా నవ్వాడు.

'అలాగే చెయ్. చచ్చినవాళ్ణి బ్రతికిస్తే నీ శక్తేమిటో లోకానికి కూడా తెలుస్తుంది' అన్నాడు.

కోపం వచ్చింది కృష్ణుడికి. 'నువ్వు తిన డానికి తిండిలేక, నిస్సహాయుడవై శరీరం నిండా దుర్గంధం, రక్తం పూసుకుని మూడు వేల ఏళ్లు అడవుల వెంట తిరుగు. నాచేత రక్షింపబడే ఉత్తర కొడుకు కృపాచార్యుడి దగ్గర ధనుర్విద్య అభ్యసించి అనేక వందల సంవత్సరాలు ఈ భూమిని పరిపాలిస్తాడు. అతనికి జనమే జయుడనే కొడుకు పుట్టి నీ ఎదురుకుండానే ఉజ్వలంగా ప్రకాశిస్తాడు' అన్నాడు.

'తథాస్తు' అని జయం పలికాడు వ్యాసుడు. అశ్వత్థామ మాట్లాడకుండా తపో వనానికి వెళ్లిపోయాడు. పాండవులూ,కృష్ణుడూ అశ్వత్థామ ఇచ్చిన శిరోమణిని తీసుకుని రథాలెక్కారు.

పద్మరాగ ప్రభలు చిమ్ముతున్న ఆ రత్నాన్ని చూసి ద్రౌపది సంతోషించింది.

ఆకలి దప్పులూ, రోగ మృత్యుభయాలూ, దేవ దానవ, నాగ, తస్కర భయాలూ లేని చూడామణిని వదులుకున్నాక అశ్వత్థామ చచ్చినవాడితో సమానంకాక మరేమిటి? అనుకుంది.

ఆవిడ మొహంలోకి వెలుగొచ్చింది.

'అన్నదమ్ముల్నీ, కొడుకుల్నీ చంపుకున్న నాకీ విజయం విజయంగా లేదు' అన్నాడు ధర్మరాజు.

ద్రౌపది తలెత్తి చూసింది 'మీ రెప్పుడూ శాంతినే కోరుకున్నారు అన్నదమ్ములు పరస్పరం మైత్రితో వుండాలనే ఆకాంక్షించారు కాని మీ తమ్ములు మీ మాట వినక పోతే మీదా తప్పు? ఆ ధృతరాష్ట్ర కుమారుల వల్లే ఇంత వినాశనం జరిగింది మీరూ మీరూ కలహించుకుని మధ్యలో నాకు కడుపు కోత విధించారు నిజానికి మీ అందరి కంటే ఎక్కువగా నష్టపోయింది నేను' అంటూ ఏడ్చింది



ధర్మరాజుకు ఆమెను ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు.

'కాదని ఎవరన్నారు? దుర్యోధనుడు మూర్ఖత ప్రకటిస్తే నేను సహించి వూరుకున్నా బాగుండేదనే చెబుతున్నాను. రాజ్యం కోసం, అధికారం కోసం పోటీ పడి చివరికి కన్న బిడ్డల్ని కూడా పోగొట్టుకున్నాను. ఇప్పుడు త్రిలోక రాజ్యం వచ్చినా ఈ దిగులు మాసిపోదు నాకు' అన్నాడు.

అంత వరకూ కనబడని విషాదం ఒక్క సారిగా ధర్మరాజు కంఠంలో వినబడే సరికి ద్రౌపది కదిలి పోయింది. చుట్టూ అందరూ వున్నారని వూరుకుంది గానీ లేకపోతే యుధిష్ఠిరుడ్ని ఆ క్షణాన ఒళ్ళోకి లాక్కుని అనునయించి వుండేది.

'నేను పోయిన నా బిడ్డల గురించి ఎంత బాధ పడుతున్నానో బ్రతికున్న మీ అయిదుగురి గురించి కూడా అంతే బాధ పడుతున్నాను. అరణ్యాల్లో తిరిగి అన్నెన్ని కష్టాలు పడ్డారు మీరూ, మీ తమ్ముళ్ళూ. తీరా యిప్పుడు రాజ్యం వచ్చాక మీరు, నాకివేవీ అక్కర్లేదు, నన్ను ఒంటరిగా వదిలెయ్యండనడం ఏం ధర్మమో చెప్పండి? మీరు పడ్డ కష్టాలన్నీ అప్పుడే మరచి పోయారా?' అంది.

'నా మనసు మార్చడానికి ప్రయత్నం చేస్తున్నావు' అన్నాడు ధర్మరాజు.

'అవును. ఖచ్చితంగా అదే చేస్తున్నాను. డబ్బు పట్ల అధికారం పట్ల మీకెప్పుడూ వ్యామోహం లేదని నాకు తెలుసు. గర్వంతో ఒళ్ళు తెలీక ధన

## ద్రౌపది

బలంతో అధికార మదంతో ఎదుటి వాళ్ళని పరాభవించే వాళ్ళకి గుణపాఠం చెప్పేటందుకే మీరు ఈ యుద్ధం చేశారు. కాంతా కనకాలకు మీ రెప్పుడూ దాసులు కాలేదు, కారు కూడా. కాని ఒక విషయం గుర్తుంచుకోండి– రాజులకు పేద మనసుంటే లోక రక్షణ జరగదు. రాజు నరరూపంలో తిరిగే పర దేవత లాంటి వాడు. ప్రభువులో కావాలనే దేవుడు దండనీతిని ప్రతిష్ఠించాడు. అపరాధుల్ని దండించని రాజు రెండు లోకాలకూ చెడి పోతాడు. కులాంగనను జుట్టు పట్టి సభలోకి ఈడ్చుకొచ్చి నందుకూ, రమ్మని ఒడి చూపించి నందుకూ, నోటికి వచ్చినట్టు నీచంగా మాట్లాడి నందుకూ ధృతరాష్ట్రుడి కొడుకుల్ని మీరు హతమార్చారు. అందులో తప్పేం లేదే!

....అయినా మీరేమనుకోనంటే ఒక మాట అడగనా? దాయాది తమ్ముళ్ళు పోయారనే మీరు అంతగా విచారిస్తున్నారే నాకు ఏమీ కాని వాళ్ళు, నా భర్తలకి పెద తండ్రి కొడుకులు నన్ను అన్నెన్ని అవమానాలకు గురి చేస్తే నేనెంతగా విరక్తి చెందాలి?' అని అడిగింది ద్రౌపది.

ధర్మరాజు మౌనం వహించాడు.

అతను ఎంతకీ మాట్లాడక పోయే సరికి 'నాకు మీ మీద కోపం లేదు. మీతో నా సంఘర్షణని పంచుకోవాలని పించింది కాబట్టి అవన్నీ అడిగాను' అంది.

దాంతో ధర్మరాజు మనసు తేలిక పడింది.

చివరికి ఒక నిర్ణయానికి వచ్చిన వాడులా భీముణ్ణి పిలిచి 'హస్తినాపురానికి ప్రయాణ సన్నాహాలు చెయ్యండి' అన్నాడు.

భీముడు ముందు నమ్మలేదు. అన్నయ్యేనా ఈ మాట అంటోంది అని ఒక్కసారి కెవ్వున అరవ బోయాడు. ఆనందంతో నోట మాట రాలేదు. ద్రౌపది వంక కృతజ్ఞతగా చూశాడు.

* * * *

మర్నాడు ఉదయమే ప్రయాణం.

పదహారు తెల్ల గుర్రాలు పూన్చిన బంగారు రథం వచ్చి కుటీరం ముందు నిలిచింది.

ధర్మరాజు ద్రౌపదీ సమేతంగా దాన్ని అధిరోహించాడు.

భీముడు సారథి అయ్యాడు. అర్జునుడు అన్నకు తెల్లని ముత్యాల గొడుగు పట్టాడు. నకుల సహదేవులు వింజామరలు వీస్తున్నారు. పంచ మహా వాద్యాలు తారస్థాయిలో మ్రోగాయి. నరేంద్రు లంతా తమ తమ సేనలతో ధర్మరాజు వెంట నడిచారు.

సాయంత్రానికి వాళ్ళంతా హస్తినాపురం చేరుకున్నారు.

రాజ వీధిలో ప్రవేశించిన ధర్మరాజు మీదా, పరివారం మీదా పుణ్యాంగనలు ముత్యాలూ అక్షింతలూ చల్లారు.

ధర్మరాజు రాజ మందిరం ద్వారం దగ్గరకు వెళ్ళి

ఏనుగు మొగసాలలో రథం దిగాడు. గృహ దేవతల్ని పూజించి మళ్ళీ నగరపు పొలి మేరకు వచ్చి నగర దేవతల్ని పూజించాడు. బీదలకు అన్న వస్త్రాలు దానం చేశాడు. బ్రాహ్మణులకు గోవులూ, బంగారం ఇచ్చాడు. అందరూ ఆయనను ఆశీర్వదించారు. తరవాత ధర్మరాజు వైభవంగా వున్న రాజ భవనం వైపు కదిలి వెళ్ళాడు.

అప్పటికే అక్కడ యుధిష్ఠిరుడి పట్టాభిషేకానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చక చక జరిగిపోయాయి.

రాజ మందిరానికి బయటవున్న పెద్ద సభా భవనంలో ఎత్తైన బంగారు సింహాసనం వేశారు. దాని మీద తూర్పు ముఖంగా ధర్మరాజును కూర్చో బెట్టారు.

ఆయనకు ఎదురుగా వున్న కాంచన పీఠం మీద కృష్ణుడూ సాత్యకీ కూర్చున్నారు.

కుడి వైపు భీముడు, ఎడమ వైపు అర్జునుడు ఆశీనులయ్యారు. వెనకాల నకుల సహదేవుల్ని చెరొక వైపునా కూర్చో బెట్టుకుని కుంతీదేవి కూర్చుంది. కృష్ణుడికి కుడి వైపున ధృతరాష్ట్రుడూ, ఆయనకు పక్కగా విదురుడూ, ధౌమ్యుడూ వెనకాల **యుయుత్సుడూ**, సంజయుడూ, గాంధారీ కూర్చున్నారు. కృపాచార్యుడికి ధౌమ్యుడి పక్కనే ఆసనం వేశారు. ధర్మరాజు పూలూ, అక్షింతలూ, బంగారం, వెండి, మట్టి చేతో స్పృశించాడు.

ఇంతలో అభిషేక ద్రవ్యాలన్నీ వచ్చాయి అక్కడికి. ధౌమ్యుడు లేచి పట్టాభిషేకం కోసం ప్రత్యేకంగా అమర్చిన వేదికను అలంకరించాడు. దానిమీద నవరత్న ఖచిత కాంచన పీఠాన్ని ప్రతిష్ఠించాడు. దాని మీద పెద్ద పులి చర్మం పరిచాడు. తరువాత సకల నదీ జలాలతో నింపిన రకరకాల కుంభాలు

## ద్రౌపది

**తెప్పించి** వాటన్నిటికీ రత్నాలతోనూ ఆకులతోనూ పూలతోనూ తోరణాలు కట్టి సమంత్రకంగా సంస్కారం జరిపించాడు.

సభలోని వాళ్ళంతా ముగ్ధులై కళ్ళప్పగించి చూస్తున్నారు. సుముహూర్తానికి కొంచెం ముందుగా వేద మంత్రాల నడుమ ధర్మరాజును వేదిక మీదున్న పీఠం దగ్గరకు తీసుకు వచ్చారు. కనకాంగద కేయూరాన్ని ధరించి పీతాంబరాలంకృతుడై వున్న పాండవాగ్రజుడు గంభీరమైన నడకతో వచ్చి కాంచన పీఠం అధిరోహించాడు. కస్తూరీ తిలకం వల్ల అతని ముఖం కళకళలాడుతోంది. శోభనాలంకృతురాలైన ద్రౌపదిని కూడా తీసుకు వచ్చి ఆ పీఠం మీదే ఆయనకు ఎడమ పక్కన కూర్చోబెట్టారు. వెంటనే నాదస్వర విద్వాంసులు మంగళ వాద్యాలు వినిపించారు. అగ్ని హోత్రం వేల్చి హోమ విధులు నిర్వర్తించగానే కృష్ణుడు వచ్చి "సమస్త పృధివికీ అధిపతివై పరిపాలించు" అంటూ పవిత్రోదకంతో ధర్మరాజును అభిషేకించాడు. తరువాత ధృతరాష్ట్రుడు వచ్చి, రత్న ఖచిత కిరీటాన్ని ధర్మరాజు శిరస్సున అలంకరించాడు.

"బహు పరాక్, కౌరవ వంశ తిలక అజాత శత్రు, మహారాజ ధర్మతనయ పరాక్ ...." అని వంధిమాగధులు స్వరమెత్తి పలికారు. సభలో అన్ని మూలల నుంచి జయ జయ నినాదాలు వినపడ్డాయి.

"మహారాజా! దైవ మానుష సంపన్నుడ వైన నీ విజయం, పట్టాభిషేకం ఎంతో శోభాయమానంగా వున్నాయి" అని నుతించారు కొందరు విప్రులు.

## సునీల్ చిత్రం

వరకట్న సమస్య ఆధారంగా సునీల్‌దత్ 'ఏ ఆగ్ కబ్ భుజేగీ' అనే చిత్రాన్ని నిర్మించే పనిలో నిమగ్నమయ్యాడు. అంతకు ముందు ఈ చిత్రంలో డింపుల్‌ను బుక్ చేశాడు. ఎలక్షన్ల ముందే ఈ చిత్రం విడుదల చేయాలనుకుని చేయలేక పోవటం, ఈలోగా డింపుల్ నిష్క్రమించటం జరిగింది. తీసిన రీళ్ళు తొలగించేసి రేఖతో యిప్పుడు మళ్లీ చిత్రాన్ని ప్రారంభించాడట. అనుకున్న ప్రకారం ఈ చిత్రం విడుదలయ్యేలా లేదు. ప్రజలకు ఈ చిత్రం ద్వారా మంచిని

ధర్మరాజు లేచి నిలబడి వినయంగా వారికి నమస్కరించి, "మాలో ఏ గొప్పతనం వున్నా లేకపోయినా మీ అంతటి విద్యా వినయ సంపన్నులు మమ్మల్ని ఇలా కొనియాడడం వల్ల మేం ధన్యులమయ్యాం" అన్నాడు.

విప్రులు ఆశఃపూర్వకంగా ధర్మరాజు శిరస్సుమీద అక్షతలు చల్లారు.

ధర్మరాజు మళ్ళీ అన్నాడు 'మాకు తండ్రీ గురువూ, దైవం అన్నీ మాకు మా పెదతండ్రిగారే.

ఈ రోజు నాకు పట్టాభిషేకం జరిగినా మీరందరూ పూర్వంలా ఆయన ఆజ్ఞ మన్నిస్తూ ఆయనకు ఇష్టమైనట్టుండమనే నేను కోరుకుంటున్నాను. మీరంతా ధృతరాష్ట్ర మహారాజు పట్ల వినయ



అందివ్వాలనుకుంటున్న సునీల్ దేశంలో తీవ్ర రూపందాల్చిన వరకట్న సమస్యను తీసుకుని చేతులు కాల్చుకుంటున్నాడేమోనని సినీ ప్రముఖులు ఆందోళనపడుతున్నారు. మరి ఈ చిత్రం టాక్ ఎలా వుంటుందో?

విధేయతలతో మెలగడమే నిజంగా నాకు కావల్సింది. కురుక్షేత్ర సంగ్రామంలో అయినవాళ్ళని ఎందర్ని పోగొట్టుకున్నా నేను మా పెదతండ్రిని సేవించుకోవడానికే ఈ పట్టాభిషేకానికి తల వొగ్గాను. ఈ నేలకూ, మనకూ, మన అష్టైశ్వర్యాలకూ కూడా ధృతరాష్ట్ర మహారాజే నిజమైన ప్రభువు'

ఆ మాటలు వింటున్నప్పుడు ధృతరాష్ట్రుండి గ్రుడ్డికళ్ళు చెమర్చాయి. కొడుకును గాఢాలింగనం చేసుకున్నాడు. ధర్మరాజు ఆ తరువాత యుద్ధంలో చనిపోయిన వీరులందరికీ పుణ్యగతులు కలగాలని అనేక దానాలు చేశాడు. సత్రాలూ, గుళ్ళు గోపురాలూ కట్టించాడు. చెరువులు త్రవ్వించాడు. చెట్లు నాటించాడు. ప్రజలంతా సుఖ సంతోషాల్లో మునిగి తేలుతున్నారు. ఆ సమయంలో కృష్ణుడొక ప్రతిపాదన చేశాడు– ధర్మరాజు అశ్వమేధ యాగం చెయ్యాలి.

చక్రధారి ప్రతిపాదించాక కాదనే మాటేముంది? సరే అంటే సరే అనుకున్నారన్నదమ్ములు.

అంతే.

మళ్ళీ హడావిడి మొదలైంది.

ఈలోగా ద్వారకకు వెళ్ళి తల్లిదండ్రుల్నీ, బంధువుల్నీ చూసొస్తానని బయలుదేరాడు కృష్ణుడు.

కుంతీకుమారులు బిక్క మొహాలు వేశాక, కృష్ణుడు నవ్వి 'ఎక్కడున్నా నేను మీ వాణ్ణే. నా ఆలోచనలన్నీ మీ చుట్టే పరిభ్రమిస్తుంటాయి....' అన్నాడు.

రథం కదిలి వెళ్ళిపోయింది.

* * * *

అశ్వమేధయాగానికి హస్తినాపురం సిద్ధమవుతోంది. రాజ భవనాన్ని ప్రత్యేకంగా అలంకరించినట్టే నగరంలోని ప్రతి ఇంటినీ పచ్చటి తోరణాలతోనూ రంగ వల్లులతోనూ అలంకరించారు.

యాగానికి చుట్టు ప్రక్కల రాజ్యాల నుండి ఆశ్రితులూ, శ్రీమంతులూ విచ్చేస్తున్నారు. బలభద్ర సాత్యకి, కృతవర్మ, ప్రద్యుమ్న, సాంచాతి యాదవ సమేతంగా కృష్ణుడూ ద్వారక నుంచి బయలుదేరాడు. కృష్ణుడు వస్తున్నాడని తెలిసి అతనికి హస్తినాపుర పొలిమేరల్లోనే స్వాగతం చెప్పేందుకు యుయుత్సుడూ, విదురుడూ వెళ్ళారు.

కుంతి సంతోషంలో తల మునకలవుతోంది. ఇన్నాళ్ళకు తన కలలు ఫలించాయి. తన కష్టాలు గట్టెక్కాయి. తన బిడ్డలకు మళ్ళీ మంచి రోజులొచ్చాయి.

కృష్ణుడి రాక కోసం ఎదురు చూస్తూ కూర్చుందామె. ఇంతలో ఒక దాసి గబగబ పరుగెత్తుకొచ్చి 'మాతా! శ్రీకృష్ణదేవుడు వచ్చేశాడు. ధృతరాష్ట్ర మహారాజునూ, గాంధారీ దేవినీ కలిసి మన మందిరానికి వస్తున్నాడు' అని చెప్పింది.

కుంతి ఆనందంతో తడబడుతుంటే 'అత్తా! నేను వచ్చేను' అని కుంతి పాదాలకు నమస్కరించాడు కృష్ణుడు.

'ధర్మక్షేత్రాధిపతివై వర్ధిల్లు తండ్రీ' అంటూ కృష్ణుణ్ణి లేవదీసి శిరస్సు ముద్దాడింది కుంతి. ఇంతలో ఒక పరిచారిక వచ్చి 'అమ్మా! ముని మనవడు పుట్టాడు' అని చెప్పింది.

శుభం మీద శుభం.

ఆ ఆనందపారవశ్యానికి ఆగలేక పోతోంది కుంతి. తన మెళ్ళో వున్న రత్నాల హారం తీసి పరిచారిక మెళ్ళో వేసింది. దాని దోసిట నిండా ముత్యాలు పోసింది. గబగబ ప్రసవ గృహం వైపు పరుగు తీసింది. తీరా ఆమె మందిర ద్వారం దగ్గరకు వెళ్ళేసరికి పెద్దగా ఏడుపులు వినిపించాయి.

కుంతి నిర్విణ్ణురాలైంది.

వణుకుతున్న కంఠంతో 'ఏమైంది?'– అని అడిగింది ద్రౌపదిని.

ద్రౌపది మొహంలో నెత్తురు చుక్కలేదు. భావరహితంగా వుంది.

కుంతి గుండె వేగంగా కొట్టుకుంది.

(ఇంకా వుంది)

1. జూద మందిరంలో 'ద్రౌపది'కి జరిగిన అవమానానికి ముఖ్యకారకులు ఎవరు?
2. ద్రౌపది-కుంతి-ఈ సీరియల్ చదివి ఈ 'యిద్దర్నీ' పోల్చి చూడండి!
3. ద్రౌపదికి ఐదుగురు భర్తలలో ఎవరి మీద మక్కువ ఎక్కువ?-పదిహేను వాక్యాలలో రాయండి.
4. ద్రౌపదికి కర్ణుడి మీద కోపం ఎక్కువా? దుర్యోధనుడి మీద కోపం ఎక్కువా?-పది వాక్యాలలో రాయండి.

**నిబంధనలు**

మీరు పంపే వ్యాసం అరఠావు నుంచి అరఠావున్నరకి మించకూడదు. పంక్తులు దూరంగా అక్షరాలు విడివిడిగా వుండాలి.

**వ్యాసాలలో ఉత్తమయిన వాటికి**

1. బ్రీఫ్ కేసు, 2. చిన్నకామిరా, 3. గోడగడియారం, 4. ట్రాన్సిస్టర్ రేడియో-యింకా మరికొన్ని చిన్న బహుమతులు వుంటాయి!

వీటి వివరాలన్నీ కూడా మీకు గత సంచికలు తిరగేస్తే సీరియల్ పేజీల్లోనే దొరుకుతాయి!

**బహుమతులు సమర్పణ: నాగేశ్వరి పబ్లికేషన్స్ విజయవాడ-2 వారు.**



# వీక్లీ పోస్ట్

## గౌతమి

ఈ వారం మీ (మా) పత్రిక 'గౌతమి' ముఖచిత్రంతో ఆకర్షణీయంగా వుంది. "సూపర్ హీరో" సీరియల్ చాలా ఆసక్తికరంగా వుంది. 'ద్రౌపది' సీరియల్ సింప్లీ సూపర్బ్ "టిట్ ఫర్ టాట్" "కవితా! యువతా!!" "ప్రశ్నావళి" శీర్షికలు చాలా బావుంటున్నాయి. "లవ్ గేమ్" సీరియల్ అనూహ్యమైన మలుపులతో చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది....

-రఫీ
అయితానగర్

## ద్రౌపది

మహాభారతము, రామాయణము, భాగవతము మళ్లీ మళ్లీ వినాలన్పించే, చూడాలన్పించే, కమనీయమైన రమ్యమైన కావ్యాలు. ఎన్నిసార్లు చూసినా, విన్నా, చదివినా మళ్లీ మళ్లీ నూతనత్వము గోచరిస్తుంది.

కొంగ్రొత్త మధురిమను సృష్టిస్తూ రచయితలు తమ రచనలు వాటిపై కేంద్రీకరించి, పాఠకులమైన మా హృదయాలను పరవశింపజేస్తున్నారు. అందుచేతనే మన పత్రికలో ద్రౌపది టైటిల్‌తో ప్రయాగ రామకృష్ణగారు మహాభారతంలోని మధుర ఘట్టాలను తిరిగి మాతో చదివింపజేస్తున్నందుకు నా కృతజ్ఞతలు.

ద్రౌపది మొదట భారత వీరనారి. ఆమె ఆశయాలు నేటి స్త్రీలకు ఆచరణీయాలు. ఆమె చరిత్ర పత్రికకు మెరుపు.

-మాదిరెడ్డి భాస్కర్ రెడ్డి
భీమారం

## సినిమా-సినిమా

వీక్లీ (2-3-90) ఆంధ్రసచిత్రవారపత్రికలో "-ఎ-320 ఎయిర్ బస్ విషాదాంతం" ఎడిటోరియల్ చదివాక సగటు మనిషిగా నా హృదయం ద్రవించిపోయింది! ఏ శవాలెవరివో ఎరుగని భయానక బీభత్సహృదయవిదారక దృశ్యం పునరావృతం కా'కూడని' దుర్ఘటన!! "విమాన ప్రయాణాలలో సాంకేతిక పరిజ్ఞానం పెరుగుతున్నకొద్దీ ప్రమాదాలు తగ్గడానికి బదులు ఒక్కొక్కసారి-అదే సాంకేతిక ప్రజ్ఞాపాటవాలు ఎదురు తిరిగి ఘోరప్రమాదాలు సంభవించటం యిటీవల ఎక్కువైం"దన్న 'వీరాజీ'గారి మాటలు సందర్భోచితం! పోతే 'వీక్లీపోస్ట్'లో ఒక పాఠకుడు "సినిమా సినిమా" శీర్షికను ఎత్తివేయమనటం ఆమోదయోగ్యం కాదు.

తెరమీది కబుర్లను అడ్వాన్స్‌గా ప్రెజెంట్ చేస్తున్న వ్యాల్యుబుల్ ఫీచర్ "సినిమా సినిమా" థింక్ ఇట్ ఓవర్!!

శ్రీధరాచార్య, ఎ. జ్యోషి
అయిజ.

## ఇంటికి శాపం...

9-3-90 సంచిక పత్రికలో రమ్యకృష్ణ ముఖచిత్రం రియల్లీ ఫెంటాస్టిక్. ముఖ్యముగా "ఇంటికి శాపం ఇల్లాలే" కుసుమకుమారిగారి హాస్యనవలిక చదువుతుంటే కడుపుచెక్కలుచేసుకున్నాము. ప్రతివారం యిలాగే హాస్యకథలందిస్తే మన పత్రిక నెం.ఎ.వన్.స్థానాన్ని రెండవసారికూడా అతిగా ఆక్రమించుకుంటుందనడంలో సందేహం ఎంతమాత్రంలేదు.

ఎస్.ఎమ్.బాషా, ఎస్.బి. సాహెబ్
మచిలీపట్నం

## ద్రౌపది- లవ్ గేమ్

ముఖ్యంగా చల్లా సుబ్రహ్మణ్యంగారి 'లవ్ గేమ్' ఉత్కంఠ భరితంగా వుంది. వారం వారం పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూసేలా చేస్తోంది! ధన్యవాదములు! శాతవాహన గారి వజ్ర సంకల్పం, ప్రయాగ రామకృష్ణగారి ద్రౌపది, మన్నెం శారద సూపర్ హీరో,
సీరియల్స్ వేటికవే పోటీగా మమ్మల్ని ఆకర్షించి, ఆకట్టుకొంటున్నాయి. అయితే పౌరాణిక గాథ ద్రౌపదికీ, యువతరాన్ని ఉర్రూత లూగించేలా వ్రాస్తోన్న చల్లాగారి 'లవ్ గేమ్' సీరియల్స్‌కే మా మొదటి బహుమతి! మిగతా సీరియల్స్ కూడా ఎంతో బావుంటున్నాయి

-సి రవితేజస్వి, చింతలూరు

## లవ్ గేమ్

నా అభిమాన ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నా అభిమాన రచయిత చల్లా సుబ్రహ్మణ్యం గారి లవ్ గేమ్ సీరియల్ ప్రతివారం ఎంతో సూపర్‌గా ఉంది ఈ సీరియల్‌లో నవ్య పాత్రలో ముందు ముందు మేము ఊహించని మార్పులు రావచ్చుని అనుకొంటున్నాం ఈ సీరియల్ రచయితకి, ప్రచురిస్తున్న మా అభిమాన పత్రిక ఎడిటర్‌కి నా అభినందనలతో.

పి చాముండేశ్వరి (ఒంగోలు)

## చాలా శ్రద్ధ

ఈ మధ్య మీరు మా (మీ) పత్రిక ముఖచిత్రాల మీద తీసుకుంటున్న శ్రద్ధ మాకు ఆనందాన్ని కలుగజేస్తున్నది ఇకపోతే నా అభిమాన శీర్షిక "టిట్ ఫర్ టాట్ త్వరలో '50'వ నంబరును చేరుకుంటున్నందుకు ఆనంద దాయకంగా వుంది మీరు వారం వారం ప్రచురిస్తున్న కథలు బాగుంటున్నాయి ఈ వారం (9-3-90) సంచికలో 'కర్తవ్యానికి గండి' కథ పత్రికకు సరికొత్త అందాన్నిచ్చింది ఈ కథలోని 'రమణయ్య ప్రిన్సిపాల్ లాంటి వాళ్ళు ఇప్పుడుండి వుంటే అని ఆలోచిస్తే అటువంటి వారికి ఇప్పుడు స్థానం లేదని పిస్తుంది 'యువతా కవితా' శీర్షిక కుంచించుకు పోతోంది దయచేసి కవితా పేజీని పెంచాలని కోరుతున్నాను

– టి రాంప్రసాద్, ప్రొద్దుటూరు

## "శివ పంచాక్షరీ స్తోత్రం" ఉచితం

మహాశివరాత్రి సందర్భంగా శ్రీ ఆది శంకర రచించిన "శివ పంచాక్షరీ స్తోత్రం" ప్రతులు భక్తులకు ఉచితంగా అందజేయబడతాయి ప్రతులను కోరు భక్తులు తమ విజ్ఞప్తితో స్వంత చిరునామా గల 60 పైసల స్టాంపు గల కవరును కార్యదర్శి, రుద్ర, రేస్, పి బి నెం 6900, మద్రాసు- 600041 అన్న చిరునామా ఆంగ్లంలో వ్రాసి పొందవచ్చు

## "చిన్న" మూడవ షెడ్యూల్

"ఫిబ్రవరి 13న రెండో షెడ్యూల్ ముగించాం. మూడవ షెడ్యూల్ 18 నుండి 20 వరకు జరిగింది. నాలుగో షెడ్యూల్‌ను రాజమండ్రి ప్రాంతాలలో ప్లాన్ చేశాం," అన్నారు శ్రీ చక్రవర్తి. ఈయన దర్శకత్వంలో జయప్రద ఎస్వీ తేజ పాత్ర ధరిస్తూ, సమర్పించే శ్రీ ఆర్.కె. ఫిలిమ్స్ "చిన్న" చిత్రంలో ఆమె సోదరుడు శ్రీరాంకుమార్ హీరో. వాణీ విశ్వనాధ్, 'అంకుశం' రామిరెడ్డి, వేలు, చక్రవర్తి, చంటి, జనకరాజ్, మురళీకృష్ణ, దేశిరెడ్డి, మనోరమ వగైరా నటవర్గం. శివద త్తాబ్రదర్స్ కథకు సత్యమూర్తి సంభాషణల కర్త. సిరివెన్నెల సీతారామశాస్త్రి గీతాలు, బప్పీలహరి సంగీతం, ఎస్.ఎస్. రాజ ఛాయ, సురేష్-ప్రకాష్ నృత్యాలు విక్కీ సాహసాలు, రాయప్రోలు గోపి సంయుక్త దర్శకత్వం, డి. నందకిశోర్- రంగారావు సహకార దర్శకత్వం, నందమూరి బెనర్జీ కూర్పు తెరవెనుక హంగులు, రాజబాబు నిర్మాత, శ్రీరాంకుమార్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

## "మూగప్రతిజ్ఞ" త్వరలో

"ఈ చిత్రంలో పాము, కోతి, గొర్రె, పొట్టేలు ప్రేక్షకులను సంభ్రమాశ్చర్య చకితుల్ని చేస్తాయి," అన్నారు ఎస్.వి. సుబ్బరాజు. ఈయన కథ సమకూర్చి, సమర్పించే శ్రీ వాణీ ఆర్ట్స్ "మూగప్రతిజ్ఞ" చిత్రంలో శరత్‌బాబు, అశ్వని, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, పద్మనాభం, త్యాగరాజు, భీమరాజు, శివప్రసాద్, మాస్టర్ రాధా, కపిల్‌దేవ్, అన్నపూర్ణ నటించారు. కొంపెల్ల విశ్వం మాటలు, రాజ్-కోటి సంగీతం, ఎస్.ఎస్. రాజు-ఆర్.కె.రాజు ఛాయ, స్వర్గీయ ఆత్రేయ గీతాలు, గౌతంరాజు కూర్పుతో వి.ఎస్. రంగనాథ్‌వర్మ, వి. అచ్యుతరామరాజు నిర్మాతలు, వెంకటేష్ దర్శకుడు.



"అగ్గిరాముడు"లో వెంకటేష్

# అశ్లీలమంటే అసహ్యం...
## -డ్రీమ్‌గర్ల్



(గత సంచిక తరువాయి)

ప్రశ్న: దర్శకుడి ప్రాముఖ్యత ఏమిటి?

జవాబు: దర్శకుడికి ప్రతినిముషం విలువైనదే. ఒక చిత్రం జయాపజయాలు ఆదర్శకుడిపై ఆధారపడి వుంటాయి.

ప్రశ్న: 'నూపుర్'పై మీ అభిప్రాయం?

జవాబు: బాగా వచ్చింది. కళకు-భావోద్రేకానికి మధ్య సమానతను తీసుకురావాలని ప్రయత్నించి సఫలమయ్యాము.

ప్రశ్న: మీ కలలు పండాయని మీరు భావిస్తున్నారా?

జవాబు: ఈ సీరియల్ ద్వారా దర్శకురాలిగా, నటిగా, నృత్య కళాకారిణిగా నా కలలుపండించుకున్నాము.

ప్రశ్న: సినిమాలకు దర్శకత్వం వహిస్తారా?

జవాబు: అటువంటి ఉద్దేశ్యం లేదు.

ప్రశ్న: భవిష్యత్తులో ఏమైనా టి.వి. సీరియల్స్ తీస్తారా?

జవాబు: తీయవచ్చు.

ప్రశ్న: సినిమాల్లో భరతనాట్యపు విలువలు సన్నగిల్లాయా?

జవాబు: నా విషయంలో ఆ ప్రశ్నే ఉత్పన్నం కాదు. భరతనాట్యం నారక్తంలో వుంది.

ప్రశ్న: సినిమాల్లో పాత్రల కోసం యిబ్బందులెదుర్కొన్నారా?

జవాబు: లేదు..ఎప్పుడూ పాత్రల కోసం వెంపర్లాడ లేదు.

ప్రశ్న: టి.వి.ల వల్ల చిత్రాల్లో మీ భవిష్యత్తు దెబ్బతింటుందనుకుంటున్నారా?

జవాబు: లేదు. నూపుర్ నాకు మంచి గుర్తింపు తెచ్చి పెట్టింది కూడా.

ప్రశ్న: వ్యక్తిగతంగా, వృత్తిపరంగా వచ్చిన పరిణామాలు మీకు ఆనందదాయకంగా వున్నాయా?

జవాబు: ప్రపంచంలో నా లాంటి ఆనందదాయకమైన యువతి బహుశా ఎక్కడా దొరకదేమో!

నాట్యమే జీవిత ధ్యేయంగా భావించే డ్రీమ్‌గర్ల్ తను చేపట్టిన దర్శకత్వ బాధ్యతలలో మరెన్నో విజయాలను చవిచూడాలని ఆశిద్దాం. ●

# సినిమా...

## ''నవయుగం''

''స్వర్గీయ టి కృష్ణగారి పంథాలో తీసిన చిత్రమిది జనవరి 1న ఒంగోలులో ప్రారంభించి, ఫిబ్రవరి 10 వరకు నిర్విరామంగా షూటింగ్ ముగించాం'', అన్నారు ఆదిత్య ఈయన దర్శకత్వంలో ఎం నాగేశ్వరరావు నిర్మించిన టి కృష్ణ మెమోరియల్ పిక్చర్స్ వారి ''నవయుగం'' చిత్రంలో రాజేంద్రప్రసాద్, వినోద్‌కుమార్, మీనా, మహర్షి, రాఘవ, వేలు, చలపతిరావు, నర్రా, తాళ్ళూరి రామేశ్వరి, రేణుక, గౌరి, భీష్మ, సుజాత, జయశీల, నల్లూరి వెంకటేశ్వర్లు, ఎం బి కోటేశ్వరరావుతోపాటు ఈ తరం బాబూరావు నటించారు ఎం వి ఎస్ హరనాథరావు కథ, పాటలు రాశారు శ్రీ శ్రీ, నార్ల చిరంజీవి, ఆప్పలాచార్య, అదృష్టదీపక్, జి సుబ్బారావు గీతాలను కృష్ణచక్ర స్వరపరిచారు ప్రమీల నృత్యాలు, సోమనాథ్ శిల్పం, సత్తిబాబు కూర్పు, ఆర్ రామారావు చాయతో తిరుపతిరావు, ఎం. వీరయ్య నిర్వహణ బాధ్యతలు వహించారు

## ''మామ-అల్లుడు''

''భిన్న దృక్పథాలు గల మామా అల్లుళ్ళు జీవితాన్ని బాగా పండించుకొని, లౌక్యం విపరీతంగా తెలిసిన మంచి చెడ్డలు జీర్ణించుకున్న పారిశ్రామికవేత్త మామ ఆదర్శాలు, వాస్తవం ఒకటే అనుకుని, వాటితో బతకాలనుకునే అల్లుడు ఊహాలోకంలో విహరిస్తూ, తన చుట్టూ కనిపించేదే నిజమైన ప్రపంచంగా భావించే అత్త, ఈమె 'భర్తను లొంగదీసుకోవడం ఎలా?' అనే పుస్తక రచయిత్రి కూడానూ తల్లి కన్నా నాలుగాకులు ఎక్కువ చదివి, ఎవర్ని ఖాతరు చేయని కూతురు వీరందరి మధ్య జరిగే విచిత్రమైన సంఘటనలు ఈ చిత్రం,'' అన్నారు దాసరి దాసరి సినీ చిత్రవారి ''మామ-అల్లుడు'' చిత్రంలో ఈయన మామ, రాజేంద్రప్రసాద్ అల్లుడు, అత్త జయచిత్ర, కూతురు వాణీ విశ్వనాద్ ఇంకా అల్లురామలింగయ్య, పేకేటి శివరామ్, వేలు, మాడా, నగేష్‌బాబు, విజయలలిత, అనూరాధ, దేవి, చంద్రిక తదితర పాత్రదారులు కాశీ విశ్వనాద్ సంభాషణలు, వాసూరావు సంగీతం, ప్రతాప్ చాయ, సూర్యకుమార్ శిల్పం, స వి రమణబాబు సంయుక్త దర్శకత్వం కృష్ణంరాజు కూర్పుతో రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

''ఆడది''లో శారద



## నాగార్జున చిత్రాలు

మురళీమోహన్ చిత్రం జూన్‌లో మొదలవుతుంది మాతృక అయిన ''నందనం'' మలయాళ చిత్ర దర్శకుడు ప్రియదర్శన్ ఈ చిత్రానికీ దర్శకుడు

ప్రతాప్ పోతన్ దర్శకత్వంలో ఎ సత్యనారాయణ ఎస్ జగన్మోహన్‌లు నిర్మించే శ్రీ తిరుమలేశ ప్రొడక్షన్స్ చిత్రం కూడా జూన్‌లో సెట్స్‌కు వెళ్తుంది నాగార్జున సరసన గౌతమి నాయిక సింగీతం శ్రీనివాసరావు సంభాషణలకర్త ఇళయరాజా సంగీతం, పి సి శ్రీరాం చాయ, కోట తరణి శిల్పం, లెనిన్ కూర్పు తెరవెనుక హంగులు




# సినిమా....

## సుమన్ "జయసింహ"

"న్యాయం కోసం వెళ్లి నీలాపనిందలకు గురైన ఓ నిప్పులాంటి మనిషి అన్యాయాన్ని ఎలా ఎదుర్కొన్నాడు, పగవాళ్ళను ఎలా మట్టుపెట్టాడు అనే అంశాలు గల ఇతివృత్తం. సుమన్ మూడు విభిన్న రూపాలలో కనిపిస్తారు", అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పవన్ ఎంటర్‌ప్రైసెస్ నిర్మించే "జయసింహ" చిత్రంలో భానుప్రియ, ఖుష్బూ, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, వేలు, వినోద్, భీమరాజు, డిస్కో శాంతి వగైరా తారాగణం. గొల్లపూడి మారుతీరావు కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. దశరథరాం ఛాయ, సోమనాథ్ శిల్పం, శివశంకర్ నృత్యాలు, యోగి సంయుక్త దర్శకత్వం, గౌతంరాజు కూర్పుతో పి. సురేంద్రరెడ్డి నిర్మాణ సారథి.

## ఊర్వశి శారద "డాక్టర్ భవాని"

"చివరి షెడ్యూల్ ఏప్రిల్ 1 నుంచి 20 వరకు", అన్నారు ద్వారంపూడి నరసారెడ్డి. ఈయన సారథ్యంలో డి. జగదీశ్‌రెడ్డి నిర్మిస్తున్న రవికిరణ్ ఆర్ట్స్ మూవీస్ "డాక్టర్ భవాని" చిత్రంలో ఊర్వశి శారద, భానుచందర్, వాణీ విశ్వనాథ్, జగ్గయ్య, కిన్నెర, కిట్టు, గోపాలకృష్ణ, బ్రహ్మాజీ, రాధాబాయితో పాటు పరుచూరి గోపాలకృష్ణ పాత్రధారులు. అంజనేయపుష్పానంద్ కథ, పరుచూరి సోదరుల స్క్రిప్ట్, జొన్నవిత్తుల గీతాలు, చక్రవర్తి సంగీతం, ఆర్. రామారావు ఛాయ, రాజు శిల్పం, విక్కీ సాహసాలు, రఘురాం నృత్యాలు, నరసింహారావు కూర్పుతో ఎం. కొండలరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. ఎస్. గణేశ్ సమర్పణలో వై. నాగేశ్వరరావు దర్శకుడు.

## కృష్ణ, రమేష్‌లతో "ఆయుధం"

"నీతికి, న్యాయానికి కట్టుబడిన కలెక్టర్‌గా కృష్ణ, నమ్మకానికి- విశ్వాసానికి బద్ధుడైన చట్టాన్ని లెక్కచేయని వ్యక్తిగా రమేష్‌బాబు, నవ్వించే పాత్రలో రాధ, రమేష్ సరసన వాణీ విశ్వనాథ్, శివకృష్ణ సరసన యువశ్రీ నటించారు", అన్నారు కె. మురళీమోహనరావు. ఈయన దర్శకత్వంలో జి. సత్యనారాయణ నిర్మించే శ్రీ బాలాజీ ఫిలిమ్స్ "ఆయుధం" చిత్రంలో ఇంకా సత్యనారాయ వేలు, పి. ఎల్. నారాయణ, సాయికుమార్, మల్లికార్జునరావు, అనూరాధ పాల్గొన్నారు. సెల్వరాజ్ కథా సంవిధానం, పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతంతో జి. శివయ్య నిర్వహణ బాధ్యతలు వహించారు.

## "లారీ డ్రయివర్"

"జూన్ వరకు జరిగే మరో మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు బి. గోపాల్. ఈయన దర్శకత్వంలో రావు గోపాలరావు సమర్పించే జయా ప్రొడక్షన్స్ "లారీ డ్రయివర్" చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, శారద, రావు గోపాలరావు, దేవదాస్ కనకాల, తనికెళ్ళ భరణి, వినోద్, బ్రహ్మానందం, రాజా కృష్ణమూర్తి, అంజు, పవిత్ర, మాస్టర్ హరి, బాబూ మోహన్, తమిళనటుడు దినేష్, మలయాళ నటుడు దేవా పాత్రధారులు. పరుచూరి సోదరులు రచయితలు, చక్రవర్తి స్వరకల్పనలో జొన్నవిత్తుల, సీతారామశాస్త్రి గీతాలు రాశారు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, రాజు శిల్పం, రఘురామ్ నృత్యాలు, గోగినేని నరసింహారావు సంయుక్త దర్శకత్వం, బి. సుబ్బారావు సహకార దర్శకత్వం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో ఎస్. జయరామారావు నిర్మాత.

-జి.వి.జి.

Editorial Adviser: S. RADHAKRISHNA, Editor: VEERAJI.
Printed and Published by S. NAGESWARARAO for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.
Phones: Editorial: 75667, Business: 61247, 61248.